శ్రీః

## అనులోమ-విలోమ

# రాఘవయాదవీయమ్

శ్లేషయమకచక్రవర్తి శ్రీ వేంకటాధ్వరి విరచితమ్



హరిప్రియా - ఆంధ్రవ్యాఖ్య
'సహజపాండిత్య' 'తర్కకోవిద' 'విద్యావిభూషణ'
'తత్త్వశాస్త్రపారంగత'

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజిశర్మ**
M.A. (Sanskrit), M.A. (Telugu), M.A. (Darsanamulu)
పుష్పగిరి మహాసంస్థాన పండితులు



శ్రీః
శ్లేషయమకచక్రవర్తి శ్రీ వేంకటాధ్వరి విరచితమ్
**అనులోమ-విలోమ**
**రాఘవ యాదవీయమ్**
**హరిప్రియా ఆంధ్రవ్యాఖ్యాసముల్లసితమ్**

ప్రథమముద్రణ : జూన్ 30, 2012 తొలి ఏకాదశి
ప్రతులు : 500
పేజీలు : 104
వెల రూ. : 50/-



D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

శ్రీః

# వేంకటాధ్వరి

శ్రీరాఘవయాదవీయ మను ననులోమ – విలోమకావ్యమును సాంద్రవ్యాఖ్యానముగాఁ బాఠకుల కందించుచున్నందులకు డెంద మమందానందము నొందుచున్నది. ఈ దుష్కర – చిత్రకావ్యమును రచించిన మహాకవి వేంకటాధ్వరి సకలశాస్త్రకోవిదుఁడు, సరసకవితా కుశలుఁడు, చిత్రకావ్యరచనాచతురుఁడు, శ్లేషయమకచక్రవర్తి బిరుదాంకితుఁడు, బహుగ్రంథకర్త.

**జన్మభూమి – నివాసము:**

'శ్రీమదరశాణపాల వేంకటాధ్వరి మహాకవినా విరచిత విశ్వగుణాదర్శచంపూః' అను వచనమును బట్టి యితఁ'డరశాణపాల' గ్రామములో జన్మించి నట్లు స్పష్టము. 'అరశాణపాల' గ్రామ వర్ణనము విశ్వగుణాదర్శములోఁగలదు. 'అరశాణపాలై' – నల్లూరు మొదలగు గ్రామములు కాంచీపురమునకు సమీపములో నిప్పుడు కూడ నున్నవి. వేంకటాధ్వరి వంశజు లిప్పుడు కూడ నరశాణపాల గ్రామములో నివసించుచున్నారు.

ఇతఁ డరశాణపాల గ్రామములో జన్మించి విద్యాభ్యాసము పూర్తి చేసికొని కంచిలో నివసించి గ్రంథములను రచించినాఁడు.

'కాంచీమండలమండనస్య మఖినః' (విశ్వ – 2)

అని విశ్వగుణాదర్శ ప్రారంభము.

'శ్రీమత్కాంచీనగర వాస్తవ్యస్య వేంకటార్యయజ్వనః కృతిషు' అని విశ్వగుణాదర్శాంత గద్యము.

**శ్లో॥ కాంచీకవీంద్రకవనాదపి కోమలం తే**
**కల్యాణి! పాణితలమంబుజనాభకాంతే।**
**అద్యేదమర్థిషు బహుష్వభితన్యమాన**
**దానశ్రమాదరుణిమానముపైతి నూనమ్॥ –(లక్ష్మీ – సౌందర్య – 139 శ్లో)**





అని లక్ష్మీ సహస్రములో నమ్మ వారి పాణితలము తన కవనముకంటెను మృదువైన దని వర్ణించినాఁడు.

ఇక్కడ – 'కాంచ్యాం యః కవీంద్రో వరదార్యో వేదాంతదేశికో వా' అను బుధామోదినీ వ్యాఖ్య యంత రుచిర మైనది కాదు. **కాంచీ నామ నగరీ తత్రత్యకవీంద్రస్య వేంకటాధ్వరిణో మమేత్యర్థః** – అను బాలబోధినీ వ్యాఖ్య సరస మైనది. ఇదే కవి హృదయము.

ఈ వచనములనుబట్టి శ్రీ వేంకటాధ్వరి యెక్కువ కాలము కాంచీపురమునందే నివసించి యనేక గ్రంథములు రచించె నని విదిత మగుచున్నది.

**వంశము:**

వేంకటాధ్వరి యాత్రేయ గోత్రీయుఁడు. పరమవైష్ణవుఁడు. సీతమ్మ తల్లి. రఘునాథుఁడు తండ్రి. అప్పయ గురువు తాత గారు. ఇతఁడు కూడ ననేక యాగములను జేసిన దీక్షితుఁడే. ఈ యప్పయ్య దీక్షితుఁడు చతురధికశతగ్రంథ నిర్మాతలు శివాద్వైతులు నగు శ్రీమదప్పయ్య దీక్షితేంద్రులకంటె భిన్నుఁడు. ఇతఁడు పంచమతభంజనాచార్యులగు తాతాచార్యులకు మేనల్లుఁడు. ఈ తాతాచార్యులు – శ్రీమదప్పయ్య దీక్షితేంద్రులు సమకాలికులు.

ఈ విషయములు విశ్వగుణాదర్శములో స్పష్టముగా నున్నవి.

**శ్లో॥ కాంచీమండలమండనస్య మఖినః కర్ణాటభూభృద్గురో –**
**స్తాతార్యస్య దిగంతకాంతయశసో యం భాగినేయం విదుః।**
**అస్తోకాధ్వరకర్తు రప్పయగురో రస్త్యేష విద్వన్మణేః**
**పుత్రః శ్రీరఘునాథదీక్షితకవిః పూర్ణైర్గుణైరేధతే ॥ – విశ్వ – 2**

ఇతి శ్రీ పంచమతభంజననిబంధ విఖ్యాత తాతయజ్వ భాగినేయ సార్వపృష్ఠాప్తోర్యామాది యాజ్యాత్రేయ వంశమౌక్తికీభవ దప్పయార్యతనూభవ శ్లేషయమకచక్రవర్తి రఘునాథాచార్య తనయస్య శ్రీనివాసకృపాతిశయ సంవిదిత నయస్య సీతాంబాగర్భ సంభవస్య శ్రీమత్కాంచీనగర వాస్తవ్యస్య వేంకటయజ్వనః కృతిషు విశ్వగుణాదర్శ చంపూః సంపూర్ణా॥

శ్రీరాఘవయాదవీయ కావ్యాంతగద్యము కూడ నించుమించుగా నిట్లే యున్నది.

తన తండ్రి యగు రఘునాథుఁడు కవి యని వేంకటాధ్వరి చెప్పినాఁడు గాని యతఁడు రచించిన గ్రంథము లేవియో తెలియ రావు.

శ్రీ భాష్యకారులగు భగవద్రామానుజాచార్యుల సాక్షాచ్ఛిష్యులు, పాకశాలాధ్యక్షులు నగు ప్రణతార్తిహరాచార్యులు (కిడాంబి ఆచ్చాన్) వేంకటాధ్వరి వంశమునకు మూలపురుషులు. ఈ వంశమునందే శ్రీవేదాంతదేశికులకు మేనమామ, యాచార్యులు, న్యాయకులిశాది గ్రంథకర్తలు నగు వాది హంసాంబుదాచార్యులు (కిడాంబి అప్పుల్లార్) జన్మించినారు.

**శ్లో॥ ప్రఖ్యాతః ప్రణతార్తి హృద్గురురితి శ్రీభాష్యకర్తుర్మునే**
**ర్యో మాహానసికస్తదుక్తిరసికః శ్రీమాన్ స యత్రాభవత్।**

**వంశే తత్ర హి వాదిహంసజలదాచార్యాదిభిర్భూషితే**
**యజ్వాభూద్రఘునాథదేశికమణిః శ్రీశ్రీనివాసేప్సితః॥**
**-(హస్తి-1-4, విధిత్రయ-1-5)**

అని యీ విషయమును వేంకటాధ్వరియే స్వయముగా హస్తిగిరి చంపూ - విధిత్రయ పరిత్రాణములలోఁ జెప్పుకొనినాఁడు.

వేంకటాధ్వరి పూర్వపురుషవంశావళిని వారి వంశీయులనుండి సేకరించి శ్రీ కో. శఠకోపాచార్యులు విధిత్రయ పరిత్రాణోపోద్ఘాతములో ని ట్లుట్టంకించినారు.

1. ప్రణతార్తిహరాచార్యులు (కిడాంబి అచ్చాన్) 2. రామానుజాచార్యులు 3. శ్రీరంగరాజాచార్యులు (పద్మనాభాచార్యులు) 4. రామానుజాచార్యులు (వాది హంసాంబుదాచార్యులు) 5. వరదాచార్యులు 6. వేంకటాచార్యులు 7. వేదాంతాచార్యులు 8. రామానుజాచార్యులు 9. రంగనాథాచార్యులు 10. రామచంద్రాచార్యులు 11. ప్రణతార్తిహరాచార్యులు 12. లక్ష్మణాచార్యులు 13. వేంకటాచార్యులు 14. శ్రీరంగాచార్యులు 15. నరసింహాచార్యులు 16. పద్మనాభాచార్యులు. ఈ పద్మనాభాచార్యులకు 1. సుందరాచార్యులు 2. వరదాచార్యులు 3. ఇష్టి గోపాలాచార్యులు పుట్టిరి. వీరిలో రెండవ వారు. 17. వరదాచార్యులు 18. శ్రీనివాసాధ్వరి 19. రఘునాథదీక్షితులు 20. వేంకటాధ్వరి.

**కాలము:**

తన తాతగా రగు శ్రీనివాసాధ్వరికి (అప్పయ గురువు) మేనమామ యగు తాతాచార్యులు 'కర్ణాటభూభృద్గురు' వని వేంకటాధ్వరి చెప్పినాఁడు. ఈ కర్ణాటభూభృత్తు శ్రీకృష్ణదేవరాయలు.

'కర్ణాటభూభృతః కృష్ణరాయస్య' - అని భావదర్పణవ్యాఖ్య

'కర్ణాటదేశాధిపతే రాజ్ఞః కృష్ణరాయసంజ్ఞకస్య' - అని చంద్రికావ్యాఖ్య

శ్రీకృష్ణదేవరాయల రాజ్యకాలము. క్రీ॥శ॥ 1509-1530. శ్రీకృష్ణదేవరాయల గురు వగు తాతాచార్యులు 'సాత్త్వికబ్రహ్మవిద్యావిలాస' మను గ్రంథమును రచించినట్లు శ్రీకందుకూరి వీరేశలింగము పంతులు గారు (ఆంధ్ర కవులచరిత్ర - 2భా - 289 పుట) చెప్పుచున్నారు. మన వేంకటాధ్వరికి సంబంధించిన తాతాచార్యులు 'పంచమతభంజన' మను గ్రంథమును రచించినట్లు 'ఇతి శ్రీ పంచమతభంజననిబంధనవిఖ్యాత తాతయజ్వ' - అను విశ్వగుణా దర్శగద్యమును బట్టి తెలియుచున్నది.

ఈ తాతాచార్యు లిరువురు భిన్నులో యొక్కరో తేల్చి చెప్పుట కష్టము.

ఈ తాతాచార్యులు శ్రీకృష్ణదేవరాయల గురువు కాఁడని చంద్రగిరి రాజధానిగా నాంధ్రదేశము నేలిన వేంకటపతిరాయల (1585 - 1614) గురువని శ్రీ.జి.స్వామినాథాచార్య లభిప్రాయపడుచున్నారు. (వేంకటాధ్వరి కృత్యధ్యయనము - పుట 13). విజయీంద్రతీర్థులు (ద్వైతము), తాతాచార్యులు (విశిష్టాద్వైతము), అప్పయ్య దీక్షితులు (అద్వైతము) సేవప్ప నాయకుని



(క్రీ.శ. 1577) కొలువు నలంకరించినట్లు శాసనప్రమాణము గలదు.

**శ్లో॥ త్రేతాగ్నయ ఇవ స్పష్టం విజయీంద్రయతీశ్వరః।**
**తాతాచార్యో వైష్ణవాగ్ర్యః సర్వశాస్త్రవిశారదః॥**
**శైవాద్వైతైకసామ్రాజ్యః శ్రీమానప్పయదీక్షితః।**
**యత్సభాయాం మతం స్వంస్వం స్థాపయంతః స్థితా స్త్రయః॥**

(History of the Dvaita School of Vedanta - page - 399)

అప్పయ్యదీక్షితుల భ్రాతుష్పౌత్రుఁ డగు నీలకంఠదీక్షితులు - వేంకటాధ్వరి సహాధ్యాయు లైనట్లు సంప్రదాయము. నీలకంఠ దీక్షితుల నీలకంఠ విజయచంపూరచనాకాలము. క్రీ.శ. 1637 - (4738 కలివత్సరములు.)

**శ్లో॥ అష్టత్రింశదుపస్కృత, సప్తశతాధిక చతుస్సహస్రేషు।**
**కలివర్షేషు గతేషు, గ్రథితః కిల నీలకంఠవిజయోఽ యమ్॥ (నీలకంఠ - 1-10)**

అప్పటికి వేంకటాధ్వరికి 48 సంవత్సరముల వయస్సని శ్రీ కె. శఠకోపాచార్యులు చెప్పుచున్నారు.

అప్పయ్య దీక్షితుల సోదరుని మనుమఁడు నీలకంఠదీక్షితుఁడు. అప్పయ్య గురువు (శ్రీనివాసాధ్వరి) మనుమఁడు వేంకటాధ్వరి. అప్పయ్య దీక్షితుల నివాస మగు నడయపాలెము, అప్పయ్య గురువు నివాస మగు నరశాణపాలెము కంచికి సమీపములో నున్న పరిసరగ్రామము లగుటచే నీలకంఠదీక్షితులు - వేంకటాధ్వరి సహాధ్యాయు లగుట సంభవమే.

వేంకటాధ్వరి 'విధిత్రయపరిత్రాణము'లో నప్పయ్య దీక్షితుల 'విధిరసాయనము'ను ఖండించినాఁడు. 'మీమాంసామకరందములో' ఖండదేవుని 'భాట్టదీపిక'ను 'విధిత్రయ పరిత్రాణము'లో ఖండదేవుని 'మీమాంసాకౌస్తుభము'ను సమాలోచించినాఁడు. రాఘవ యాదవీయ వ్యాఖ్యలో భట్టోజీ దీక్షితుల ప్రౌఢమనోరమావాక్యముల నుదాహరించి నాఁడు.

అప్పయ్యదీక్షిత - ఖండదేవ - భట్టోజీదీక్షితులు సమకాలికులు. అప్పయ్యదీక్షితుల కాలము క్రీ.శ. 1554 - 1626 అని సంస్కృత వాఙ్మయేతిహాసములో శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు (హెచ్.సి.యస్.యల్. - పేజీలు 227, 924), ఖండదేవుని కాలము 1575 - 1665 అని మీమాంసాదర్శన వివేచనాత్మకేతిహాసములో గజాననశాస్త్రిగారు, భట్టోజీదీక్షితుల కాలము 1560 -1650 అని సంస్కృత వ్యాకరణశాస్త్రేతిహాసములో శ్రీయుధిష్ఠిరమీమాంసకులు పేర్కొనినారు.

జగన్నాథపండితరాయల తండ్రి యగు పేరుభట్టు కాశిలో ఖండదేవునియొద్ద మీమాంసాశాస్త్రము నభ్యసించినాఁడు. జగన్నాథుఁడు షాజహాను (1628 - 1658).

ఆస్థానపండితుఁడు. జగన్నాథుని జీవితకాలము 1590–1670. జగన్నాథుఁడప్పయ్య దీక్షితుల 'చిత్రమీమాంసకుఁబ్రతిగాఁ జిత్రమీమాంసాఖండనము'ను రచించి రసగంగాధరములోఁ గువలయానంద – చిత్రమీమాంసా – వృత్తివార్తికములను ఖండించినాఁడు. భట్టోజీదీక్షితుల 'శబ్దకౌస్తుభమును' 'శబ్దకౌస్తుభశాణోత్తేజనము'లో, 'ప్రౌఢమనోరమ'ను 'మనోరమాకుచ మర్దనము'లో ఖండించినాఁడు. జగన్నాథుని 'చిత్రమీమాంసాఖండనము'ను నీలకంఠ దీక్షితులు 'చిత్రమీమాంసాదోషధిక్కారము'లో ఖండించినాఁడు. అప్పయ్య దీక్షిత – భట్టోజీదీక్షిత – జగన్నాథులు సవయస్కులు కాకపోయినను సమకాలికు లగుట చారిత్రక సత్యము. అప్పయ్య దీక్షితులకు రెండవతరములో నున్నవారు ఖండదేవ – భట్టోజీదీక్షితులు. మూఁడవ తరములో నున్నవారు నీలకంఠ – వేంకటాధ్వరి – జగన్నాథులు.

దీనినిబట్టి వేంకటాధ్వరి కాలం కూడ 1590–1670 అని స్థూలముగా నిశ్చయింప వచ్చును. వేంకటాధ్వరి కాలము 1599 – 1699కు మధ్యకాల మని శ్రీ.జి. స్వామినాథాచార్యులు స్థూలముగా నిర్ణయించినారు. (వేంకటాధ్వరి కృత్యధ్యయనము – పుట 14). విధిత్రయపరిత్రాణో పోద్ఘాతములో శ్రీ కె. శఠకోపాచార్యులు వేంకటాధ్వరి కాలము. క్రీ.శ. 1590 – 1660 అని వక్కాణించినారు. శ్రీ మాడభూషి కృష్ణమాచార్యులు He was the famous author of Visvagunadarsa of the first half of 17th century (HCSL - Page 190.) అని చెప్పినారు.

వేంకటాధ్వరి 17వ శతాబ్దికి ఁజెందిన వా ఁడనుటలో నెవ్వరికిని విప్రతిపత్తి లేదు.

**సమకాలికులు:**

నీలకంఠవిజయ చంపువు, గంగావతరణము, శివలీలార్ణవము, నలచరిత్రనాటకము, కలివిడంబనము, సభారంజనము మొ॥ గ్రంథములు రచించిన నీలకంఠదీక్షితులు; గంగాలహరి, భామినీవిలాసము, రసగంగాధరము మొ॥ గ్రంథములు రచించిన జగన్నాథపండితరాయలు; కావ్యప్రకాశఖండనము రచించిన సిద్ధిచంద్రగణి మొ॥ వారు వేంకటాధ్వరికి సమకాలికులు (కావ్యప్రకాశఖండనోపోద్ఘాతము – పుట 10)

**జనశ్రుతులు:**

1. డిల్లీ మహారాజొకఁడు వేంకటాధ్వరికి స్వల్పసంభావన యిచ్చి పంపెనఁట. అది గైకొని వేంకటాధ్వరి 'శాకాయ వా స్యాల్లవణాయ వా స్యాత్' అని గొణిఁగి కొనుచు బైటకు వచ్చె నఁట. అంత నారాజు కవిని వెనుకకుఁబిలిచి 'యేమి పలుకు చుంటి వని' ప్రశ్నించె నఁట. వెంటనే వేంకటాధ్వరి–

**శ్లో॥ డిల్లీశ్వరో వా జగదీశ్వరో వా**
**మనోరథం పూరయితుం సమర్థః।**
**అన్యేన కేనాపి నృపేణ దత్తం**
**శాకాయ వా స్యాల్లవణాయ వా స్యాత్॥**



అని బదులు చెప్పెనఁట. దానికి సంతసించిన ఢిల్లీరాజు వేంకటాధ్వరిని భూరి ద్రవిణముతో సత్కరించె నఁట.

2. వేంకటాధ్వరి యుత్తరభారతదేశములో నుండఁగా నిద్దఱు వ్యక్తులు తగవులాడికొని రఁట. వారి భాష వేంకటాధ్వరికి రాదు. వా రిరువురు వేంకటాధ్వరిని సాక్షిగా నుంచుకొని న్యాయస్థానము చేరి రఁట. అక్కడ వేంకటాధ్వరి యేకసంథాగ్రాహి యగుటచే రాని భాషలో – 'అతఁ డిట్లు పలికెను; ఇతఁ డిట్లు పలికె' నని తూచా తప్పకుండ వారి వాక్యములను యథాతథముగా నప్పగించె నఁట. వేంకటాధ్వరి జ్ఞాపకశక్తిని వాక్చాతుర్యమును మెచ్చుకొని న్యాయాధిపతి యాశ్చర్యపడి కవికి సమ్మానము చేసి పంపె నఁట.

ఈ రెండు కథలు జగన్నాథపండితరాయల విషయములోఁ గూడఁ బ్రసిద్ధములు.

3. వేంకటాధ్వరి విశ్వగుణాదర్శములో దేవతల యందుఁ బుణ్యక్షేత్రములయందు దోషము లారోపించి వర్ణించుటచేఁ గన్నులు పోయినవఁట. మఱల శ్రీనివాససహస్రము, లక్ష్మీసహస్రము రచించుటచేఁ గన్నులు వచ్చినవఁట. నేఁడు శ్రీనివాససహస్రము లభించుట లేదు.

4. వేంకటాధ్వరి బంధు వొకఁడు చనిపోఁగా శవమును మోయుటకు వాహకు లెవ్వరు రాలేదఁట. అప్పుడు వేంకటాధ్వరి వీఁడు బ్రతికియు నిర్వాహకుఁడే (అప్రయోజకుఁడే యని వ్యంగ్యము); చచ్చియు నిర్వాహకుఁడే (వాహకులు లేని వాఁడే) యని పలికె నఁట. దీనిని బట్టియే తమిళములో "శ్వాసంపోనాలుం ప్రాసం పోగాదు" (ప్రాణము పోయినను ప్రాసము పోదు) అను సామెత యేర్పడె నఁట.

## గ్రంథములు

వేంకటాధ్వరి 108 గ్రంథములను రచించె నని ప్రతీతి. వీనిలోఁ బెక్కు గ్రంథములు నష్టము లగుటచే వాని పేరులు కూడఁ దెలియవు. లభించిన గ్రంథములలో నన్నియు ముద్రింపఁ బడలేదు. ముద్రిత గ్రంథములలోఁ గూడ (1) విశ్వగుణాదర్శచంపువు (2) లక్ష్మీసహస్రమునను రెండు గ్రంథములు మాత్రమే ప్రచురప్రచారము గాంచినవి. శ్రీ మాడభూషి కృష్ణమాచార్యులు–

(1) విశ్వగుణాదర్శము (2) లక్ష్మీసహస్రము (3) యాదవరాఘవీయము (4) ఉత్తర చంపువు (5) వరదాభ్యుదయము (హస్తిగిరి చంపువు) (6) ఆచార్యపంచాశత్తు (7) శ్రవణానందము (8) సుభాషితకౌస్తుభము (9) ప్రద్యుమ్నానందనాటకము (10) శృంగారదీపికాభాణము (11) సుభద్రా పరిణయనాటకము (12) ద్రావిడగాథా సహస్రానువాదము ననువానినిఁ బేర్కొనిరి.

శ్రీ కె. శఠకోపాచార్యులు విధిత్రయ పరిత్రాణోపోద్ఘాతములో – (1) మహాభాష్యస్ఫూర్తి (2) యజ్ఞుఃప్రకాశిక (3) మణిసార ఖండనము (4) వ్యుత్పత్తుబోధ (5) న్యాయమకరందము (6) న్యాయపద్మము (7) విధిత్రయపరిత్రాణము (8) యతిప్రతివందనఖండనము (9) రామాయణవ్యాఖ్య–వాల్మీకిహృదయము (10) ఆచార్యపంచాశత్తు (11) లక్ష్మీసహస్రము (12)

శ్రీనివాససహస్రము (13) శ్రవణానందము (14) యాదవరాఘవీయము (15) సుభాషిత కౌస్తుభము (16) విశ్వగుణాదర్శము (17) ఉత్తరచంపువు (18) వరదాభ్యుదయ చంపువు (19) ప్రద్యుమ్నానందనాటకము (20) సుభద్రాపరిణయనాటకము (21) శృంగార దీపికాభాణము (22) ముకుంద విలాసభాణము (23) యధోక్తకారిభాణము నను గ్రంథములను బేర్కొనిరి.

శ్రీ జి.స్వామినాథాచార్యులు - వేంకటాధ్వరి కృత్యధ్యయనములో - (1) నయద్యుమణిదీపిక (2) శ్రీవిభుత్వసమర్థనము (3) శ్రీనివాస విలాసచంపువు నను గ్రంథములను గూడఁ బేర్కొనిరి.

శ్రీ హెచ్.వి. నాగరాజరావు గారు సుభాషితకౌస్తుభ పీఠికలో - శ్రీ వేంకటేశ్వర చూర్ణికావ్యాఖ్యను గూడ వేంకటాధ్వరి రచించినట్లు చెప్పుచున్నారు.

వీనిలో శ్రీనివాస చంపూకావ్యము ప్రస్తుత వేంకటాధ్వరి రచించినది కాదు.

## శ్రీనివాసచంపూకర్త యే వేంకటాధ్వరి?

శ్రీనివాసచంపువునందలి కథావస్తువు పద్మావతీ-శ్రీనివాసుల కళ్యాణమే. కాని యిది యొక విలక్షణమైన కావ్యము. దీనిలో (1) పూర్వ విలాసము (2) ఉత్తర విలాసము నను రెండు విభాగములు గలవు. పూర్వ విలాసములో 5 ఉచ్ఛ్వాసములు, ఉత్తర విలాసములో 5 ఉల్లాసములు గలవు. పూర్వవిలాసము చంపూపద్ధతిలోఁ బద్యగద్యాత్మకముగా నున్నది. ఉత్తర విలాసము నాటకరీతిలో సంభాషణ రూపముగా నున్నది. దీనిని రచించిన కవి కూడ వేంకటాధ్వరియే. ఇతఁడు కూడఁ జిత్రకవితాప్రియుఁడే. దీని యందుఁ గూడ (1) చక్రబంధము (2) ఆతపత్రబంధము (3) అష్టదళ పద్మబంధము గలవు. ఈ కావ్యము నిండ యమకములు, శ్లేషములు, పరిసంఖ్యలు పుష్కలముగాఁ గలవు. దీనిని రచించిన వేంకటాధ్వరి, విశ్వ గుణాదర్శకర్త యగు వేంకటాధ్వరియే యని కొందఱు భ్రాంతిపడుచున్నారు. ఈ విషయమును సంగ్రహముగాఁ బరిశీలింతము. పాఠకులసౌకర్యమునకై విశ్వగుణాదర్శకర్త నాత్రేయ వేంకటాధ్వరి యని; శ్రీనివాసచంపూకర్తను 'శ్రీనివాసవేంకటాధ్వరి' యని వ్యవహరింతము.

ఆత్రేయ వేంకటాధ్వరి విశ్వగుణాదర్శగద్యము ముందే యుదాహరింపఁబడినది.

శ్రీనివాస వేంకటాధ్వరి - శ్రీనివాసచంపువులో గ్రంథాంతపుష్పిక లొక్కొక్క చోట నొక్కొక్క విధముగా నున్నవి.

1. ఇతి శ్రీమన్నిఖిలభూచక్రవర్తి విపశ్చిద్వంద్యపాద శ్రీవేంకటాధ్వరికవేః కృతౌ శ్రీనివాస చంపూకావ్యే ప్రథమ ఉచ్ఛ్వాసోఽయ మత్ర సమాపన మాప॥

2. ఇతి శ్రీమత్కవీంద్రవర్య శ్రీవేంకటాధ్వరి 'కవిరాజ' కృతౌశ్రీనివాసచంపూకావ్యే ద్వితీయోచ్ఛ్వాసః

3. ఇతి శ్రీమదశేషకావ్యపారావార గమననౌకాయమాన చరణాభివందన నృకంఠీరవాచార్యసూరి హీరాంతేవాస్యన్యతమస్యాక్లిష్టరచనాపటోః స్వకీర్తికదంబధవలితదిగ్భిత్తి 'వేంకటగిరినివాసి' -





వేంకటక్ష్మాపాల పాద యుగలాశ్రితస్య - అప్రయాసాసాదిత సాహిత్య కలస్య 'కవిమశకశిశో' ర్దేశికచరణ సరసీరుహసమర్పిత నిజసుతస్య వేంకటేశస్య కృతిషు పూర్వశ్రీనివాసవిలాసో నామ శ్లేషోత్తరకావ్యబంధః పర్యాప్తః పంచమ ఉచ్ఛ్వాసోఽయమ్॥

4. ఇతి శ్రీమద్వేంకటాధ్వరి మహాకవీంద్రకృతౌ శ్రీనివాసవిలాస చంపూకావ్యే ఉత్తరవిలాసస్య ప్రథమ ఉల్లాసః పూర్ణోఽయం జ్ఞేయః ॥

5. ఇతి శ్రీమద్వేంకటాధ్వరికృతౌ శ్రీనివాసచంప్వా ముత్తరవిలాసే॥

6. శ్లో॥ **కంఠే కంఠీరవాఖ్యాం ప్రతికలమధురాం బిభ్రతః సూరిచూడా**
**రత్న స్యాంతేవసన్ యః కలయతి కవితాం గద్యపద్యావబద్ధామ్।**
**తస్య శ్రీశ్రీనివాసప్రభువర రచితే వేంకటేశస్య కావ్యే**
**పర్యాప్తః శ్లేషసారే కవిమశకశిశోః పంచమోఽయం విలాసః॥**

ఇతి శ్రీమన్నిఖిలశ్లిష్టరచనాధౌరేయ - కవిచూడామండితమకుటలలా మావలీనీరాజిత చరణయుగల శ్రీమద్వేంకటాధ్వరి విరచితాయాం శ్రీనివాసవిలాసాభిధాశాలిన్యాం చంప్వాముత్తర విలాసే పంచమోఽ య ముల్లాసఃసమాప్తోఽయం గ్రంథః॥

ఈ గద్యములను బట్టి తేలిన సారాంశ మిది-

1. ఈగ్రంథాంతపుష్పిక లన్నియు విశ్వగుణాదర్శ - రాఘవయాదవీయాది గ్రంథాంత గద్యములకు భిన్నములుగా నున్నవి.

2. విశ్వగుణాదర్శకర్త యగు నాత్రేయవేంకటాధ్వరి కాంచీనివాసి. శ్రీనివాసచంపూకర్త యగు శ్రీనివాసవేంకటాధ్వరి వేంకటగిరివాస్తవ్యుఁడు.

3. విశ్వగుణాదర్శకర్త 'శ్లేషయమకచక్రవర్తి' బిరుదాంకితుఁడు. శ్రీనివాసచంపూకర్త 'కవిరాజ' బిరుదాంకితుఁడు.

4. విశ్వగుణాదర్శ - లక్ష్మీసహస్రాదికావ్యకర్త రాజాశ్రయవిముఖుఁడు. శ్రీనివాసచంపూకర్త వేంకటక్ష్మాపాలు నాశ్రయములో నున్న వాఁడు.

5. విశ్వగుణాదర్శకర్త తన గురువుల పేరులు చెప్పలేదు.

శ్రీనివాసచంపూకర్త గురువు నృకంఠీరవాచార్యసూరి.

6. శ్రీనివాసచంపూకర్త తన్ను గూర్చి 'కవిమశకశిశు'వని చెప్పుకొన్నాఁడు. విశ్వగుణాదర్శకర్త యట్లు చెప్పుకొన లేదు.

కాఁబట్టి విశ్వగుణాదర్శకర్త యగు నాత్రేయవేంకటాధ్వరి; శ్రీనివాసచంపూకర్త యగు శ్రీనివాసవేంకటాధ్వరి భిన్ను లని సిద్ధాంతము.

శ్రీనివాసవిలాసచంపూకావ్యము 'శ్రీనివాసాంకము'. అనఁగా నిందలి ప్రత్యుచ్ఛ్వాసము నందుఁ జివరిశ్లోకములో 'శ్రీనివాస'పదము వాడఁబడినది. ఈ శ్రీనివాసవిలాసము

నిర్ణయసాగరము వారిచే ధరణీధరకృతటీకతోఁ బ్రకటింపఁబడినది. మంత్రాలయము - శ్రీరాఘవేంద్రస్వామి మఠము వారిచే మూలమాత్రము ప్రకటింపఁబడినది.

ఇది నవదుర్గ కృష్ణకవి సార్వభౌముఁడు రచించిన శ్రీనివాసవిలాసచంపువు ('తిరుపతివేంకటకవుల' యనువాదము) కంటె భిన్నమైనది.

ఇప్పుడు మన యాత్రేయవేంకటాధ్వరి కృతులను సంక్షేపముగా సమీక్షింతము.

## స్తోత్రకావ్యములు

### 1. ఆచార్యపంచాశత్తు:

ఇది 50 శ్లోకములలో శ్రీవేదాంతదేశికులను స్తుతించు లఘుస్తోత్రకావ్యము. 'వడగలై' వైష్ణవసంప్రదాయమునకుఁ జెందినది. మచ్చునకు రెండుశ్లోకములు-

**శ్లో॥ ప్రబంధాన్ కర్తారః ప్రతిజనపదం సంతి బహవ**
**స్త్రయీచూడాచార్యైః సహగణన మర్హంతి న హి తే।**
**సమంతా జ్జృంభంతాం దిశి దిశి శకుంతాః కృతరవాః**
**ప్రకల్పంతే కిం తే? సరణి మనుసర్తుం ఖగపతేః॥**

**శ్లో॥ య ద్యత్రావజిగాహిషా యతిపతేః సిద్ధాంతదుగ్ధాంబుధా**
**వుద్యద్దర్పకుదృష్టిసర్పదమనే యద్యస్తి కౌతూహలమ్।**
**జిజ్ఞాసా యది వా రహస్యకృతిషు ప్రాజ్ఞాః కురుధ్వం తదా**
**త్రయ్యంతార్యపదారవిందయుగళీపర్యంతలగ్నమ్ మనః॥**

వేంకటాధ్వరికి శ్రీవేదాంతదేశికు లన్నచో ఁబ్రగాఢ మైన భక్తి.

ఇది నాగరాజవిరచితవ్యాఖ్యతో మైసూరు - సుధర్మాపత్రికయందు ధారావాహికముగాఁ బ్రకటింపఁబడినది.

### 2. లక్ష్మీసహస్రము:

సంస్కృతస్తోత్రకావ్యములలో నింత మధుర మైన బృహత్కావ్య మింకొకటి లేదు. లక్ష్మీసహస్రములో 1. ప్రారంభ 2. ప్రాదుర్భావ 3. వక్షఃస్థలావస్థాన 4. కారుణ్య 5. కటాక్ష 6. ప్రయత్న 7. మంగళ 8. సౌందర్య 9. శృంగార 10. ఐశ్వర్య 11. క్షాంతి 12. ఉత్సవ 13. ఔదార్య 14. యమక 15. నక్షత్రమాలా 16. విచిత్ర 17. నామవైభవ 18. సద్మవైభవ 19. అభీతి 20. పరిసంఖ్యా 21. దశావతార 22. చిత్ర 23. సంకీర్ణ 24. నిర్వేద 25. ఫలము లను 25 స్తబకములు మొత్తము 1017 శ్లోకములు గలవు. వీనిలో సౌందర్యస్తబకము మిక్కిలి పెద్దది. 235 శ్లోకములు. విచిత్రస్తబకము మిక్కిలి చిన్నది. 11 శ్లోకములు. ఛందోవైవిధ్యము మిక్కుటముగా గలదు. యమక - చిత్రస్తబకములలో వేంకటాధ్వరి కవితాకళలో విశ్వరూపమును బ్రదర్శించినాఁడు.





కొన్ని మచ్చుశ్లోకములు - అనుప్రాసము.

**శ్లో॥ సుచారుమధుమోచికారసముచో వచోదేవతా**
**కుచామృతకచాకచిప్రచురచాతురీమేదురాః।**
**నరాః! సతతమిందిరాగుణకథాసుధాదోహినీ**
**రుపాధ్వమిహ వేంకటాధ్వరికవే రుదారా గిరః॥ (1-26)**

**శ్లో॥ అపారపరితాపకృ ద్భవతపాతపాంథా వయం**
**ప్రపామివ సుపావనీం తవ కృపాముపాసీమహి।**
**ఉదంచితధనంజయః ప్రభు రుదారహేతి ర్యయా**
**యయా వుదధికన్యకే! తపనమధ్యగః శీతతామ్॥ (4-22)**

**అద్భుతకల్పనములు**

**శ్లో॥ అగ్రే మురారేరరవిందపీఠే, హరిత్కరీంద్రై రభిషిచ్యమానామ్।**
**అవేక్ష్య పుత్రీ మఖిలేశ్వరీం త్వా, మానందసింధౌ నిమమజ్జ సింధుః॥ (2-19)**

లక్ష్మీదేవి క్షీరసముద్రరాజతనయ కదా! శ్రీమన్నారాయణున కెదురుగాఁ బద్మాసనముపైఁ గూర్చుండి దిగ్గజేంద్రములచే నభిషేకింపఁబడుచున్న యఖిలేశ్వరి యగు తన కొమార్తెను శ్రీమహాలక్ష్మిని గాంచి సముద్రుఁడానందసముద్రములో మునిఁగి నాఁడఁట! ఎంత చక్కని కల్పనము.

**శ్లో॥ భో భూప భూమౌ భ్రమ భీమపాప**
**భూమేతి మే మూర్ధ్ని లిపిం విధాతుః।**
**పవర్గగర్భాం పరిమృజ్య పద్మే!**
**కరో త్యపాంగో హ్యపవర్గగర్భామ్॥ (5-54)**

"ఓరీ! భయంకరమైన పాపములు విస్తారముగాఁ జేసినవాఁడా! రాజుల భూములలో భ్రమింపుము!" అని నా తలపై బ్రహ్మదేవుఁడు వ్రాసిన పవర్గలిపిని (ప-ఫ-బ-భ-మలను) పూర్తిగాఁ జెఱిపి వైచి ఓ లక్ష్మీ! నీ క్రేఁగంటి చూపు- అపవర్గము (మోక్షము)ను గల్గఁ జేయుచున్నది. పవర్గము - అపవర్గము ననుచోట గొప్ప విరోధాభాసకల్పనము.

**అత్యద్భుత చిత్రకవితాకళ - చతురంగ తురంగ పదబంధము-**

**శ్లో॥ రమావరాభితాపాసా నీరజోదరపాద్యహి।**
**నయాసమాభయాభామాసావనాతాపమస్యతు॥ (22-25)**

ఈ శ్లోకములో 32 అక్షరములు గలవు. చదరంగపుబల్లయందలి 64 గడులలో నీ శ్లోకమునే రెండు మాఱులు వ్రాసినచో 64 అక్షరము లిముడును. ఒకటవ గడి మొదలుకొని గుఱ్ఱపు టెత్తులు గల 32 గడులయందలి యక్షరములను గలిపి చదివినచో

**శ్లో॥ రజో భిదృతు యాతాయావరపామామమావనీ।**
**ససారరాభస్యహితాభాసాపాపదమాననా॥**

అని మఱియొక శ్లోకము వచ్చును. ఇది కూడ రెండు మాఱులు తిరుగును.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ర<br>1 | మా<br>30 | వ<br>9 | రా<br>20 | భి<br>3 | తా<br>24 | పా<br>11 | సా<br>26 |
| నీ<br>16 | ర<br>19 | జో<br>2 | ద<br>29 | ర<br>10 | పా<br>27 | దృ<br>4 | హి<br>23 |
| న<br>31 | యా<br>8 | స<br>17 | మా<br>14 | భ<br>21 | యా<br>6 | భా<br>25 | మా<br>12 |
| సా<br>18 | వ<br>15 | నా<br>32 | తా<br>7 | ప<br>28 | మ<br>13 | స్య<br>22 | తు<br>5 |
| ర<br>33 | మా<br>62 | వ<br>41 | రా<br>52 | భి<br>35 | తా<br>56 | పా<br>43 | సా<br>58 |
| నీ<br>48 | ర<br>51 | జో<br>34 | ద<br>61 | ర<br>42 | పా<br>59 | దృ<br>36 | హి<br>55 |
| న<br>63 | యా<br>40 | స<br>49 | మా<br>46 | భ<br>53 | యా<br>38 | భా<br>57 | మా<br>44 |
| సా<br>50 | వ<br>47 | నా<br>64 | తా<br>39 | ప<br>60 | మ<br>45 | స్య<br>54 | తు<br>37 |

దీనిని శ్రీవేదుల సూర్యనారాయణ శర్మగారి ట్లనువదించినారు–

| | |
|---|---|
| విద్యున్మాల | విద్యున్మాల |
| చతురంగబంధము | తురంగపదబంధము |
| రారా రావా రాధాతామా | రామారామా మారా మారా |
| ధ్యారామా భామా కామారా | రామాతాపోపేతా రాధ్యా |
| జే రాజాతా సారాభాపో | జా మారావాసాతా రాధా |
| మా రా జే మా ధీపేతా మా | భామాకా ధీభారా జేజే. |





| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రా<br>1 | రా<br>30 | రా<br>9 | వా<br>20 | రా<br>3 | ధా<br>24 | తా<br>11 | మా<br>26 |
| ధ్యా<br>16 | రా<br>19 | మా<br>2 | భా<br>29 | మా<br>10 | కా<br>27 | మా<br>4 | రా<br>23 |
| జే<br>31 | రా<br>8 | జా<br>17 | తా<br>14 | సా<br>21 | రా<br>6 | భా<br>25 | పో<br>12 |
| మా<br>18 | రా<br>15 | జే<br>32 | మా<br>7 | ధీ<br>28 | పే<br>13 | తా<br>22 | మా<br>5 |
| రా<br>33 | రా<br>62 | రా<br>41 | వా<br>52 | రా<br>35 | ధా<br>56 | తా<br>43 | మా<br>58 |
| ధ్యా<br>48 | రా<br>51 | మా<br>34 | భా<br>61 | మా<br>42 | కా<br>59 | మా<br>36 | రా<br>55 |
| జే<br>63 | రా<br>40 | జా<br>49 | తా<br>46 | సా<br>53 | రా<br>38 | భా<br>57 | పో<br>44 |
| మా<br>50 | రా<br>47 | జే<br>64 | మా<br>39 | ధీ<br>60 | పే<br>45 | తా<br>54 | మా<br>37 |

నిజముగా నిట్టి శ్లోకబంధములు కవికి – వ్యాఖ్యాతకు – అనువాదకునకుఁబాఠకునకుఁ గూడ ధీభారము కల్గించునవే. లక్ష్మీసహస్రములో నిట్టివి 20 బంధములు కలవు.

## ఫలశ్రుతి

**శ్లో॥ హృద్యం పద్యసహస్రమేత దనఘం సంశృణ్వతః కంపతాం**
**మోదేనాదిమశాబ్దికస్య ఫణినో మూర్ధ్నాం సహస్ర మ్ముహుః ।**
**తత్కాలోదితచారుమారుతధుతత్వత్కేలిగాధశ్రమం**
**ప్రత్నం సంప్రతి మే ప్రసీదతు రమే! పక్షీంద్రవాహం మహః ॥ (25–11)**

ఓ లక్ష్మీదేవి! పాపరహితములు హృద్యములు నైన యీ వేయి పద్యములను విని సంతోషముతో నాదిశాబ్దికుఁడు – పతంజలిరూపుఁ డైన యాదిశేషుఁడు వేయిపడగలను మాటి మాటికి నూపుఁ గాక! అప్పుడా పడగలనుండి పుట్టిన చల్లని గాలిచే నీకేళిలోఁ దేలుటచేఁ గలిగిన గాఢశ్రమము తొలఁగిన ప్రాచీనము, గరుడవాహనము గల దివ్యతేజస్సు – శ్రీమన్నారాయణమూర్తి న న్ననుగ్రహించుఁగాక! ఎంత చమత్కార చాతుర్యము.

శ్రీవేదాంతదేశికుల పాదుకాసహస్రము నాదర్శముగాఁగైకొని వేంకటాధ్వరి యీ లక్ష్మీసహస్రమును నిర్మించినాఁడు. పాదుకాసహస్రముకంటెను లక్ష్మీసహస్రమే లోకప్రియమైన స్తోత్రకావ్యము. దీని కనేకము లగు వ్యాఖ్యలు, అనువాదములు, అనుకరణములు వెలసినవి.

### వ్యాఖ్యలు

1. కౌశిక గోపాలాచార్యులు – బుధామోదిని
2. శ్రీనివాస పండితుఁడు – బాలబోధిని (రావజీ మహారాజు)
3. మానవల్లి రామశాస్త్రి – నిశ్రేణిక
4. 'శ్లేషయమకచక్రవర్తి' – కిరీటి వేంకటాచార్యులు – వ్యాఖ్య
   (అచలాత్మజాపరిణయకర్త)
5. శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలయతి – విస్తరవ్యాఖ్య

వీనిలో 1-2-3 వ్యాఖ్యలు ముద్రింపఁబడినవి. 4-5 వ్యాఖ్యల లిఖిత ప్రతులు ఖమ్మం వాస్తవ్యులు శ్రీనివాసాచార్యులయొద్ద నున్నట్లు శ్రీ జి. స్వామినాథాచార్యులు చెప్పుచున్నారు.

తాడేపల్లిగూడెము వాస్తవ్యు లొకరు లక్ష్మీసహస్రమున కాంధ్రవ్యాఖ్యానము రచించి ప్రకటించినట్లు శ్రీరావి మోహనరావుగా రొక మాఱు నాతోఁ జెప్పిరి కాని యా గ్రంథము నాకు లభింపలేదు.

### ఆంధ్రపద్యానువాదము

'సరస్వతీకంఠాభరణ' బిరుదవిరాజితులు, కళాప్రపూర్ణులు, కాఁకరపఱ్ఱు గ్రామవాస్తవ్యులు నగు బ్రహ్మశ్రీ వేదుల సూర్యనారాయణశర్మ గారు లక్ష్మీసహస్రమునకుఁ జక్కని పద్యానువాదమును సమర్థవంతముగా రచించిరి. దీనిలో మూలమునందలి యమకములు, శ్లేషములు, చిత్రములు, బంధములు, చమత్కారములు సంపూర్ణముగాఁ బ్రతిబింబించినవి. నేను శివకర్ణామృతము నాంధ్రీకరించుటకు శ్రీవేదుల వారి యాంధ్రలక్ష్మీసహస్రమే ప్రేరకము.

### సహస్రశ్లోకస్తోత్రకావ్యములు

1. శ్రీ వేదాంతదేశికులు (14శ.) – పాదుకాసహస్రము.
2. వేంకటాధ్వరి (17శ.) – లక్ష్మీసహస్రము.
3. నారాయణ భట్టాత్రి (17శ.) – నారాయణీయము (1035శ్లో)
4. బొమ్మగంటి నృసింహశాస్త్రి (1856–1934) – తిలకసహస్రము
5. కావ్యకంఠ గణపతిముని (1878–1936) – ఉమాసహస్రము
6. తిరుపతి వేంకటకవులు (1870 – 1950) – కాళీసహస్రము.
7. దేవరకొండ లక్ష్మీనరసింహకవి (20శ.) – దేవీసహస్రము.
8. విశ్వనాథ సత్యనారాయణ (1895 – 1976) –శివసహస్రము.
9. వసంతత్ర్యంబక శేవడే (1917 – 2000) – స్తవమంజూష (1008శ్లో.)

మొదలగునవి సంస్కృతములోఁ బుట్టినవి.





ప్రసాదరాయకులపతి – 1. ఐంద్రీసాహస్రి
(ప్రస్తుత కుర్తాళపీఠాధిపతి) – 2. శివసాహస్రి

ముప్పాళ్ల గోపాలకృష్ణమూర్తి (1973) – శ్రీభద్రాద్రిరామసాహస్రి (1116 సీసపద్యములు)

యామిజాల పద్మనాభస్వామి – 3. శ్రీవేంకటేశ్వరసహస్రము (1980)
4. కామాక్షీసహస్రము (1984)

మొదలగు తెలుఁగు సహస్రపద్యకావ్యములు పుట్టినవి. ఈ విధముగా లక్ష్మీసహస్రప్రభావ మనంతరసాహిత్యముపై నెక్కువగాఁ గలదు.

### 3. శ్రవణానందము

ఇది శ్రీవేంకటేశ్వరస్వామి, శ్రీవరదరాజస్వామి మొదలగు నర్చావతారములను స్తుతించు 200 శ్లోకముల స్తోత్రకావ్యము. ఇందు శ్రీవైష్ణవసిద్ధాంతములు చక్కఁగాఁ బ్రతిపాదింపఁ బడినవి. యమకములు కూడ నెక్కువగాఁ గలవు. శైలి తెలియుటకై మూఁడు శ్లోకములను బఠింపుఁడు–

**శ్లో॥ ఓంకారస్య రహస్య మి త్యజ ఇతి బ్రహ్మేతి సర్వాత్మనా**
**మాత్మేతి ప్రకృతేః పరః పురుష ఇ త్యాద్యైః స్వయంభూ రితి।**
**వేదాంతై రవబోధితాయ భగవన్! విశ్వైకజీవాతవే**
**బోధానందమయాయ సింధుదుహితు ర్నాథాయ తుభ్యం నమః॥**

**(శ్రవణా 1-13)**

**శ్లో॥ వందారుషు మందారమమందార్తిహరం తే**
**వందామహ ఇందావపి నిందావహమాస్యమ్।**
**మారారికుమారాది సమారాధితమూర్తే**
**నారాయణ! ఘోరాదపచారాదిహ పాయాః॥ (శ్రవ -1-87)**

**శ్లో॥ మరుతాం భగవన్! కురుతాం విరతిం**
**లషతాం మిషతాం ద్విషతాం తతయః।**
**భవతామనుజీభవతా మృదుతాం**
**జహతా మహతా నిహతా ఇహ తాః॥ (శ్రవ 1-90)**

## చంపూకావ్యములు

### 4. ఉత్తరకాండ చంపువు

భోజమహారాజు చంపూరామాయణమును సుందరకాండము వఱకే రచించినాఁడు. లక్ష్మణసూరి యుద్ధకాండమును బూరించినాఁడు. ఉత్తరకాండమును బూరించుటకై పెక్కు

మంది కవు లుత్తరరామాయణచంపువులు రచించినారు. వానిలో వేంకటాధ్వరి రచించిన యుత్తరచంపు వొకటి.

**శ్లో॥ యః కాండాన్ నిబబంధచంపువిషయాన్ పంచాపి భోజః కవి**
**ర్యో వా షష్ఠమచష్టలక్ష్మణకవిస్తాభ్యాముభాభ్యా మపి।**
**కారుణ్యాదివిశేషితం కలిమలక్షేపాయ రామాయణే**
**కాండం సప్తమముద్గృణాతు రసనా చంపూప్రబంధాత్మనా॥**

అని వేంకటాధ్వరియే చెప్పినాఁడు. దీనిలో రావణ -వాలి - హనుమచ్చరిత్రము లెక్కువగా వర్ణింపఁబడినవి. భోజచంపువు యథావాల్మీకము. ఇం దవాల్మీకము లగు కథ లెక్కువగా నుండుటచే నిది భోజచంపూరామాయణమునకు శేషము కాఁజాల దని శ్రీభవినాథత్రిపాఠి గారి యభిప్రాయము. శైలి తెలియుటకై రెండు శ్లోకములు-

యమ - రావణయుద్ధము.

**శ్లో॥ అన్యోన్యవ్యతిషంజితోగ్రవిశిఖప్రోత్క్షుణ్ణవక్షఃస్థల**
**శ్చ్యోతల్లోహితపూరకల్పితమహాహోలాకహేలాకయోః।**
**జ్యాటంకారితరోహితాతివికటాహంకారహుంకారయోః**
**కష్టం హంత! కృతాంతపంక్తిముఖయోర్యుద్ధం ప్రవృద్ధం బభౌ॥**

హనుమంతుని బాల్యక్రీడలు

**శ్లో॥ ఆచామన్ సోమ ముచ్చైః సహ చమసతయా నర్దయ న్నాజ్యపూర్ణాం**
**స్థాలీ మాలిహ్య గర్జన్ ముహురనుగమయ న్నద్భిరగ్నీన్ ప్రగీతాన్।**
**స్వాదం స్వాదం హవీంషి క్షపితపరిజనో యూపముత్పాట్యనాట్యం**
**కుర్వన్ పీడామృషీణామదిశతుదజభూభంజనాదంజనాభూః॥**

ఇది బెంగుళూరునుండి తెలుఁగులిపిలో, బొంబాయినుండి నాగరలిపిలోఁ బ్రకటింపఁబడినది.

## 5. వరదాభ్యుదయచంపువు:

దీనికే కరిగిరిచంపువు, హస్తిగిరిచంపు వని నామాంతరములు. దీనిలో 5 విలాసములు గలవు. ఇది బ్రహ్మనారదసంవాదరూపము. నారదమహర్షిచే భృగుమహర్షి కుపదిష్టము. సత్యవ్రతక్షేత్ర మను పేరు గల కాంచీపురములో బ్రహ్మదేవుఁ డశ్వమేధయాగము చేయుట, శ్రీవరదరాజస్వామి ప్రాదుర్భావము, లక్ష్మీవరదరాజుల విహారము, కాంచీమాహాత్మ్యము చెప్పఁ బడినవి. సరస్వతీనదీకథ, బృహస్పతి యేనుఁగై వరదరాజస్వామిని సేవించి శాపవిముక్తి గాంచుట యను నుపకథలు కూడఁ గలవు. వసిష్ఠమహర్షి చేసిన సరస్వతీస్తుతి, దేవతలు





చేసిన విష్ణుస్తుతి నిసర్గసుందరములు. గద్యములు కాదంబరీశైలీవిలసితములు. శ్లేషములు విరోధాభాసములు నెక్కువగాఁ గలవు. అశ్వధాటి, పంచచామరము వంటి క్రొత్త వృత్తములు ప్రయోగింపఁబడినవి.

సరస్వతిని స్తుతించిన యీ యశ్వధాటినిఁ బఠింపుఁడు-

**శ్లో॥ వందామహే తదరవిందాసనప్రమదసందాయిమందహసితే।**
**కుందాభదంతమణి! మందారపల్లవ వినిందాకరం తవ పదమ్।**
**స్కందాహివైరిముఖబృందారకవ్రజనుతం దారితాంతరతమో**
**వందారుదుర్వ్యసనబృందాని ధాతృసఖి! భిందానమిందువదనే॥ (1-67)**

ఇది ప్రబంధపద్ధతిలో వర్ణనాత్మకముగా రచింపఁబడినది.

**శ్లో॥ హరితతృణధియా తద్గోపురాగ్రప్రజాగ్రత్**
**కనకకలశమస్తన్యస్తగారుత్మతాంశూన్।**
**చపల ఉపజిఘృక్షు శ్చంద్రమోఽఙ్కః కురంగో**
**నహి స బహిరుపాగా ద్విత్రసంశ్చిత్రసింహాత్॥ (1-38)**

కాంచీపురమునందలి మేడలపైఁ గల పసిఁడికుండలపైఁ బొదిగిన గరుడపచ్చల కాంతులను జూచి పచ్చగడ్డి యని భ్రమించి చాపల్యముతోఁ జంద్రునిలో నున్న లేఁడి మేయుట కుత్సహించినను; ఆ భవనములపై ఁజెక్కఁబడిన చిత్రసింహములను జూచి బయటకు వచ్చుట లేదఁట.

ఇది వేంకటాధ్వరి బాల్యరచన వలెఁ గన్పట్టినను నీలకంఠదీక్షితుని నీలకంఠ విజయచంపువుతో సరితూఁగు చంపూకావ్యము. దీనిపైఁ జక్రవర్త్యయ్యంగారులు రచించిన 'గూఢార్థదీపికా'టీక గలదు. ఇది మైసూరు - విద్యాతరంగిణి వారిచే రెండు మాఱులు ప్రకటింపఁ బడినది.

**శ్లో॥ పురీణా ముత్తమా కాంచీ గిరీణాం చ గజాచలః।**
**యత్ర ప్రత్యక్షతాం యాతో యజ్వనే బ్రహ్మణే హరిః॥ (4-80)**

అనునది కావ్యసారాంశము.

## 6. విశ్వగుణాదర్శము -

ఈ చంపూ కావ్యములో 1113 పద్యగద్యములు గలవు. 1. కృశానువు 2. విశ్వావసువు నను నిద్దఱు గంధర్వులు విమానముపై నెక్కి స్వర్గలోకమునుండి భూలోకమునకు వచ్చి వివిధక్షేత్రములలోఁ బర్యటించుట, ఆయా ప్రదేశములలోని దోషములను గుణములను

నుద్ఘాటించుట వర్ణింపఁబడినది. గ్రంథారంభములో సూర్యవర్ణనము, శ్రీమన్నారాయణవర్ణనము, రామాయణవర్ణనము గలవు. గ్రంథాంతములో వివిధశాస్త్రములయందలి దోషములు, గుణములు చక్కఁగా వక్కాణింపఁబడినవి. ఈ చంపు వాద్యంతము హృద్యములైన గద్యపద్యములతో రచింపఁబడిన కమనీయకవితాకళాఖండము.

**శ్లో॥ పద్యం యద్యపి విద్యతే బహు సతాం హృద్యం విగద్యం న త**
**ద్గద్యం చ ప్రతిపద్యతే న విజహత్పద్యం బుధాస్వాద్యతామ్।**
**ఆధత్తే హి తయోః ప్రయోగ ఉభయో రామోదభూమోదయం**
**సంగః కస్య హి న స్వదేత మనసే మాధ్వీకమృద్వీకయోః॥ 4**

గద్యమ్॥ ఏషా కిల దోషాకుల మనుజకుల సకల కలుష శోషణ బద్ధకంకణా, నిజ తట నిబిడ తమ వకుళ ధవళకుల తిలకామలకావిరళ సరళ కుంద చందన మందార సహకార కేసర సరస బదర కదంబ కదంబక గంభీర జంబీర జంబూ సంపూర్ణ పర్ణ కుసుమ పలాశ సమృద్ధ కపిత్థ లోధ్ర నీరంధ్ర శిలీంధ్ర పాటల పటల జటిల క్రముక ప్రముఖ విశంకట విటపి మంజరీ పుంజ పంజరీ జృంభ దురుతరశ్రమ శమకర మకరంద రస సుగ్రసన తాత్పర్య పర్యట దభ్రవిభ్రమాలంబ రోలంబ నికురుంబ కరంబితతయా కళిందనందినీ ప్రతిచ్ఛందతా మనువిందంతీ....(కావేరీవర్ణనము - 691)

**శ్లో॥ చోరస్య చౌర్యం జగతి ప్రసిద్ధం, చౌర్యస్య చౌర్యం న తు దృష్టపూర్వమ్।**
**చౌర్యాద్యకార్యాణి, బత శ్రుతాని, కృష్ణస్య ముష్ణంతితమాం తమాంసి॥ (190)**

లోకములో దొంగ దొంగతనము చేయుట యున్నది గాని దొంగతనము దొంగతనము చేయుట లేదు. వెన్నదొంగ చేసిన దొంగపనులు మన పాపములను దొంగిలించుచున్నవి. ఎంత చమత్కారచాకచక్యము.

భగవద్రామానుజాచార్యులను, శ్రీవేదాంతదేశికులను స్తుతించిన యీ యశ్వధాటీవృత్తముల గమనమును గమనింపుఁడు-

**శ్లో॥ కామాదివైరిగణ భీమానవద్య నిజనామాభిలాషగరిమా**
**వైమానికార్య సమభూమావనౌ వచనసీమాతిలంఘిమహిమా।**
**శ్రీమా ననూనకలసోమాననో విమలధామావమానితరవిః**
**క్షేమాణి జృంభయతు భూమా వముత్ర చ స రామానుజో యతిపతిః॥ (380)**

**శ్లో॥ భేదాభిదావిషయ వాదాపతద్గురుపపాదార్థ సాధకమదో**
**త్సాదావహాద్భుతమఖాదాపగాస్యదవినోదాభిజాతఫణితిః।**
**పాదారవిందనతఖేదాపనోదచతురోదారమాధవగుణా**
**స్వాదాభితుష్ట ఇహ మోదాయ వో భవతు వేదాంతదేశికమణిః॥ (494)**



దీనిలో ననేకమధురమంజుల మనోహరవృత్తము లున్నవి. శ్రీవిశ్వగుణాదర్శము ప్రచురప్రచారము గల యతిప్రసిద్ధ మగు చంపూకావ్యరత్న మగుటచే దీని కనేకములగు వ్యాఖ్యలు, అనువాదములు, అనుకరణములు, సంస్కరణములు వెలువడినవి.

**వ్యాఖ్యలు:-**

1. మధుర సుబ్బాశాస్త్రి - భావదర్పణము
2. బాలకృష్ణశాస్త్రి - పదార్థచంద్రిక
3. జటాశంకరపాఠకులు - ప్రభాహిందీవ్యాఖ్య
4. ఇంద్రగంటి శ్రీకాంతశర్మ - తెలుఁగువ్యాఖ్య

శ్రీమాడభూషికృష్ణమాచార్యులు పేర్కొన్న 5. కురవి రామకవివ్యాఖ్య

6. ప్రభాకరవ్యాఖ్య యింత వఱకుఁ బ్రకటింపఁబడినట్లు లేదు.

శ్రీమధురసుబ్బాశాస్త్రిగారు భావదర్పణవ్యాఖ్యలో సంస్కృతసాంకేతికపదములకు నాఁడు వాడుకలో నున్న దేశ్యపర్యాయపదము లిచ్చినారు.

పాషండాః = 'లింగబలిజా' ఇతి భాషానామ (277శ్లో.), శ్వేతమృత్స్నామ్ = 'తిరుమణీ'తి భాషానామ (287శ్లో.), ఘటికాచలః = భాషాయాం 'చోళంగివర' నామా (355శ్లో) భూతపురీ 'శ్రీపెరుంబుదూరు' ఇతి భాషానామ (378శ్లో.), కేషాంచి దేకదేశినామ్ భాషయా 'తెంగలా'ఖ్యానామ్ (393గ.) కస్యైచిదస్యైగోష్ఠై 'తెంగలీయాయై'। (401శ్లో.) వకుళ విభూషణేన = శఠకోపేన (418శ్లో.), కైరవిణీ = 'తిరువల్లిక్కేణీ'తి భాషా నామ (452శ్లో.), హూణాః = శ్వేతవదనాః (455శ్లో.) తుండీరమండలమ్ = భాషాయాం 'తొండమనాడు' - ఇతి (636గ.), శ్రీముష్ణమ్ = 'తిరుమొలీ'తి భాషానామ (677శ్లో), మొదలగునవి.

**ఆంధ్రపద్యానువాదములు:-**

1. తిరుమల బుక్క పట్టణము చినతాతాచార్యులు - పద్యానువాదము
2. వేంకటరామకృష్ణకవులు- పద్యానువాదము
3. పంచాంగం తేవప్పెరుమాళ్ళయ్య - పద్యానువాదము

**ఆంగ్లానువాదము-**

శ్రీకావలి వేంకటరామ స్వామి గారు విశ్వగుణాదర్శము నాంగ్లము లోని కనువదించిరి. ఇదియే మొట్టమొదటి యాంగ్లపద్యానువాదము. ఎమ్.కె.నాయక్ గారిట్లు చెప్పుచున్నారు-

Cavelly Venkata Ramaswami's English rendering of "Viswagunadarsa" of Arasanipala Venkatadhvarin, an early seventeenth century Sanskrit poem, is probably the earliest (1825) book of verse in English by an Indian, though being a translation (and not an original

work) it cannot properly form part of Indian English literature. An interesting point about the book is that it was published in calcutta, with the help of donations, and the list of donors given on the last page includes the names of Rammohun Roy and Dwarkanath Tagore. In his Biographical Sketches of Dekkan poets, Ramaswami also gives a comptent translation in heroic couplets of passages from Vasucharitra, a Telugu Epic by the sixteenth century poet, Bhattu Murti.

(A History of Indian English Literature. pages 21 & 22.)

**ఫ్రెంచి యనువాదము–**

విశ్వగుణాదర్శమునకు ఫ్రెంచి యనువాదము పాండిచేరినుండి వెలువడినది.

**అనుకరణములు –**

సమరపుంగవదీక్షితుని 'యాత్రాప్రబంధము' వేంకటాధ్వరికి ముందే పుట్టినది. 1. అన్నయార్యుని 'తత్త్వగుణాదర్శము' 2. దత్తాత్రేయకవి 'గంగా గుణాదర్శము' 3. రాఘవాచార్యుని 'వైకుంఠ విజయచంపువు' 4. నీలకంఠుని 'కాశికా తిలకము' 5. వేంకటకవి 'విబుధానంద ప్రబంధము' 6. భారద్వాజ సూర్యనారాయణకవి 'శ్రుతకీర్తివిలాసము' 7. రామచంద్రకవి 'కేరళాభరణము' మొదలగు కావ్యములు 'విశ్వగుణాదర్శము' నాదర్శముగాఁ బెట్టుకొని వెలసిన కావ్యములు.

మణులూరు వీరరాఘవాచార్యుల 'పాణినిసూత్రవ్యాఖ్య'లో విశ్వగుణాదర్శ ప్రయోగములు ప్రమాణముగా నుదాహరింపఁబడినవి.

## నాటకములు

### 7. ప్రద్యుమ్నానందము

ఇది 6 అంకముల నాటకము. రుక్మిణీ శ్రీకృష్ణుల కుమారుఁ డగు ప్రద్యుమ్నుఁడు శంబరాసురుని వధించి రతి (మాయావతి)ని వివాహ మాడుట యితివృత్తము. వేంకటాధ్వరి పరమవైష్ణవుఁ డైనను శివద్వేషి కాక పోవుట యభినందింపఁ దగిన విషయము. పరమశివు నెట్లు వర్ణించినాఁడో చూడుఁడు–

**శ్లో॥ తృణీకృత వియద్ధునీమదజటాచ్ఛటాపాటలః**
**శరీకృతహరీ రుషా విరచయన్ నిరాసం పురామ్।**
**విలోచనబిలోజ్జ్వల జ్వలన హోష్యమాణాఖిలః**
**సహేత స కథం? హరః శరసమర్పకం దర్పకమ్॥**

దీనిలోఁ గవి ప్రాకృత భాషాపాండిత్యము నెక్కువగాఁ బ్రదర్శించినాఁడు. ఇది తిరుమల తాతాచార్యుల టిప్పణితో మైసూరు విద్యాతరంగిణి వారిచేఁ బ్రకటింపఁబడినది.





### 8. శృంగారదీపభాణము

సంస్కృతవాఙ్మయములో భాణసాహిత్యమతివిశాలమైనది.

ఈ భాణములో సూర్య –చంద్రోదయములు, కాంచీపురి, మేష – కుక్కుట యుద్ధములు, వారంగనా వినిమయములు రోచకశైలిలో వర్ణింపఁబడినవి. ఈ భాణము కంచిలో శ్రీవరదరాజస్వామి యాత్రోత్సవములోఁబ్రదర్శింపబడినది. శ్రీవరదరాజస్వామియే శృంగార చింతామణి యను ధూర్తనాయకుని భూమికను నిర్వహించుట విశేషము.

**శ్లో॥ సామ్రాజ్య మాదిమరసస్య చకాస్తి యత్ర**
**ధూర్తాత్మనః స్ఫురతి యత్ర హరేర్విలాసః।**
**యస్మిన్ కవిర్నవపయోజరవిః ప్రసిద్ధ**
**స్తద్రూపక మ్మదన దీపక మానయేతి॥**

ఇది యముద్రితము. దీని లిఖిత ప్రతి తిరుపతి – శ్రీవేంకటేశ్వర ప్రాచ్యసంశోధ నాలయములోనున్నట్లు శ్రీ కె.వి. రామకృష్ణమాచార్యులు చెప్పుచున్నారు. (భాణవాఙ్మయచరితమ్ – పుట 114)

### 9. సుభద్రాపరిణయము:–

ఈ నాటకమునందలి రెం డంకములే లభించుచున్న వఁట. అముద్రితము.

## ఇతర పద్యకృతులు

### 10. గాథాసహస్రానువాదము

శ్రీశఠకోపముని రచించిన 'తిరువాయ్‌మోలి' యను ద్రావిడ గాథాసహస్రమునకు వేంకటాధ్వరి గావించిన సంస్కృతానువాదము. శ్రీమాడభూషి కృష్ణమాచార్యు లొకే శ్లోకము లభించిన దని యుదాహరించినారు–

**శ్లో॥ లోకం పుష్కల మేకనాయకతయా యే శాసితారో నృపాః**
**శ్యామాంగేన శునా ప్రదష్ట చరణా స్తే భగ్నభిక్షాఘటాః।**
**అస్మిన్ జన్మని సార్వలౌకికతయా భిక్షా మటంతి స్వయం**
**శ్రీనారాయణ పాదసేవనరతా భో భో స్సముజ్జీవత॥**

### 11. రాఘవ యాదవీయము

ఇది పాఠకుల చేతిలో నున్న గ్రంథమే. దీనిని గూర్చి తరువాత వివరింతును.

### 12. సుభాషితకౌస్తుభము

ఇది 101 శ్లోకములు గల చిన్న నీతి గ్రంథము. దీనిలో 1. అవివేక 2. సజ్జన 3. దుర్జన 4. వదాన్య 5. సంకీర్ణము లను నైదు పద్ధతులు గలవు.

శ్లో॥ అత్యద్భుతానామనభిజ్ఞగోష్ఠ్యా
మస్తి ప్రశస్తిర్న కవీంద్రవాచామ్।
మండూకసంఘే మధురాపి సా కిమ్?
మయూరగీతిర్బహుమానమేతి॥ (6శ్లో)

శ్లో॥ ఋణే వ్రణే వా ద్రవిణే తృణే వా
ఖలే మలే వా విషయే విషే వా।
భవేదవే వా సమబుద్ధయోఽమీ
జయంతి సంత స్త్రిజగం త్యవంతః॥ (37శ్లో)

శ్లో॥ పరమం హోమయజనైర్యం పరార్థపరం విదుః।
నాభిజ్ఞః పరనారీణాం స మహానాస్తికో జనః॥ (60శ్లో)

ఇం దాస్తికులు, నాస్తికులు శ్లేషతో వర్ణింపఁబడినారు.

'మహాన్ + ఆస్తికః' అని, మహా + నాస్తికః అని రెండు విధముల ఛేదము. హోమములచే యజ్ఞములచేఁ బరమార్థపరుఁడు, పరస్త్రీల నెఱుఁగని వాఁడు (న + అభిజ్ఞ) - గొప్ప యాస్తికుఁడు. పరమ్ + అంహోమయజనైః - పాపమయులగు జనులతోఁ గూడి యితరుల యర్థములం దాసక్తి గల వాఁడు, పరస్త్రీల నాభులను - బొడ్డు మొదలగు రహస్యావయవములను (నాభి - జ్ఞుఁడు) బాగుగా మఱిఁగినవాఁడు మహా - నాస్తికుఁడు.

ఈ సుభాషితకౌస్తుభమును హెచ్.వి. నాగరాజరావు గారి 'భావద్యోతినీ' వ్యాఖ్యతో మైసూరు - సుధర్మాసంస్కృతపత్రిక వారు ధారావాహికముగాఁ బ్రకటించి వారే పుస్తకరూపముగాఁ బ్రచురించినారు.

## శాస్త్రగ్రంథములు

వేంకటాధ్వరి సర్వశాస్త్రకోవిదుఁడు. ప్రత్యేకించి వ్యాకరణ - తర్క - మీమాంసా - వేదాంతములలో నుద్దండపండితుఁడు.

శ్లో॥ తత్సుతస్తర్కవేదాంతతంత్రవ్యాకృతిచింతకః।
వ్యక్తం విశ్వగుణాదర్శం విధత్తే వేంకటాధ్వరీ॥

అని 'విశ్వగుణాదర్శములోఁజెప్పుకొనినాఁడు.

శ్లో॥ వ్యాయామం గమితాత్వలంకృతిపథే వ్యాపారితా వ్యాకృతౌ
తర్కారణ్యగతాగతైః శ్రమవతీ తంత్రాంగణే నర్తితా।



త్రయ్యద్రేరధిరోపితా చ శిఖరం తర్వాదియం భారతీ
గంభీరం గజభూధరేశ్వరకథాగంగాఝరం గాహతే॥

అని హస్తిగిరి చంపువులోఁ జెప్పుకొనినాఁడు.

శ్లో॥ తస్యైతస్య తనూభవః కవిరయం త్రయ్యంచలవ్యాక్రియా
తర్కప్రౌఢచమత్క్రియాసునిపుణో మీమాంసకోత్తంసకః।
తత్తాదృక్కవితాసరోజసవితా దత్తాశయః శ్రీపతేః
శేషక్ష్మాధరవాసినశ్చరణయోః శ్రీవేంకటార్యాధ్వరీ॥

అని ప్రద్యుమ్నానందములోఁ జెప్పుకొనినాఁడు. ఇప్పుడితఁడు రచించిన శాస్త్రగ్రంథములను సంగ్రహముగాఁ బరిశీలింతము.

## వ్యాకరణము

**1. మహాభాష్యస్ఫూర్తి**

ఇది పతంజలి వ్యాకరణమహాభాష్యమునకు వ్యాఖ్య. అలభ్యము.

**2. యఙ్లుక్ప్రకాశిక**

దీనిలో యఙ్లుగంత ప్రయోగములు వైదిక - లౌకిక భాషా సాధారణములను విషయము ప్రతిపాదింపఁబడినది. అలభ్యము.

## తర్కము

**3. మణిసారఖండనము**

శ్రీగంగేశోపాధ్యాయులు రచించిన 'తత్త్వచింతామణి' యందలి విషయములను సంక్షేపించి రాజచూడామణిదీక్షితులు 'మణిసార'మను గ్రంథమును రచించినారు. ఇందలి యనుమానఖండ మనంతశయన గ్రంథమాలలోఁ బ్రకటింపఁబడినది. వేంకటాధ్వరి మణిసార ఖండనములో నిందలి కొన్ని సిద్ధాంతములను ఖండించి యుండును. అలభ్యము.

**4. వ్యుత్పిత్సుబోధ**

ఇది జగదీశతర్కాలంకారుల 'శబ్దశక్తిప్రకాశిక'వలె, గదాధర భట్టాచార్యుల 'శక్తివాదము'వలె శాబ్దబోధ గ్రంథమై యుండును. అలభ్యము.

## మీమాంస

**5. న్యాయపద్మము**

ఇది మీమాంసా ప్రకరణ గ్రంథము. అసమగ్రము. అముద్రితము.

### 6. మీమాంసామకరందము

ఇది ఖండదేవుని భాట్టదీపికవలె జైమిని మీమాంసాసూత్రములపై విస్తృత మగు వ్యాఖ్యానము. "కణ్వరథంతరం పృష్ఠం భవతి - ఇత్యాదౌ స్మృత్యంతర విధానపక్ష స్త్వస్మాభి ర్నవమమకరందే ప్రతిక్షిప్తః" (పరిత్రాణము - పుట 51.) "ఏతచ్చ విస్తరేణ **నవమమకరందే**ఽ స్మాభి ర్నిరూపితం ద్రష్టవ్యమ్" (పరిత్రాణము - పుట 66) అని విధిత్రయపరిత్రాణములో మీమాంసామకరందమును రెండు తావులలోఁ బ్రస్తావించినాఁడు. శ్రీజైమినిమహర్షి రచించిన మీమాంసాదర్శనములో 12 అధ్యాయములు, 60 పాదములు, 907 అధికరణములు, 2745 సూత్రములు గలవు. నవమమకరంద మనఁగా మీమాంసాశాస్త్రము లోని 9వ అధ్యాయమునకుఁ గల మీమాసామకరందవ్యాఖ్యాన మని యర్థము. అముద్రితము.

### 7. విధిత్రయ పరిత్రాణము

వేంకటాధ్వరి రచించిన శాస్త్రగ్రంథములలో నింత వఱకు వెలుఁగు చూచిన గ్రంథ మిది యొక్కటి మాత్రమే.

అప్పయ్యదీక్షితులు రచించిన 'విధిరసాయనము' మీమాంసాసాగరములోఁ గల్లోలములను లేపినది. విధిరసాయనములో 43 స్రగ్ధరావృత్తములలో విధిలక్షణములు విమర్శింపఁబడినవి. అప్పయ్య దీక్షితులే స్వయముగా 'సుఖోపయోజిని' యను విస్తరవ్యాఖ్యను నిర్మించినారు.

మీమాంసకులు 1. అపూర్వవిధి 2. నియమవిధి 3. పరిసంఖ్యావిధి యను మూఁడు విధులను బ్రతిపాదించినారు.

**శ్లో॥ విధి రత్యంత మప్రాప్తే నియమః పాక్షికే సతి।**
**తత్ర చాన్యత్ర చ ప్రాప్తౌ పరిసంఖ్యేతి గీయతే॥ (తం.వా. 1-2-4)**

అని శ్రీకుమారిల భట్టపాదుల తంత్రవార్తికాంతర్గత శ్లోకవార్తికము.

అప్పయ్య దీక్షితులు వార్తికకారులు చెప్పిన విధి లక్షణములను దీవ్రముగా విమర్శించిరి. నిట్టల సోమనాథ దీక్షితులు శాస్త్రదీపికా - మయూఖమాలికయందును, ఖండదేవమిశ్రులు మీమాంసాకౌస్తుభమునందును విధిరసాయనమును నిశితముగా ఖండించిరి.

వేంకటాధ్వరి 'విధిత్రయ పరిత్రాణము', శంకరభట్టు 'విధిరసాయన దూషణము', రామేశ్వర సూరి 'విధిభూషణము', వేంకటనారాయణుని 'విధిచమత్కారచంద్రిక', కొల్లూరి నారాయణశాస్త్రి 'విధిదర్పణము', గోపాలభట్టు 'విధిదర్పణము' మొదలగునవి యప్పయ్యదీక్షితుల మతమును ఖండించుటకుఁ బుట్టిన గ్రంథములు. శ్రీనివాసదాసు 'విధిరత్నావళి', చిన్న యప్పయ్య దీక్షితుని 'దురూహశిక్ష' మొదలగునవి యప్పయ్య దీక్షితుల మతమును సమర్థించుటకుఁ బుట్టిన గ్రంథములు.





**శ్లో॥ విధిత్రితయలక్ష్మణాం విధిరసాయనే దూషణం**
**నృగాది తదుదాహృతిష్వపి నిరూపితా దుష్టయః।**
**పరీక్షకముదే రమాపతి దయోదయోద్య ద్బలా**
**ప్రవక్తి మమ తన్నిరాకరణ ముత్తరం భారతీ॥ (7శ్లో)**

**శ్లో॥ విస్తరో విధిరసాయనే కృతో**
**నానుభాష్యత ఇహాఖిలో మయా।**
**తత్ర క్లప్త ముపపాదనం బుధై -**
**ర్వీక్ష్య దూషణసమాధి రీక్ష్యతామ్॥ (9శ్లో)**

అని వేంకటాధ్వరి విధిత్రయపరిత్రాణమున కుపక్రమించినాఁడు.

ప్రసంగానుసారముగా ఖండదేవుని మీమాంసాకౌస్తుభమును గూడఁ బరామర్శించినాఁడు. దీనిలో 3 పరిచ్ఛేదములు గలవు.

ఈ విధిత్రయపరిత్రాణము శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ సీరీస్ తిరుపతి వారిచేఁ బ్రకటింపఁబడినది.

## వేదాంతము

### 8. నయద్యుమణిదీపిక

శ్రీ మేఘనాదారిసూరి 'నయద్యుమణి' యను విశిష్టాద్వైతవేదాంత గ్రంథమును రచించినాఁడు. ఇది యత్యంత ప్రౌఢగ్రంథము. మద్రాసు GOML వారిచే 1956లోఁ బ్రకటింపఁబడినది. దీనిపై వేంకటాధ్వరి 'దీపిక' యను వ్యాఖ్యను రచించినాఁడు. అలభ్యము.

## ధర్మశాస్త్రము

### 9. యతిప్రతివందన ఖండనము

బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు కూడ యతులకు నమస్కరింపవలెను. **'కాషాయాంబరమాత్రేణ యతిః పూజ్యో న సంశయః'** అని యభియుక్తోక్తి. యతి చిన్నవాఁడైనను నారాయణస్మరణ పూర్వకముగా నాశీర్వదింపవలెను గాని ప్రతి నమస్కారము చేయఁ గూడదు. ఈ విషయమే యిందు నిరూపింపఁబడినది. అముద్రితము.

వేంకటాధ్వరి రచించిన గ్రంథము లన్నియు నేఁడు లభించుట లేదు. కొన్ని యముద్రిత గ్రంథములు తాళపత్ర పుస్తకరూపములోఁ బ్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములలో నసూర్యంపశ్యములై చివుకుచున్నవి. ఇవి నష్టము కాకుండ ముద్రింపవలసిన యవసర మెంతేనిఁ గలదు. చేతులు కాలిన పిమ్మట నాకులు పట్టుకొన్నను లాభము లేదు.

## రాఘవయాదవీయములు

## అనులోమ - విలోమకావ్యములు

సంస్కృతములో రాఘవయాదవీయములు నాలుగై దున్నట్లు తెలియవచ్చుచున్నది. 1. సోమేశ్వరకవి 2. రఘునాథాచార్యులు 3. శ్రీనివాసాచార్యులు 4. వాసుదేవకవి రాఘవయాదవీయములను రచించినట్లు శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు తెలిపినారు.

వసుప్రహరాజు రచించిన యింకొక రాఘవయాదవీయ మిటీవలనే ప్రకటింపఁబడినది.

### వింజమూరి సోమేశ్వరకవి

ఇతఁడు గౌతమసగోత్రుఁడు. కృష్ణసూరి పుత్త్రుఁడు. ద్వివేది గోవిందపండితుని శిష్యుఁడు. 18వ శతాబ్దమునకుఁ జెందినవాఁడు. ఈ కవి రచించిన రాఘవ యాదవీయ ద్వ్యర్థికావ్యములో 15 సర్గములు గలవు. ఇందలి 7వ సర్గము లుప్త మగుట దురదృష్టము. ఇందు వివిధ వృత్తములు ప్రయోగింపఁబడినవి. ప్రతిసర్గాంత శ్లోకమునందు 'శ్రీ' పద ప్రయోగము గలదు. అనఁగా మాఘకావ్యము వలె నిది శ్ర్యంకకావ్యము. ఈ రాఘవ యాదవీయము కాకినాడనుండి 1950లో శ్రీచిలుకూరి పాపయ్యశాస్త్రి గారి సంపాదకత్వములో వెలువడినది.

**వసుప్రహరాజు (18శ.)**

ఇతఁ డుత్కల (ఒరిస్సా) దేశీయుఁడు. ఈ కవి రచించిన రాఘవయాదవీయములో 10 సర్గములు; 294 శ్లోకములు గలవు. 'వసుప్రక్రియ' యను పాణినీయవ్యాకరణ గ్రంథ మితని రెండవ కృతి.

తక్కిన 3 రాఘవయాదవీయములు నాకు లభింపలేదు.

### వేంకటాధ్వరి రాఘవయాదవీయము

వేంకటాధ్వరి రచించిన కృతులలో రాఘవయాదవీయము చిన్నది యైనను మిన్న యైనది. ఇది సంస్కృతవాఙ్మయములో నపురూప మైన కావ్యము. విలక్షణ మైన కావ్యము. చిత్ర మైన కావ్యము. దుష్కర మైన యనులోమ విలోమకావ్యము.

దీనిలో 30 శ్లోకములు గలవు. శ్లోకములను మామూలుగా ననులోమపద్ధతిలో మొదటి నుండి చివరకు జదివినచో రామాయణకథ వచ్చును. అదే శ్లోకమును విలోమపద్ధతిలోఁ జివర నుండి మొదటికిఁ జదివినచోఁ బారిజాతాపహరణకథ వచ్చును. ఈ యనులోమ -విలోమ ప్రక్రియలో రెండు రకములు గలవు. శ్లోకము పైనుండి క్రిందికిఁ జదివినను, క్రిందినుండి పైకిఁ జదివినను నదే శ్లోకము వచ్చి రెండర్థములు వచ్చుట మొదటి పద్ధతి. ఇట్టిది రామకృష్ణ విలోమకావ్యము. పైనుండి క్రిందికిఁ జదివిన యొక యర్థము, క్రింది నుండి పైకిఁ జదివిన యొక యర్థము వచ్చుట రెండవ పద్ధతి. ఇట్టిదీ రాఘవయాదవీయము.





నిజమున కిది మిక్కిలి క్లిష్టమైన ప్రక్రియ. అనులోమ విలోమముగా నొక్క శ్లోకమును రచించుటయే యెక్కువ కష్టము. ఇంక రెండు కథలను గైకొని యొక కావ్యమును బూర్తిగా రచించుట మిక్కిలి క్లేశముతోఁ గూడిన పని యని వేఱుగాఁ జెప్ప నక్కర లేదు. ప్రాచీన మహాకవులు కూడఁ దమ ప్రజ్ఞాపాటవమును బ్రదర్శించుటకై కిరాతార్జునీయము కావ్యములో నొకటి - రెండు శ్లోకములను మించి వాడలేదు.

**శ్లో॥ నిశితాసిరతోఽభీకో న్యేజతేఽమరణా రుచా।**
**సారతో న విరోధీ నః స్వాభాసో భరవానుత॥ (కిరాత - 15-22)**

అను శ్లోకమును రచించినాఁడు. దీని కొక యర్థము వచ్చును. దీనినే విలోమముగాఁ బఠించినపుడు

**శ్లో॥ తనువారభసో భాస్వానధీరోఽవినతోరసా।**
**చారుణా రమతే జన్యే కోఽభీతో రసితాశిని॥ (కిరాత - 15 -23)**

అని మఱియొక శ్లోకము వచ్చును. దీని కింకొక యర్థము వచ్చును.

అట్లే మాఘుఁడు శిశుపాలవధములో-

**శ్లో॥ వాహనాజని మానాసే సారాజావనమా తతః।**
**మత్తసారగరాజేభే భారీహావజ్జనధ్వని॥ (శిశు - 19-33)**

అను శ్లోకమును రచించినాఁడు. దీనికొక యర్థము వచ్చును.

దీనినే విలోమముగాఁ బఠించినపుడు-

**శ్లో॥ నిధ్వనజ్జవహారీభా భేజే రాగరసాత్తమః।**
**తతమానవజారాసా సేనా మాని జనాహవా॥ (శిశు - 19-34)**

అని మఱి యొక శ్లోకము వచ్చును. దీని కింకొక యర్థము వచ్చును.

దండి కావ్యాదర్శములో -

**శ్లో॥ యానమానయమారావికశోనానజనాశనా।**
**యాముదారశతాధీనామాయామాయమనాదిసా॥ (కావ్యా 3-76)**

అను శ్లోకము నుదాహరించినాఁడు. దీనినే విలోమముగా బఠించినపుడు -

**శ్లో॥ సా దినామయమాయామా నాధీతా శరదాముయా।**
**నాశనాజననా శోకవిరామాయ న మానయా॥ (కావ్యా 3-77)**

అను శ్లోకము వచ్చును. ఈ రెండు శ్లోకములకు రెండర్థములు గలవు.

ఈ పద్ధతి ననుసరించినది వేంకటాధ్వరి రాఘవయాదవీయము.

మాఘుఁడు శిశుపాలవధములో –

**శ్లో॥ తం శ్రియా ఘనయాఽనస్త రుచా సారతయా తయా।**
**యాతయా తరసా చారుస్తనయాఽనఘయా శ్రితమ్॥ (శిశు – 19-88)**

ఇది యనులోమముగాఁ బఠించినను విలోమముగాఁ బఠించినను నదే శ్లోకము వచ్చును. దీనిని మాఘకవి 'గతప్రత్యాగత'మని పేర్కొనినాఁడు. మల్లినాథుఁడు మాత్ర 'మర్ధ ప్రతిలోమయమక'మని చెప్పినాఁడు. అనఁగా శ్లోకమునందలి పూర్వార్ధమే యుత్తరార్ధములోఁ దిరుగఁబడును.

దండి కావ్యాదర్శములో –

**శ్లో॥ నాదినోమదనా ధీః స్వా న మే కాచన కామితా।**
**తామికా న చ కామేన స్వాధీనా దమనోదినా॥ (కావ్యా 3-75)**

అను శ్లోకము నుదాహరించినాఁడు.

ఈ పద్ధతి ననుసరించినది సూర్యకవి రామకృష్ణ విలోమకావ్యము.

**దైవజ్ఞ సూర్యకవి (16శ.) – రామకృష్ణవిలోమకావ్యము**

ఈ కావ్యములో నవతారికా శ్లోకములు 7, సమాప్తి శ్లోకములు 2 కాక 36 అనులోమ – విలోమశ్లోకములు గలవు.

**శ్లో॥ తం భూసుతాముక్తి ముదారహాసం**
**వందే యతో భవ్యభవం దయాశ్రీః।**
**శ్రీయాదవం భవ్యభతోయదేవం**
**సంహారదాముక్తిముతాసు భూతమ్॥**

అనునది మొదటి శ్లోకము.

**శ్లో॥ లంకా రంకాగారాధ్యాసం, యానే మేయా కారావ్యాసే।**
**సేవ్యా రాకా యామే నేయా, సంధ్యారాగాకారం కాలమ్॥**

అనునది చివరి శ్లోకము. అన్ని శ్లోకము లందు ననులోమ – విలోమపాఠము సమానము. ప్రతిశ్లోకమునకు శ్రీరామకథాపరముగా, శ్రీకృష్ణ కథాపరముగా రెం డర్థములు వచ్చును. అనుష్టుప్ – ఇంద్రవజ్రా–రథోద్ధతా – విద్యున్మాలా – శాలినీవృత్తములు వాడఁబడినవి. దీనిని రచించిన దైవజ్ఞ సూర్యకవి పేరే యితఁడు జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడని చెప్పుచున్నది. ఇతఁడు బహుశాస్త్రకోవిదుఁడు. బహుగ్రంథకర్త. 1. నృసింహ చంపువు 2. కామతంత్రకావ్యము 3. కంసవధ నాటకము 4. సూర్యప్రకాశము – జ్యోతిషగ్రంథము (1539) 5. లీలావతీ టీక 6. బీజగణిత టీక 7. కవికల్పలతావ్యాఖ్య – బాలబోధిక 8. భగవద్గీతావ్యాఖ్య – పరమార్థ ప్రప మొదలగునవి సూర్యకవి యితర గ్రంథములు.



రామకృష్ణ విలోమకావ్యమునకు సూర్యకవియే స్వయముగా వ్యాఖ్యను రచించినాఁడు. దీని కనేక సంస్కరణములు గలవు. మిత్రులు – బహుగ్రంథకర్తలు బ్రహ్మశ్రీ మేళ్లచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'ద్విరసన' యను నాంధ్రవ్యాఖ్యను గూర్చినారు. దీనిని శ్రీరామోరా గారి యార్థికసాహాయ్యముతో సాధనగ్రంథమండలి వారు ప్రకటించినారు.

ఇట్టివే రెండు కంకణబంధరామాయణములు గలవు.

**వాసిష్ఠ కృష్ణమూర్తి (19శ.)**

ఇతఁడు కంకణ బంధరామాయణము నొకే శ్లోకములో రచించినాఁడు.

**శ్లో॥ నేతాదేవాలీనామాశాధానాధీనానేకాలోకీ।**

**మాస్థానాభాఖ్యాయోగీశంపాయాదేతంరామేరాజా॥**

ఇది 32 అక్షరములు గల విద్యున్మాలావృత్తము. మొదటి యక్షరముతో మొదలుపెట్టి చివరి యక్షరము వఱకు, రెండవ యక్షరముతో మొదలు పెట్టి మఱల మొదటి పాదములో మొదటి యక్షరము వఱకు నీవిధముగా 32 అక్షరములతో ననులోమముగాఁ బఠించినచో 32 శ్లోకములు వచ్చును. చివరి యక్షరమునుండి మొదటి యక్షరము వఱకు నీవిధముగా 32 అక్షరములతో విలోమముగాఁ బఠించినచో 32 శ్లోకములు వచ్చును. మొత్తము 64 శ్లోకములలో రామాయణకథ పూర్తి యగును.

ఈ యేకశ్లోక కంకణ బంధ రామాయణమునకు బహుగ్రంథకర్తలు బ్రహ్మశ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు **'మోహనరూపా'** వ్యాఖ్యను సంతరించినారు. దీనిని గూడ శ్రీరామోరా గారి యార్థిక సాహాయ్యముతో సాధనగ్రంథమండలి వారు ప్రకటించినారు.

**చర్ల భాష్యకారశాస్త్రి (20శ.)**

శ్రీచర్ల భాష్యకారశాస్త్రిగా రింకొక ముందడుగు వేసి మఱియొక కంకణబంధ రామాయణమును రచించినారు.

**శ్లో॥ రామా నాథా భారా సారా చారా వారా గోపా ధారా।**

**ధారా ధారా భీమా కారా పారా వారా సీతా రామా॥**

దీనిని గూడ నొక్కొక్క యక్షరముతో మొదలుపెట్టి యనులోమ – విలోమ పద్ధతులతోఁ బఠించినచో 64 శ్లోకములు వచ్చును. మొత్తము 128 శ్లోకములతో రామాయణకథ పూర్తి యగును.

తెలుఁగు కవులు కూడఁ దమ ప్రబంధములలోఁ గవితా కౌశలప్రదర్శనమునకై యొండు రెండు పద్యములను రచించినారు.

**నందితిమ్మన (16శ.)**

తిమ్మకవి పారిజాతాపహరణములో నొక పద్యమును రచించినాఁడు.

**కం॥ నాయశరగసారవిరయ**
**తాయనజయసార సుభగ ధరధీ నియమా**
**మాయనిధీ రధగభసుర**
**సాయజనయతాయరవిర సాగరశయనా (పారిజాత - 5-92)**

ఇది యనులోమముగాఁ బఠించినను విలోమముగాఁ బఠించినను నదే కందము వచ్చును. కాని రెండర్థములు లేవు.

**పింగళి సూరన (16శ.)**

సూరకవి కళాపూర్ణోదయములో రెండు ద్విభాషా కందములను రచించినాఁడు. అం దొకటి యనులోమ - విలోమకందము.

**కం॥ తా విను వారికి సరవిగ**
**భావనతో నాను నతి విభావిసుతేజా**
**దేవరగౌరవమహిమన**
**మా వలసినకవిత మరిగి మాకు నధీశా (కళా - 6-172)**

ఇది తెలుఁగు భాషా కందము. దీనిని విలోమముగాఁ బఠించినచో సంస్కృత భాషాకందమగును.

**శాధీనకు మాగిరిమత**
**వికనసిలవమాన మహిమ వరగౌరవదే**
**జాతే సువిభావితినను**
**నాతో నవభాగ విరసకిరి వానువితా.**

ఇందలి సంస్కృత భాషార్థమును సూరకవియే యొక సీసపద్యములో (కళా 6-176) వివరించినాఁడు. దీని పదవిభాగ - ప్రతిపదార్థములు కళాపూర్ణోదయ టీకయం దనుసంధేయములు.

కన్నడ కవులు కూడ నిట్టి పద్యములను రచించిరి.

**ఆచణ్ణ (12శ.)**

ఆచణ్ణ యను కన్నడకవి వర్ధమాన పురాణములో నొక గతప్రత్యాగత పద్యమును రచించినాఁడు.

**కుందునిం దెచ్చనదు బం**
**టంద మల్లదె నిందుదెం।**





**దెందునిం దెల్ల మదటం**
**బందు నచ్చదె నిందుకుం (వర్ధమాన - 7-53)**

(సంక్షిప్త కన్నడ సాహిత్య చరిత్రె - పుట 107)

ఆచణ్ణకవినిగూర్చి కర్ణాటసాహిత్య దర్శనములో విస్తరముగా వివరించితిని.

## ఆంధ్రకవులు - వేంకటాధ్వరి

కాంచీపురము ప్రాచీనకాలములో నాంధ్రదేశాంతర్గతమై యుండెడిది. తెలుఁగు మాట్లాడు కుటుంబములు కంచిలో నిప్పటికిని గలవు. శ్రీనాథుని బాల్యమిత్రుఁడు, హరవిలాసకృతి భర్త యగు నవచి తిప్పయసెట్టి కంచివాస్తవ్యుఁడే కదా!

వేంకటాధ్వరి కంచి పరిసర గ్రామమగు నరశాణపాలెములోఁ బుట్టి కంచిలో నెక్కువ కాలము నివసించిన వాఁ డగుటచేఁ దెలుఁగు బాగుగా వచ్చిన వాఁ డగుటయే కాక యాంధ్ర గ్రంథములను బాగుగాఁ బఠించినవాఁడు.

**పోతన - వేంకటాధ్వరి:-**

ఆంధ్రకవిశిరోమణి, పరమభక్తశిఖామణి బమ్మెరపోతన మహాకవి రచించిన యాంధ్ర మహాభాగవతము భక్తిరసప్రబోధక మగు నుత్తమ పురాణ మగుటచే నాంధ్రదేశమునందే కాక యిరుగు - పొరుగు రాష్ట్రములలోఁ గూడ మిక్కిలి ప్రచారము నొందినది. వేంకటాధ్వరి మూఁడు నాలుగు తావులలో భాగవతపద్యముల ననుకరించినాఁడు.

**ఉ॥ ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్**
**సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే**
**సమ్మెట వేటులం బడక సమ్మతితో హరి కిచ్చి చెప్పె నీ**
**బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్ (1 స్కం-11)**

**శ్లో॥ శ్రీనాథస్తవనామరూపకవనాం వాణీం మనోహారిణీం**
**కష్టం హా కవయః కదర్యకుటిలక్ష్మాపాలసాత్కుర్వతే।**
**దూరోపాహృతసౌరసైంధవపయో దేవాభిషేకోచితం**
**సంసేకే వినియుంజతే సుమతయః శాకాలవాలస్య కిమ్॥ (విశ్వ -542)**

**శ్లో॥ మదాంధక్షోణీపత్యుపసదమనః ప్రీణనకృతే**
**నమస్కారం బ్రూమో భగవతి చమత్కారవచసే।**
**విధాత్రీ మానందం విపుల మిహ చాముత్ర చ తవ**
**స్తుతిం ప్రస్తౌ త్వంహోభరనిరసనా యాద్య రసనా॥ (లక్ష్మీ - 1-9)**

శ్లో॥ గర్వద్దుర్వసుధాపతి స్తుతిపర వ్యాపార కూపాంధతా
నిర్విణ్ణాశయ ఏష వేంకటకవిః పంకేరుహావాసిని।
అద్య త్వద్గుణ వర్ణనామృతరసై రానందితుం జృంభతే
చించాపర్ణరసావసన్నరసనః పుండ్రేక్షు సారై రివ॥ (లక్ష్మీ - 1 -15)

మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ దే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై (8స్క -96)

శ్లో॥ లీలాలోలతమాం రమా మగణయన్ నీలా మనాలోకయన్
ముంచన్ కించ మహీ మహీశ్వరమయం మంచం హఠా ద్వంచయన్।
ఆకర్షన్ ద్విజరాజమ ప్యతిజవా ద్ధా హంత లోకాంతరాద్
గోప్తుం శౌరిరుదిత్వరత్వర ఉదైద్ గ్రాహగ్రహార్తం గజమ్॥ (విశ్వ -18)

ఉ॥ శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గమ్మని నిల్పె నర్థిసం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్యతోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్ (9స్క -313)

శ్లో॥ కృతత్రిదశపోషణం కృశరథాంగ సంతోషణం
పిశాచకులభీషణం పృథుతమశ్చటాపేషణమ్।
వినమ్రగదశోషణం విహితవారిజోన్మేషణం
నమస్కురుత పూషణం నను నభః స్థలీభూషణమ్॥ (విశ్వ - 12)

ఇందులోఁ దెలుఁగు పద్యమువలె యతులు గూడఁ గలవు.

**నందితిమ్మన - వేంకటాధ్వరి:-**

ముక్కు తిమ్మన పారిజాతాపహరణము తెలుఁగులో ముద్దు పలుకులొలుకు కావ్యమై యెందఱో కవుల నాకర్షించినది. శేషకృష్ణకవి సంస్కృతములోఁ బారిజాతహరణచంపువును రచించినాఁడు. శేషము వారు తెలుఁగు వారే. వేంకటాధ్వరి రాఘవ యాదవీయమునందలి విలోమకథ పారిజాతాపహరణమే కదా! ఈ క్లిష్ట కావ్యములోఁ గూడ నొకటి రెండు చోట్లఁ దిమ్మకవి ప్రభావము గన్పట్టుచున్నది.



సీ॥ కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు (పారిజాత - 1-106)

శ్లో॥ హహ దాహమయీ కేకైకేవాసేద్ధవృతాలయా।
సా సదాననకామేరా భామా కోపదవానతా॥ (రాఘవయాద -20శ్లో॥)

ఆంధ్రసాహిత్యములో **రామరాజభూషణుఁ** డొక్కఁడే శ్లేషయమక - బంధ -గర్భ - చిత్రకవితలతోఁ గావ్యములు రచించుటలో వేంకటాధ్వరికి సాటి యైన వాఁడు.

సంస్కృతభాషలో ననులోమ - విలోమకావ్య మీ రాఘవయాదవీయ మొక్కటియే యున్న దని నేను ముందు తలంచితిని గాని హరిశ్చంద్రనలోపాఖ్యానము (?) లేక - నలహరిశ్చంద్రీయము మఱియొక కావ్యము కూడ నున్నట్లు తెలియ వచ్చినది.

**అనులోమ విలోమ - నలహరిశ్చంద్రీయము:-**

శ్రీమద్భాగవతపురాణపీఠిక యగు సిద్ధాంత చంద్రికలో శ్రీదంపూరి వేంకటసుబ్బాశాస్త్రిగా రిట్లు చెప్పినారు- తేనైవ కవిజనసార్వభౌమేన కాళిదాసేన విరచిత హరిశ్చంద్ర నలోపాఖ్యానే(?)

అథానులోమ్యేన దమయంతీ చంద్రోదయే వ్యసనవతీ జాతేత్యర్థం చ ప్రాతిలోమ్యే చంద్రమతీ హరిశ్చంద్రేణ గర్భం ప్రాపితేత్యర్థం చ ప్రతిపాదయ న్నాహ -

శ్లో॥ తాపితా హిమధామ్నాభూ త్తదాలోకనకామనా।
సాధవేతి కృతాధీతా రుచాతీవ మహైనసా॥

**టీకా॥** తస్య నలస్య ఆలోకనే వీక్షణే ఆశా యస్యా స్సా తథోక్తా భైమీ హిమధామ్నా చంద్రేణ - అధవేతి కృతా అధవానాం ప్రోషితభర్తృకాణామ్ - ఈతి ముపద్రవం కరోతీతి కృత్ తయా। అత ఏవ అతీవ మహైనసా అత్యంత మహాపాతక వత్యా - అనాధస్త్రీవధా దితి భావః। 'కలుషం వృజినైనోఽఘమ్'

ఇత్యమరః। రుచా చంద్రికయా తాపితా సతీ - ఆధీతా (ఆధి + ఇతా) మనోవ్యాధిమ్ ప్రాప్తాభూత్। 'పుంస్యాధి ర్మానసీవ్యథా' ఇత్యమరః। అత్ర తదాలోకనకామనే త్యనేన సంకల్పాఖ్యా తృతీయావస్థా। సూచితా। హిమధామ్నా ఆధీతేత్యనేన అభిహితా నిద్రాభావా జ్జాగరాఖ్యా తురీయావస్థా॥

**ప్రాతిలోమ్యేతు -**

శ్లో॥ సా న హైమవతీ చారుతాధీతా కృతివేధసా।
నామకా న కలోదాత్త భూమ్నా ధామ హితాపితా॥

**టీకా॥** హిమవతః అపత్యం స్త్రీ హైమవతీ। సేవ చారుతయా సౌందర్యేణ అధీతా ప్రాప్తా నామః మనః కేళిరసః యస్యాః సా। నామకా కులాంగనోచితా లజ్జావతీతి భావః। హితానుకూలా।

సా చంద్రమతీ ఆకృతౌ ఆకారే వేధసా విష్ణుతుల్యేన 'వేధావిష్ణౌ చ ధాతరి' ఇతి శాశ్వతః యద్వా ఆకృతివేధసా – కార్యేషు బ్రహ్మతుల్యేన అఘటన ఘటనా దక్షేణేత్యర్థః। కలాసు విద్యాసు ఉదాత్తభూమ్నా మహనీయమాహాత్మ్యేన హరిశ్చంద్రేణ। ధామతేజః – గర్భోత్పాదకం వీర్య మిత్యర్థః। ఆపితా ప్రాపితా। నేతి న। గర్భిణీ కృతేత్యర్థః॥

తస్మి న్నేవ కావ్యే – ఆనులోమ్యే –

**శ్లో॥ కంకమైత్తనుసాదం సా, ప్రసవేషు సునందనమ్।**
**నాజలా బిసవల్లీవ, సితాకాంతి రధీరధీః॥**

ప్రాతిలోమ్యేతు –

**శ్లో॥ ధీరధీరతి కాంతాసి వల్లీవ సబిలాజనా।**
**నందనం సుషువే సప్రసాదం సానుత్తమైకకమ్॥**

ఇది నలహరిశ్చంద్రోపాఖ్యానము గాని హరిశ్చంద్రనలోపాఖ్యానము కాదు.

శ్రీ సురేశ చంద్ర బెనర్జీ గారు 'Kalidasa Epocrypha' అను గ్రంథములోఁ గాళిదాసు పేరు మీఁదుగా వచ్చిన కృతులలో నీనలహరిశ్చంద్రీయమును బేర్కొనలేదు.

శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు నలహరిశ్చంద్రీయ మజ్ఞాతకర్తృక మని చెప్పి రెండు శ్లోకముల నుదాహరించినారు–

**శ్లో॥ నిజమోఽతి ప్రజానారీనలోఽచ్ఛ స్సదమోఽజని।**
**యః శ్రియ శ్చంద్ర ఇంద్ర శ్చగోప్తా గోస్సర్వపూరిహా॥**

ఇది నలపక్షములో ననులోమపాఠము.

**శ్లో॥ హరిపూర్వ స్స గోప్తా గో శ్చంద్ర ఇంద్రశ్చ యః శ్రియః।**
**నిజమోద స్సచ్ఛలో న రీనాజాప్రతిమోఽజని॥**

అని హరిశ్చంద్రపక్షములో విలోమపాఠము.

**శ్లో॥ లీలాకలోమధ్యమలోకలాలీ**
**త్యాగీసుఖీముగ్ధముఖీసుగీత్యా।**
**సభాప్రయానంగనయాప్రభాస**
**సహాసయా తత్ర తయా సహాసః॥**

ఇది చివరి శ్లోకము. దీని ననులోమ – ప్రతిలోమపాదము, పాదభ్రమకము నని కూడ నందురు.

ఈ కావ్యము ముద్రితమో కాదో తెలియదు. వేంకటాధ్వరి రాఘవయాదవీయమున కీ నలహరిశ్చంద్రీయమే ప్రేరకమై యుండును.



వేంకటాధ్వరి కృతులలో విశ్వగుణాదర్శ – లక్ష్మీ సహస్రముల తరువాత రాఘవ యాదవీయమే ప్రచుర ప్రచారము గాంచినది. ఈ కావ్యములో శ్రీరామ – శ్రీకృష్ణకథలు రెండు మిక్కిలి సమర్థవంతముగా జోడింపఁబడినవి. 30 అనులోమశ్లోకములలో రామాయణము నందలి ప్రధానఘట్టము లన్నియుఁ బ్రతిపాదింపఁబడినవి. 30 విలోమ శ్లోకములలోఁ బారిజాతాపహరణకథ యథాహరివంశముగా వర్ణింపఁబడినది. ప్రద్యుమ్నుని తేజోభంగము, ప్రవరుని యాగమనము, శ్రీకృష్ణుని యాకాశభ్రమణము మొదలగు విషయములను బ్రత్యేకముగాఁ బారిజాతాపహరణములను రచించిన కవులు కూడ వర్ణింప లేదు. వేంకటాధ్వరి హరివంశమును సునిశితముగాఁ బరిశీలించి యిట్టి ఘట్టములను గ్రహించి పారిజాతకథను దీర్చి దిద్దినాఁడు.

ఇం దనుష్టుప్ఛందములనే కాక విద్యున్మాల (1,2,5 శ్లో.) స్రగ్విణి (7శ్లో) యను విశేషవృత్తములను బ్రయోగించినాఁడు. విద్యున్మాలలో నన్నియు గురువు లగుటచే ననులోమ – విలోమ పాఠములకు వీలైనది. స్రగ్విణిలో నాలుగును రగణములే యుండుటచే ననులోమ – విలోమపాఠము కుదిరినది. సుగంధి వృత్తములో 'ర –జ –ర – జ – ర' యను గణములుండును గాన నిది కూడ ననులోమ – విలోమపాఠమున కనువైనదే. అయినను దీనిని వేంకటాధ్వరి గ్రహింప లేదు.

వేంకటాధ్వరి స్వయముగా నీ కావ్యముపై విస్తృతవ్యాఖ్యను మల్లినాథశైలిలో రచించి నాఁడు. దీనిలో నెన్నియో నిఘంటువులుదాహరింపఁబడినవి. క్రియారూపములకు మూలధాతువులను లట్ –లిట్ మొదలగు కాలములను నిర్దేశించినాఁడు. నాలు గైదు తావులలోఁ దన ప్రయోగములకుఁ బ్రమాణముగాఁ బ్రాచీన గ్రంథముల నుదాహరించినాఁడు. వాస్తవమున కీ స్వీయవ్యాఖ్యానము లేనిచో నీకావ్య మింత సులువుగా నవగత మయ్యెడిది గాదు.

ఈ రాఘవయాదవీయమునకుఁ దెలుఁగులో నొక వ్యాఖ్య వ్రాయ వలె ననెడి సంకల్పము 25 యేండ్లనుండి కలదు. భగవంతుని కరుణ వలన నిన్నాళ్ల కీ కోరిక నెఱవేఱినది. ఈ 'హరిప్రియ' యను వ్యాఖ్యను రచింపఁగల్గితిని. దీనిలో వేంకటాధ్వరి వ్యాఖ్యను యథామూలముగా ననుసరించితిని. కొన్ని తావులలోఁ గ్రొత్త విషయములను జేర్చితిని. సాధ్యమైనంత వఱకు వ్యాఖ్యానము సరళముగా నుండుటకుఁ బ్రయత్నించితిని.

ఈ గ్రంథమునకు మూఁడు నాలుగు సంస్కరణములు గలవు.

ఇది మొట్టమొదట 1890లో మైసూరు లోని విద్యాతరంగిణీ ముద్రాక్షరశాలలో శంభురహస్య – ప్రాకృతదీపికల కనుబంధముగాఁ బ్రకటింపఁబడినది. తెలుఁగు లిపి. రెండు, మూఁడు ముద్రణదోషములున్నను నిర్దుష్టమైన సంస్కరణము. ప్రధానముగా నేను దీనినే యనుసరించితిని. లిఫ్కో వారు దీనిని నాగరలిపిలో సవ్యాఖ్యానముగా నాంగ్ల తాత్పర్యముతోఁ బ్రకటించిరి. కాని యిందులోఁ గొన్ని వ్యాఖ్యానవాక్యము లెగిరి పోయినవి. ఇక్కడ నొక్క విషయము గమనింపవలయును. రాఘవ యాదవీయ వ్యాఖ్యానప్రారంభములో –

**శ్లో॥ కించి త్సంచింతయే గోపీకిలికించితవంచితమ్।**
**అంచితం జ్యోతిరమరైరంజనాద్రావుదంచితమ్॥**

**శ్లో॥ భద్రోల్లాసం భాస్కరాపత్యవాహి**
**న్యంతర్ద్వీవ్యన్న్యస్తవైర్యుగ్రబాణః।**
**నాథోహల్యానందహేతుః ప్రదత్తాం**
**రాజీవాక్షో రాఘవో యాదవో వా॥**

అను రెండు శ్లోకములు గలవు. ఇవి లిఫ్కో ప్రతిలో లేవు.
కాని దీనికి శ్రీ.కె.శ్రీనివాసాచార్యులు వ్రాసిన యాంగ్లపీఠికలోఁ బ్రక్షిప్తములుగాఁ జూపఁబడినవి.

**శ్లో॥ అనువర్ణితరామకృష్ణవృత్తే**
**రనులోమప్రతిలోమవాచనాభ్యామ్।**
**కృతి ముల్లసితాం విధాయ పద్యై**
**ర్వివృణోతి స్వయమేవ వేంకటార్యః।**

అను శ్లోకము కూడ నదనముగాఁ గలదు.
ఈ మూఁడు శ్లోకములను నా 'హరిప్రియా' వ్యాఖ్యానారంభములో–

**శా॥ శ్రీమద్భాస్వదపత్యవాహినికి సత్ప్రేమాస్పదుం డంబుద**
**శ్యాముం డంబుజ పత్రనేత్రుఁడు సదాహల్యా ప్రమోదాత్ముఁడౌ**
**రాముండో మఱి కృష్ణుఁడో త్రిజగతీరక్షావతారుండు మ**
**మ్మోమున్ ధూతమహారిబాణుఁ డగు భద్రోల్లాసుఁ డెల్లప్పుడున్.**

**కం॥ అంచిత మయి గోపీకిలి**
**కించితరోమాంచలలిత కేళీలీలా**
**వంచిత మగు నంజనగిరి**
**సంచితతేజంబు మాకు శరణము గాతన్**

**శా॥ శ్రీమద్వేంకటయజ్వ సత్కవి సుధీశ్రేష్ఠుండు ధీక్లిష్టుఁడై**
**భూమిన్ రాఘవయాదవీయ రచనన్ బొల్పొందఁగాఁ జేసె స**
**త్ప్రామాణ్యం బగు ఫక్కి నచ్యుతగత ప్రత్యాగతప్రక్రియన్**
**గామాక్షీ కృపచే హరిప్రియ యనంగా వ్యాఖ్య నేఁ జేసెదన్.**





అని మూఁడు పద్యములుగాఁ దెనిఁగించితిని. మొదటి పద్యము శ్లేషాలంకృత మగుటచే లఘుటిప్పణి నిచ్చితిని. ఇట్టీ హరిప్రియా వ్యాఖ్యానముతోఁ గూడిన రాఘవయాదవీయము శ్రీ రామోరా గారి నిర్వ్యాజౌదార్యముతోఁ బాఠకుల కందుబాటు లోనికి వచ్చుచున్నది.

## రామోరా

రామోరాగాఁ బ్రసిద్ధు లైన శ్రీరావి మోహనరావు గారు నాకుఁ జిరకాలమిత్రులు. వీరు సుమారు 25 సంవత్సరములనుండి యపురూపమైన ప్రాచీనసంస్కృతాంధ్ర గ్రంథములను బ్రకటించి సాహితీసేవ చేయుచున్నారు. మూకపంచశతిని దోర్బల వారి విపులవ్యాఖ్యతో రెండు మాఱులు ముద్రించిరి. శ్రీ బెల్లంకొండ రామరాయకవి గ్రంథములను గొన్నింటి నాంధ్రవ్యాఖ్యలతోఁ బ్రకటించిరి. మేఘసందేశమును 3 సంస్కృతవ్యాఖ్యలతో నాంధ్రవ్యాఖ్యతోఁ బ్రకటించిరి. ఋతుసంహారము , మేఘసందేశము మొదలగు వానికి స్వయముగా మృణాళినీ వ్యాఖ్యలు రచించిరి. చండీశతకము, పుష్పబాణవిలాసము, ఘటకర్పరకావ్యము, శివకర్ణామృతము, మొదలగు ప్రచురణము లింకను గలవు. ప్రస్తుతము కుమారసంభవమును స్వీయవిస్తృతాంధ్రమృణాళినీ వ్యాఖ్యతోఁ బ్రకటించుచున్నారు. వీరు ప్రచురించిన గ్రంథములు వంద సంఖ్యకుఁ జేరు నను కొనుచున్నాను. ఇన్ని గ్రంథములను పుంఖానుపుంఖముగాఁ బ్రకటించుట యొక యెత్తు. వీరు స్వయంకృషితో సంస్కృతములో M.A. పట్టభద్రు లగుట యొక యెత్తు.

దోర్బల వారి వ్యాఖ్యతోఁ గంకణబంధ రామాయణమును, మేళ్ళచెర్వు వారి వ్యాఖ్యతో రామకృష్ణవిలోమకావ్యమును బ్రచురించిన రామోరా గారు హరిప్రియావ్యాఖ్యతో రాఘవయాదవీయమును బ్రకటించుటకుఁ బూనుకొనుట మిక్కిలి యానందదాయక మగు విషయము. ఈ కావ్యమునందలి మొదటి శ్లోకములో **'రామోరా'** యని వచ్చుట యాదృచ్ఛికము. ఇట్లు నిరంతర సరస్వతీ సేవ గావించు వీరి కీ కావ్యనాయకు లగు శ్రీరామ – శ్రీకృష్ణు లాయురారోగ్య భోగ భాగ్యము లొసఁగి రక్షింతురు గాక।

**కం॥ శ్రీమంతుఁ గీర్తిమంతుని**
**ధీమంతుని దేవభారతీవరివస్యా**
**భీమంతుఁ జేసి ప్రోతురు**
**రాముఁడు కృష్ణుండు కరుణ రామోరావున్.**

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

ఇట్లు

శ్రీఖర సంవత్సర
కార్తిక కృష్ణప్రతిపత్,
శుక్రవారము,
11-11-2011.

సకలసుకవిబుధజనవిధేయుఁడు,
**గరిమెళ్ళ సోమయాజులు శర్మ,**
పుష్పగిరి మహాసంస్థాన పండితుఁడు.

# ఉపయుక్త గ్రంథసూచిక

## సంస్కృతము

గ్రంథము - గ్రంథకర్త ప్రచురణ సంస్థ - ఊరు - సంవత్సరము

ఆచార్య పంచాశత్ - వేంకటాధ్వరి (నాగరాజ వ్యాఖ్య)
- సుధర్మా - మైసూరు, 1979

ఉత్తరచంపూః - వేంకటాధ్వరి (తిరుమలాచార్యవ్యాఖ్య - తెలుగులిపి)
- బెంగుళూరు, 1888

ఉత్తరచంపూః - వేంకటాధ్వరి (నాగరలిపి)
-గోపాలనారాయణ అండ్ కో, బొంబాయి

కర్ణాటసాహిత్యదర్శనమ్ - గరిమెళ్ళ సోమయాజులు శర్మ (ధారావాహికము)
-సుధర్మా - మైసూరు, 1978-81

కంకణబంధరామాయణమ్ - వాసిష్ఠ కృష్ణమూర్తి (దోర్బల - ఆంధ్రవ్యాఖ్య) - సం. రామోరా
-సాధన గ్రంథమండలి - తెనాలి, 2002

కావ్యప్రకాశఖండనమ్ - సిద్ధి చంద్రగణి
- భారతీయ విద్యాభవన్ - బొంబాయి 1953

కావ్యాదర్శ ః - దండి (ప్రకాశ సంస్కృత - హిందీ వ్యాఖ్యలు)
- చౌఖంబా విద్యాభవన్ - వారణాసి, 1958

కిరాతార్జునీయమ్ - భారవి (ఘంటాపథ - ప్రకాశవ్యాఖ్యలు)
- చౌఖంబా విద్యాభవన్ - వారణాసి, 1968

నీలకంఠవిజయచంపూః - నీలకంఠ దీక్షితులు (విబుధానంద వ్యాఖ్య)
- బాలమనోరమాప్రెస్ - మద్రాసు, 1924

నీలకంఠవిజయచంపూః - నీలకంఠ దీక్షితులు (ప్రకాశ హిందీ వ్యాఖ్య)
- చౌఖంబా విద్యాభవన్ - వారణాసి, 1964

పాణిని సూత్రవ్యాఖ్య - మణలూరు వీరరాఘవాచార్యులు
- జి.ఓ.ఎమ్.ఎల్. మద్రాసు, 1954

ప్రద్యుమ్నానందనాటకమ్ - వేంకటాధ్వరి (తిరుమల తాతాచార్య టీక)
- విద్యాతరంగిణీ ముద్రాక్షరశాల, మైసూరు



భాణవాఙ్మయచరితమ్ - కె.వి. రామకృష్ణాచార్యులు
- సంస్కృత ఎకాడమీ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు, 2010

రాఘవయాదవీయమ్ - వేంకటాధ్వరి (స్వీయవ్యాఖ్య)
- విద్యాతరంగిణీ ముద్రాక్షరశాల - మైసూరు, 1890

రాఘవయాదవీయమ్ - వేంకటాధ్వరి (సంస్కృత వ్యాఖ్య - ఆంగ్లతాత్పర్యము)
- లిఫ్కో పబ్లిషర్స్, మద్రాసు, 1966, 1988

రాఘవయాదవీయమ్ - వేంకటాధ్వరి (ఫ్రెంచి యనువాదము)
- ఫ్రెంచి ఇనిస్టిట్యూట్ - పాండిచేరి, 1972

రాఘవయాదవీయమ్ - వేంకటాధ్వరి (మూలమాత్రమ్)
- O.U సంస్కృత ఎకాడమీ జర్నల్ 19 - హైదరాబాదు, 2009

రాఘవయాదవీయమ్ - వింజమూరి సోమేశకవి (సం. చిలుకూరి పాపయ్యశాస్త్రి)
- ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాల - కాకినాడ, 1950

రాఘవయాదవీయమ్ - వసుప్రహరాజకవి
- భారతీయ బుక్ కార్పోరేషన్ - ఢిల్లీ, 2001

రామకృష్ణవిలోమకావ్యమ్ - దైవజ్ఞ సూర్యకవి (సంస్కృత హిందీ వ్యాఖ్యలు)
- చౌఖంబాసంస్కత సీరీస్ - వారణాసి - 1970

రామకృష్ణవిలోమకావ్యమ్ - దైవజ్ఞసూర్యకవి (మేళ్ళచెర్వు ద్విరసనాంధ్రవ్యాఖ్య) - (సం.రామోరా)
- సాధనగ్రంథమండలి, తెనాలి 2003

లక్ష్మీసహస్రమ్ - వేంకటాధ్వరి (బుధామోదినీవ్యాఖ్య - తెలుగులిపి)
- కార్వేటి నగరసంస్థానము - శ్రీభారతీసదనముద్రాక్షరశాల 1890

లక్ష్మీసహస్రమ్ - వేంకటాధ్వరి (బాలబోధినీ - నిశ్రేణికావ్యాఖ్యలు - నాగరలిపి)
- చౌఖంబా సంస్కృత బుక్‌డిపో - వారణాసి 1906.

లక్ష్మీసహస్రమ్ - వేంకటాధ్వరి (నాగరలిపి - తమిళలిపి)
- లిఫ్కోపబ్లిషర్స్ - మద్రాసు 1995

లక్ష్మీసహస్రమ్ - వేంకటాధ్వరి (నారాయణినమోస్తుతే - సంపుటమ్) చెఱువుకాశీవిశ్వనాథము
- చెఱువులక్ష్మి - హైదరాబాదు. 2009

వరదాభ్యుదయచంపూః - వేంకటాధ్వరి (హస్తిగిరి చంపూః - గూఢార్థదీపికాటీకా)
- విద్యాతరంగిణీ ముద్రాక్షరశాల, మైసూరు 1887

విధిత్రయపరిత్రాణమ్ – వేంకటాధ్వరి
– శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ సీరీస్ – తిరుపతి 1954
విశ్వగుణాదర్శచంపూః – వేంకటాధ్వరి (భావదర్పణ వ్యాఖ్య – తెలుఁగులిపి)
–శ్రీరంగముద్రణాలయము, చెన్నపురి, 1903
విశ్వగుణాదర్శచంపూః – వేంకటాధ్వరి (భావదర్పణ వ్యాఖ్య – తెలుఁగులిపి)
– వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు 1916, 1934
విశ్వగుణాదర్శచంపూః– వేంకటాధ్వరి (చంద్రికా వ్యాఖ్య)
– నిర్ణయసాగర్‌ప్రెస్ – బొంబాయి 1899
విశ్వగుణాదర్శచంపూః – వేంకటాధ్వరి (పదార్థచంద్రికా – ప్రభా సంస్కృత హిందీవ్యాఖ్యలు
– చౌఖంబా విద్యాభవన్ , వారణాసి 1963
విశ్వగుణాదర్శచంపూః – వేంకటాధ్వరి (ఫ్రెంచి యనువాదము)
– ఫ్రెంచి ఇనిస్టిట్యూట్, పాండిచేరి 1972
విశ్వగుణాదర్శము – వేంకటాధ్వరి (ఆంధ్రవివరణము – ఇంద్రగంటి శ్రీకాంతశర్మ)
– ధానా ప్రచురణ 2009
వేంకటాధ్వరీ – తత్కృతీనామధ్యయనమ్
– డా॥ జి. స్వామినాథాచార్యులు, హనుమకొండ 1988
శిశుపాలవధమ్ – మాఘకవి (సర్వంకషా – మణిప్రభా సంస్కృత హిందీవ్యాఖ్యలు)
– చౌఖంబా విద్యాభవన్, వారణాసి 1961
శ్రీనివాస విలాసచంపూః – వేంకటాధ్వరి (ధరణీధరటీకా)
– నిర్ణయసాగర్‌ప్రెస్, బొంబాయి – 1855, 1933
శ్రీనివాసవిలాసచంపూః – వేంకటాధ్వరి (మూలమాత్రమ్)
– రాఘవేంద్రమఠము, మంత్రాలయము 2004
సిద్ధాంతచంద్రికా – దంపూరు వేంకట సుబ్బాశాస్త్రి (శ్రీమద్భాగవత పీఠికా)
– వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు 1937
సుభాషిత కౌస్తుభః – వేంకటాధ్వరి (నాగరాజ – భావద్యోతినీవ్యాఖ్య)
– సుధర్మా, మైసూరు 1976





**తెలుఁగు**

ఆంధ్రకవుల చరిత్రము – కందుకూరి వీరేశలింగము పంతులు – మద్రాసు 1899
ఆంధ్రభాగవతము – బమ్మెరపోతన – వాణీనికేతనము – బెజవాడ 1940
కళాపూర్ణోదయము–పింగళిసూరన – వావిళ్ళరామస్వామిశాస్త్రులు & సన్స్, మద్రాసు 1965
పారిజాతాపహరణము–నందితిమ్మన – వావిళ్ళరామస్వామిశాస్త్రులు & సన్స్, మద్రాసు 1959
లక్ష్మీసహస్రకావ్యము – వేదుల సూర్యనారాయణశర్మ– శ్రీవాణీ నిలయము, తణుకు 1940
శ్రీనివాసవిలాసము – తిరుపతి వేంకటకవులు – వేంకటేశ్వర పబ్లికేషన్స్, కడియము 1956

**కన్నడము**

వర్ధమానపురాణము – ఆచణ్ణ – మైసూరు
సంక్షిప్త కన్నడసాహిత్య చరిత్రె – ఎమ్. మరియప్పభట్ట– భారతీప్రకాశన – మైసూరు –1975

**हिन्दी**

चम्पू-काव्य का आलोचनात्मक - डा. छविनाथत्रिपाठी
एवं ऐतिहासिक अध्ययन - चौरवम्बा प्रकाशान - वारणासी १९६५
मीमांसा दर्शन का विवेचनात्मक इतिहास
- डा. गजाननशास्त्री मुसल गाँवकर, चौखम्बाविद्या भवन - वारणासी १९६५
संस्कृत - व्याकरण - शास्त्र का इतिहास
- युधिष्ठिरमीमंसक - भारतीय प्राच्यविद्या-प्रतिष्ठान - अजमेर - १९६२

**ENGLISH**

A History of Indian English Literature
- M.K. Naik - Sahitya Akademy, Delhi 1982
History of Classical Sanskrit Literature
- M. Krishnamachariar - Motilal Banarasi Dass, Delhi 1974
History of the Dvaita School of Vedanta and its literature
-Dr. B.N.K. Sarma, Motilal Banarasi Dass, Delhi 1981
Kalidasa Epocrypha
- Sures Chandra Benerji , Chowkhamba Sanskrit series - Varanasi 1989

శ్రీః

# అనులోమ-విలోమ
# రాఘవయాదవీయమ్

శ్లేషయమకచక్రవర్తి శ్రీ వేంకటాధ్వరి విరచితమ్



హరిప్రియా - ఆంధ్రవ్యాఖ్య

'సహజపాండిత్య' 'తర్కకోవిద' 'విద్యావిభూషణ' 'తత్త్వశాస్త్రపారంగత'

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజిశర్మ**

M.A. (Sanskrit), M.A. (Telugu), M.A. (Darsanamulu)

పుష్పగిరి మహాసంస్థాన పండితులు

22



శ్రీరామచన్ద్రాయ నమః

## అనులోమ - విలోమ రాఘవ యాదవీయమ్

### విషయసూచిక

| శ్లోక సంఖ్య | శ్లోక పాఠము | విషయము |
|---|---|---|
| 1 | (1) అనులోమము | శ్రీరామవందనము |
| | (2) విలోమము | శ్రీకృష్ణవందనము |
| 2 | (3) అనులోమము | అయోధ్యాపురము |
| | (4) విలోమము | ద్వారకాపురము |
| 3 | (5) అనులోమము | అయోధ్యావర్ణనము |
| | (6) విలోమము | ద్వారకావర్ణనము |
| 4 | (7) అనులోమము | శ్రీరాముండు |
| | (8) విలోమము | శ్రీకృష్ణుండు |
| 5 | (9) అనులోమము | విశ్వామిత్రాగమనము |
| | (10) విలోమము | నారదాగమనము |
| 6 | (11) అనులోమము | శ్రీసీతారామకల్యాణము |
| | (12) విలోమము | పారిజాతగ్రహణము |
| 7 | (13) అనులోమము | పరశురామకథ |
| | (14) విలోమము | రుక్మిణ శోభ |
| 8 | (15) అనులోమము | శ్రీరాముండు సాకేతము చేరుట |
| | (16) విలోమము | రుక్మిణీ కృష్ణుల స్వగృహాగమనము |
| 9 | (17) అనులోమము | కైకేయి రాజ్యప్రాప్తి |
| | (18) విలోమము | సత్యభామ కోపము |
| 10 | (19) అనులోమము | రామపట్టాభిషేక విఘటనము |
| | (20) విలోమము | సత్యభామ కోపాతిశయము |
| 11 | (21) అనులోమము | శ్రీరాముని కానన ప్రాప్తి |
| | (22) విలోమము | శ్రీకృష్ణుని సత్యభామామందిరాగమనము |
| 12 | (23) అనులోమము | సీతారాముల వనగమనము |

| | | | |
|---|---|---|---|
| | (24) | విలోమము | శ్రీకృష్ణుని సత్యభామాగృహప్రాప్తి |
| 13 | (25) | అనులోమము | శ్రీరాముఁడు భరద్వాజాదులను జేరుట |
| | (26) | విలోమము | సత్యభామా ప్రసన్న భాషణము |
| 14 | (27) | అనులోమము | శ్రీరాముని చిత్రకూటప్రాప్తి |
| | (28) | విలోమము | శ్రీకృష్ణుని స్వర్గగమనము |
| 15 | (29) | అనులోమము | శ్రీరాముని దండకావనప్రాప్తి |
| | (30) | విలోమము | శ్రీకృష్ణుని నందనవన గమనము |
| 16 | (31) | అనులోమము | శ్రీరాముని విరాధహంతృత్వము, అగస్త్యప్రాప్తి |
| | (32) | విలోమము | శ్రీకృష్ణుని స్వర్గగమనముచే నింద్రుని భయము |
| 17 | (33) | అనులోమము | జటాయుస్సేవనము, శూర్పణఖారతి ప్రార్థనము |
| | (34) | విలోమము | శ్రీకృష్ణుని పారిజాతోత్పాటనము |
| 18 | (35) | అనులోమము | శూర్పణఖానాసికాచ్ఛేదము |
| | (36) | విలోమము | శక్ర-కేశవ సంభాషణము |
| 19 | (37) | అనులోమము | ఖరాసురవధ |
| | (38) | విలోమము | ఇంద్రుని సాంత్వన భాషణము |
| 20 | (39) | అనులోమము | రావణుని శ్రీరామవిజగీష |
| | (40) | విలోమము | ఇంద్రుని శోకము - యుద్ధ ప్రయత్నము |
| 21 | (41) | అనులోమము | మారీచవధ |
| | (42) | విలోమము | ఇంద్రపరాభవము |
| 22 | (43) | అనులోమము | సీతాపహరణము |
| | (44) | విలోమము | ప్రద్యుమ్నతేజోభంగము |
| 23 | (45) | అనులోమము | శ్రీరాముని సీతా వియోగము, హనుమత్సమాగమము, సుగ్రీవశరణాగతి |
| | (46) | విలోమము | ప్రద్యుమ్ననకుఁ బునస్తేజః ప్రాప్తి |
| 24 | (47) | అనులోమము | వాలివధ |
| | (48) | విలోమము | గురుడ సంరక్షణము |



| | | | |
|---|---|---|---|
| 25 | (49) | అనులోమము | రావణవధకై జయలక్ష్మీ ప్రాప్తి, సుగ్రీవునకు సైన్యలాభప్రాప్తి |
| | (50) | విలోమము | శ్రీకృష్ణునకు జయలక్ష్మీ సిద్ధి |
| 26 | (51) | అనులోమము | సీతను జూచి వచ్చిన హనుమంతునితో రాముని కలయిక, సముద్రతీరము చేరుట |
| | (52) | విలోమము | పారిజాతగ్రహణము |
| 27 | (53) | అనులోమము | శ్రీరాముని సేతుగామి వానరసేనా రక్షణము |
| | (54) | విలోమము | శ్రీకృష్ణ భక్తులకు జయము, తద్విముఖులకు భయము |
| 28 | (55) | అనులోమము | శ్రీరాముని శత్రువిజయము |
| | (56) | విలోమము | శ్రీకృష్ణుని భూలోకాగమనము |
| 29 | (57) | అనులోమము | శ్రీరాముని యయోధ్యాప్రాప్తి |
| | (58) | విలోమము | శ్రీకృష్ణుఁడు పారిజాతముతో ద్వారకలోఁ బ్రవేశించుట |
| 30 | (59) | అనులోమము | శ్రీరాముని రాజ్యప్రాప్తి |
| | (60) | విలోమము | సత్యభామకుఁ బారిజాత ప్రాప్తి |
| 31 | (61) | గ్రంథ సమాప్తి | గ్రంథాంతగద్యము |

ධධධ

శ్రీరామచన్ద్రాయ నమః

శ్రీరస్తు! శుభమస్తు!! అవిఘ్నమస్తు!!!

# అనులోమ - విలోమ రాఘవ యాదవీయమ్

శ్లేషయమక చక్రవర్తి

## శ్రీ వేంకటాధ్వరి విరచితమ్

అను శ్లో॥ వందేహం దేవం తం శ్రీతం, రంతారం కాలం భాసా యః।
**రామో రా**మాధీ రాప్యాగో, లీలా మా రాయోధ్యే వాసే॥ 1

విలో శ్లో॥ సేవాధ్యేయో రామాలాలీ, గోప్యారాధీ మా**రామోరాః**।
య స్సాభాలంకారం తారం, తం శ్రీతం వందేహం దేవమ్॥ ౧ 2

అను శ్లో॥ సాకేతాఖ్యా జ్యాయా మాసీ, ద్యా విప్రాదీ ప్తార్యాధారా।
పూ రాజీతా దేవాద్యావి, శ్వా సాగ్ర్యాసావాశారావా॥ 3

విలో శ్లో॥ వారాశా వా సాగ్ర్యా సాశ్వా, విద్యావాదేతాజీరా పూః।
రాధార్యాప్తా దీప్రా విద్యా, సీమా యా జ్యాఖ్యాతా కే సా॥ ౨ 4

అను శ్లో॥ కామభాస్థల సారశ్రీ, సౌ ధాసౌ ఘనవాపికా।
సారసారవపీనా స, రాగాకారసుభూరిభూః॥ 5

విలో శ్లో॥ భూరి భూసుర కాగారా, సనా పీవరసారసా।
కాపి వానఘసౌధాసౌ, శ్రీరసాలస్థభామకా॥ ౩ 6

అను శ్లో॥ రామధామ సమానేన, మాగోరోధన మాస తామ్।
నామహా మక్షరరసం, తారాభాస్తు న వేద యా॥ 7

విలో శ్లో॥ యాదవేనస్తు భారాతా, సంరరక్ష మహామనాః।
తాం స మానధరో గోమా, ననేమా సమధామరాః॥ ౪ 8

అను శ్లో॥ యన్ గాధేయో యోగీ రాగీ, వైతానే సౌమ్యే సౌఖ్యేసౌ।
తం ఖ్యాతం శీతం స్ఫీతం భీ, మా నా మాశ్రీహాతా త్రాతమ్॥ 9

విలో శ్లో॥ తం త్రాతా హా శ్రీమా నా మా, భీతం స్ఫీతం శీతం ఖ్యాతమ్।
సౌఖ్యే సౌమ్యే సౌ నేతా వై, గీరాగీ యో యోధే గాయన్॥ ౫ 10

అను శ్లో॥ మారమం సుకుమారాభం, రసా జాప నృతాశ్రితమ్।
కావిరామదలాపా గో, స మా వామతరా నతే॥ 11



విలో శ్లో॥ తేన రాత మవామా స, గోపాలా దమరావికా।
తం శ్రితా నృపజా సార,భం రామా కుసుమం రమా॥ ౬ 12

అను శ్లో॥ రామనామా సదా ఖేదభావే దయా
వా నతాపీ నతేజా రిపా వానతే।
కాదిమోదాసహాతా స్వభాసా రసా
మే సుగో రేణుకాగాత్రజే భూరుమే॥ 13

విలో శ్లో॥ మేరుభూజేత్రగా కాణురే గోసుమే
సారసా భాస్వతా హా సదామోదికా।
తేన వా పారిజాతేన పీతా నవా
యాద వేభా దఖే దాసమానామరా॥ ౭ 14

అను శ్లో॥ సారసాసమధా తాక్షి, భూమ్నా ధామసు సీతయా।
సాధ్వసా విహ రేమే క్షే,మ్యరమా సురసారహా॥ 15

విలో శ్లో॥ హారసార సుమా రమ్య,క్షేమే రేహ విసాధ్వసా।
యాతసీసుమధామ్నా భూ,క్షితా ధామ ససార సా॥ ౮ 16

అను శ్లో॥ సాగసా భరతా యేభ, మాభాతా మన్యుమత్తయా।
సాత్ర మధ్యమయా తాపే, పోతా యాధి గతా రసా॥ 17

విలో శ్లో॥ సారతాగధియా తాపో, పేతా యా మధ్యమత్రసా।
యాత్తమన్యుమతా భామా, భయేతా రభసాగసా ౯ 18

అను శ్లో॥ తానవా దప కోమాభా, రామే కాననదాస సా।
యా లతావృద్ధసేవాకా, కైకేయీ మహదా హహా॥ 19

విలో శ్లో॥ హహ దాహమయీ కేకై, కావాసేద్ధ వృతాలయా।
సా సదాననకామేరా, భామా కో పదవానతా॥ ౧౦ 20

అను శ్లో॥ వరమానదసత్యాస, హ్రీత పిత్రాదరా దహో।
భాస్వర స్థిరధీరో ప, హారోరా వనగా మ్యసౌ॥ 21

విలో శ్లో॥ సౌమ్యగానవరా రోహా, పరో ధీర స్థిర స్వభాః।
హో దరాదత్రాపిత హ్రీ, సత్యాసదన మార వ॥ ౧౧ 22

అను శ్లో॥ యా నయానఘ ధీతాదా, రసాయా స్తనయాదవే।
సాగతాహి వియాతాహ్రీ, సతాపానకి లోనభా॥ 23

విలో శ్లో॥ భా నలోకి న పాతా స, ప్రీతా యా విహితాగసా।
వేదయాన స్తయా సార,దాతా ధీ ఘన యానయా॥ ౧౨ 24

అను శ్లో॥ రాగిరాధుతిగర్వాదా, రదాహో మహసా హహ।
యా నగాత భరద్వాజ, మాయాసీ దమగాహినః॥ 25

విలో శ్లో॥ నో హి గామదసీయా మా, జ ద్వారభతగా న యా।
హహ సాహ మహోదార, దార్వాగతిధురా గిరా॥ ౧౩ 26

అను శ్లో॥ యాతురాజిద భాభారం,ద్యాం వ మారుత గంధగమ్।
సో గమార పదం యక్ష, తుంగాభో నఘయాత్రయా॥ 27

విలో శ్లో॥ యాత్రయా ఘనభో గాతుం, క్షయదం పరమాగసః।
గంధగం తరు మావ ద్యాం, రంభాభాదజిరా తు యా॥ ౧౪ 28

అను శ్లో॥ దండకాం ప్రదమో రాజా, ల్యా హతామయకారిహా।
స సమానవతానేనో, భోగ్యాభో న తదాస న॥ 29

విలో శ్లో॥ న సదాతనభోగ్యాభో, నో నేతా వనమాస సః॥
హారికాయమతాహల్యా, జారామోదప్రకాండదమ్॥ ౧౫ 30

అను శ్లో॥ సోరమార దనజ్ఞానో, వేదేరాకంఠకుంభజమ్॥
తం ద్రుసారపటో నాగా, నానా దోషవిరాధహా॥ 31

విలో శ్లో॥ హా ధరా విషదో నానా, గానాటోపరసాద్రుతమ్।
జంభకుంఠకరా దేవే, నో జ్ఞాన దరమార సః॥ ౧౬ 32

అను శ్లో॥ సాగమాకరపాతా హా, కంకే నావనతో హి సః।
న సమానర్ద మా రామా,లంకారాజస్వసా రతమ్॥ 33

విలో శ్లో॥ తం రసా స్వజరాకాలం, మా రామార్దన మాస న।
స హితో నవనాకేకం హాతాపారక మాగసా॥ ౧౭ 34

అను శ్లో॥ తాం స గోరమదోశ్రీదో, విగ్రా మసదరోతత।
వైర మాస పలాహారా, వినాసా రవివంశకే॥ 35

విలో శ్లో॥ కేశవం విరసానావి, రాహాలాప సమారవైః।
తతరోదసమగ్రావి, దోశ్రీదోమరగోసతామ్॥ ౧౮ 36

అను శ్లో॥ గోద్యుగోమ స్స్వమాయో భూ, దశ్రీగఖరసేనయా।
సహ సాహవధారో వి, కలోరాజ దరాతిహా॥ 37





విలో శ్లో॥ హా తిరాదజరాలోక, విరోధావహ సాహస!।
యానసేరఖగ శ్రీద, భూయో మా స్వమగో ద్యుగః॥ ౧౯ 38

అను శ్లో॥ హతపాపచయే హేయో,లంకేశో య మసారధీః।
రాజి రావిరతేరాపో, హా హాహంగ్రహ మార ఘః॥ 39

విలో శ్లో॥ ఘోరమాహ గ్రహం హాహా,పో రాతే రవిరాజిరాః।
ధీరసామయశోకే లం,యో హేయే చ పపాత హ॥ ౨౦ 40

అను శ్లో॥ తాటకేయలవా దేనో, హారీ హారిగిరాస సః।
హా సహాయ జనా సీతా, నాప్తేనాదమనా భువి॥ 41

విలో శ్లో॥ విభునా మదనాప్తేనా, తాసీనా జయహా సహా।
స సరా గిరిహారీ హా, నో దేవాలయ కేటతా॥ ౨౧ 42

అను శ్లో॥ భారమా కుదశాకే నా, శరాధీకుహకేన హా।
చారుధీవనపాలోక్యా, వైదేహీ మహితా హృతా॥ 43

విలో శ్లో॥ తా హృతా హి మహీదేవై, క్యాలోపానవధీరుచా।
హానకేహకుధీరాశ, నాకేశా దకుమార భాః॥ ౨౨ 44

అను శ్లో॥ హారితోయదభో రామా, వియోగే నఘవాయుజః।
తం రుమామహితోపేతా, మోదో సారజు రామ యః॥ 45

విలో శ్లో॥ యో మరాజు రసాదోమో, తాపేతో హిమమారుతమ్।
జో యువా ఘన గేయో వి, మారాభోదయతో రిహా॥ ౨౩ 46

అను శ్లో॥ భానుభానుతభా వామా, సదామోదపరో హతమ్।
తం హ తామరసాభాక్షో, తిరాతాకృత వాసవిమ్॥ 47

విలో శ్లో॥ విం స వాత కృతారాతి, క్షోభాసారమతాహతమ్।
తం హరోపదమోదాస, మావాభాతనుభానుభాః॥ ౨౪ 48

అను శ్లో॥ హంసజారుద్ధబలజా, పరోదార సుభాజని।
రాజి రావణ రక్షోర, విఘాతాయ రమార యమ్॥ 49

విలో శ్లో॥ యం రమార యతాఘా వి, రక్షోరణవరాజిరా।
నిజభా సురదా రోప, జాలబద్ధ రుజాసహమ్ ॥ ౨౫ 50

అను శ్లో॥ సాగరాతిగ మాభాతి, నాకేశోసురమా సహః।
తం స మారుతజం గోప్తా, భా దాసాద్య గతోగజమ్॥ 51

విలో శ్లో॥ జం గతో గద్యసాదాభా,ప్తా గోజం తరుమాస తమ్।
హ స్సమారసుశోకేనా, తిభామా గతి రాగసా॥ ౨౬ 52

అను శ్లో॥ వీరవానరసేనస్య, త్రాతా భాదవతా హి సః।
తోయధావరిగోయాద, స్యయతో నవసేతునా॥ 53

విలో శ్లో॥ నా తు సేవనతో యస్య, దయాగోరివధాయతః।
స హి తావదభాతాత్రా, స్యనసే రనవారవీ॥ ౨౭ 54

అను శ్లో॥ హారిసాహస లంకేనా, సుభేదీ మహితో హి సః॥
చారుభూతనుజో రామో, ర మారాధయ దార్తిహా॥ 55

విలో శ్లో॥ హా ర్తిదాయ ధరా మార, మోరా జో నుతభూ రుచా।
స హితో హి మదీభే సు, నాకే లం సహ సారిహా॥ ౨౮ 56

అను శ్లో॥ నాళికేరసుభాకారా, గారాసౌ సురసాపికా।
రావణారిక్షమేరా పూ,రాభేజే హి న నామునా॥ 57

విలో శ్లో॥ నామునా నహి జే భేరా, పూరామే క్షరిణా వరా।
కాపి సారసుసౌరాగా, రాకాభాసుర కేళినా॥ ౨౯ 58

అను శ్లో॥ సాగ్ర్యతామర సాగారా, మక్షామా ఘనభార గౌః।
నిజదే పరజి త్యాస,శ్రీ రామే సుగరాజభా॥ 59

విలో శ్లో॥ భాజరాగసుమేరా శ్రీ, సత్యాజిర ప దేజని।
గౌరభానఘమా క్షామ, రాగా సార మతాగ్ర్యసా॥ ౩౦ 60

శ్లో॥ శ్రీమద్రాఘవయాదవాకృతిధర శ్శేషాచలోత్తంసక
శ్ర్శేయోహేతు మచీకరత్ కృతి మిమాం శ్రీశో మయా దుష్కరామ్।
తస్మా దత్ర పవిత్రమాధవ కథాస్వాదోన్మిషత్కౌతుకా
స్సంత స్సాధు విచిన్వతాం గుణవిదః శ్లాఘా మమోఘాదరాః॥ 61

ఇతి శ్రీమత్కాంచీనగరనాయక తాతాచార్యభాగినేయ వాజపేయ సర్వపృష్ఠాప్తో ర్యామాదియాజి శ్రీశ్రీనివాసార్య తనూభవస్య శ్లేషయమక చక్రవర్తినో రఘునాథార్యయజ్వన స్తనయేన శ్రీశ్రీనివాస కృపాతిశయ సువిదితనయేన సీతాంబాగర్భ సంభవేన శ్రీమదాత్రేయ వేంకటార్య యజ్వనా విరచితం రాఘవ యాదవీయాఖ్య మనులోమ విలోమకావ్యం సంపూర్ణమ్

శ్రీః శ్రీః శ్రీః





# అనులోమ - విలోమ రాఘవ యాదవీయమ్

## హరిప్రియా వ్యాఖ్య

**శా॥ శ్రీమద్భాస్వ దపత్యవాహినికి సత్ప్రేమాస్పదుం డంబుద**
**శ్యాముం డంబుజపత్ర నేత్రుఁడు సదాహల్యాప్రమోదాత్ముఁడౌ**
**రాముండో మతి కృష్ణుఁడో త్రిజగతీ రక్షావతారుండు మ**
**మ్మోమున్ ధూతమహారిబాణుఁ డగు భద్రోల్లాసుఁ డెల్లప్పుడున్**

**టిప్పణి :** భాస్వత్=సూర్యుని, అపత్య = సంతాన మైన సుగ్రీవునియొక్క; వాహినికి = సైన్యమునకు; ప్రేమాస్పదుఁడు = ఇది రామపక్షము. భాస్వత్ = సూర్యుని, అపత్యవాహినికి = సంతాన మైన యమునానది కని శ్రీకృష్ణపక్షము. 'ధ్వజినీవాహినీసేనా' 'స్రవంత్యా మపి వాహినీ' యని యుభయత్ర యమరము.

సదా = ఎల్లప్పుడు, అహల్యా = గౌతమమహర్షి భార్య యగు నహల్యకుఁ బ్రమోదాత్ముఁ డని శ్రీరామపక్షము. సదా = ఎల్లప్పుడు, హల్యా = హలముచే దున్నఁదగినది కృష్టభూమి. భూదేవికిఁ బ్రమోదాత్ముఁ డని కృష్ణపక్షము. అహల్యాః త్రి. హలేన కృష్యమ్. తతో నఙ్సమాసః హలానాకృష్ట క్షేత్రాదిః అకృష్టభూమిః. అహల్యా స్త్రీ గౌతమముని పత్నీ - అని శబ్ద కల్పద్రుమము. ధూత = త్రోయఁబడిన, మహారి = గొప్ప శత్రువులు గల, బాణుఁడు = బాణములు గల వాఁడు. బాణములచే శత్రువులను దూరముగాఁ ద్రోలినవాఁ డని శ్రీరామపక్షము.

ధూత = త్రోయఁబడిన, మహారి = గొప్ప శత్రు వగు; బాణుఁడు=బాణాసురుఁడు గలవాఁ డని శ్రీకృష్ణపక్షము. భద్ర + ఉల్లాసుఁడు = భద్రమైన యుల్లాసము గలవాఁడు శ్రీరామభద్రుఁడు. భద్రా+ఉల్లాసుఁడు = భద్రాదేవి కుల్లాసము గూర్చు వాఁడు శ్రీకృష్ణుఁడు. 'భద్ర' శ్రీకృష్ణుని యష్టమహిషులలో నొకతె. అంబుదశ్యాముఁడు = మేఘము వలె నల్లనైనవాఁడు, అంబుజపత్రనేత్రుఁడు = పద్మ దళముల వంటి కన్నులు గల వాఁడు. త్రిజగతీరక్షావతారుండు = ముల్లోకములను రక్షించు నవతారములు గల వాఁడు. ఈ విశేషణత్రయ ముభయత్ర సమానము. కడమ సుగమము.

**కం॥ అంచిత మయి గోపీకిలి**
**కించిత రోమాంచలలిత కేళీలీలా**
**వంచిత మగు నంజనగిరి**
**సంచితతేజంబు మాకు శరణము గాతన్**

**శా॥ శ్రీద్వేంకటయజ్వ సత్కవి సుధీశ్రేష్ఠుండు ధీక్లిష్టుఁడై**
**భూమిన్ రాఘవయాదవీయరచనన్ బొల్పొందఁగాఁ జేసె స**
**త్ప్రామాణ్యం బగు ఫక్కి నచ్యుత గతప్రత్యాగత ప్రక్రియన్**
**గామాక్షీకృపచే హరిప్రియ యనంగా వ్యాఖ్య నేఁ జేసెదన్.**

**అవతారిక :-** శ్రీవేంకటాధ్వరిమహాకవి యనులోమపాఠముచే శ్రీమద్రామాయణకథను విలోమపాఠముచే శ్రీమద్భాగవత హరివంశాద్యుక్తపారిజాతాపహరణకథను బ్రతిపాదించు శ్లోకములచేఁ బరిష్కృతమైన రాఘవ యాదవీయ మను నతిదుష్కర ప్రబంధమును రచించుట కుపక్రమించిన వాఁడై ప్రారంభించిన గ్రంథము నిర్విఘ్నముగా సమాప్తి నొందుటకై యనులోమ-విలోమ పఠనముచే శ్రీరామ - శ్రీకృష్ణ వందన ప్రతిపాదక మగు ప్రబంధ విషయక మగు మంగళము నాచరించుచున్నాఁడు -

మంగళాచరణము

**అనులోమపాఠము - శ్రీరామవందనము**

**శ్లో॥ వందేహం దేవం తం శ్రీతం రంతారం కాలం భాసా యః॥**
**రామో రామాధీ రాప్యాగో లీలా మారాయోధ్యే వాసే ॥౧॥ 1**

**పదవిభాగము:-** వందేహమితి-వందే। అహమ్। దేవమ్। తమ్। శ్రీతమ్। రంతారమ్। కాలమ్। భాసా। యః। రామః। రామాధీః। అప్యాగః। లీలామ్। ఆర। ఆయోధ్యే। వాసే॥

రామా = స్త్రీ యగు సీతయందు; ధీః = బుద్ధి గల వాఁడు; అప్యాగః - అప్య = పొందుటకు (విహరించుటకు) యోగ్యము లైన; అగః = సహ్య -మలయాదిపర్వతములు గల వాఁడు. సీతను మనస్సులో నుంచుకొని సహ్యాదిపర్వతములు చేరిన వాఁ డని భావము. రామః = ఆ రాముఁడు; ఆయోధ్యే = అయోధ్యాపట్టణములో నున్న, వాసే = తన నివాసగృహ మందు; లీలామ్ = క్రీడను; ఆర = పొందినవాఁ డయ్యెను.

'ఋ - గతౌ' యను ధాతువునకు లిట్టు - ప్రథమైకవచనములో 'ఆర' యను రూప మగును.

శ్రీరాముఁడు రావణాసురుని వధించి మఱల నయోధ్య చేరి తన యింటిలో సీతతోఁ గూడి క్రీడించె నని భావము.

యః = అట్టి వాఁ డెవ్వడో; భాసా = కాంతిచేత; కాలమ్ = నల్లని వానిని; రంతారమ్ = జగత్ - సృష్టి - స్థితి - లయములచేఁ గ్రీడించు వానిని; శ్రీ + ఇతమ్ = శ్రీతమ్; శ్రీ = సంపదచే; ఇతమ్ = పొందఁబడిన వానిని; సిరిసంపద లన్నియుఁ గల వాని నని భావము. 'శోభాసంపత్తిపద్మాసు లక్ష్మీః శ్రీ రపి కథ్యతే' అని శాశ్వతనిఘంటువు.

తమ్ = ఆ ప్రసిద్ధుఁడగు; దేవమ్ = దేవుని, శ్రీరామచంద్రుని; అహమ్ = నేను; వందే = నమస్కరించుచున్నాను.

ఈ శ్లోకమునకే శ్రీకృష్ణవందనపరముగా విలోమపాఠము -

**శ్లో॥ సేవాధ్యేయో రామాలాలీ గోప్యారాధీ మారామోరాః**
**య స్సాభాలంకారం తారం తం శ్రీతం వందేహం దేవమ్॥ 2**



**పదవిభాగము :-** సేవాధ్యేయః। రామాలాలీ। గోప్యారాధీ। మారామోరాః। యః। సాభాలంకారమ్। తారమ్। తమ్। శ్రీతమ్। వందే। అహమ్। దేవమ్॥

మారామోరాః। మా + ఆరామ + ఉరాః। మా = లక్ష్మీదేవికి; ఆరామ = భోగ్యస్థానమైన; ఉరాః = వక్షఃస్థలము గలవాఁడు.

సూ॥ ఉరః ప్రభృతిభ్యః కప్ (5-4-151) అను పాణిని సూత్రముచే విధింపఁబడిన 'కప్' ప్రత్యయము - 'సమాసాంతవిధిరనిత్యః' అను వచనముచే సమాసాంతము గావునఁ బాటింపఁబడలేదు. అందువల్లనే-

**శ్లో॥ తుల్యారూఢ సమస్తలోకవిజయ శ్రీపూర్యమాణోరసమ్ (అనర్ఘ 4-26)**

అని మురారిమహాకవి ప్రయోగించినాఁడు.

సేవాధ్యేయః। సేవా= తపస్సు, యజ్ఞము మొదలగు సేవలచే; ధ్యేయః = ధ్యానింపఁ దగిన వాఁడు. తపోయజ్ఞాదులచేఁ బక్వకషాయుఁడగు వానికే భగవద్ధ్యానము సిద్ధించును. వేదములో నిట్లే వినఁబడుచున్నది- 'తమేవం వేదానువచనేన బ్రాహ్మణా వివిదషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన'

ఈ విధముగా నా భగవంతుని బ్రాహ్మణులు వేదానువచనముచే యజ్ఞముచే, దానముచే, ననాశక మగు తపస్సుచేఁ దెలిసి కొనుచున్నారు.

కాఁబట్టి శ్రీకృష్ణుఁడు యజ్ఞ - దాన - తపస్సులచే ధ్యానింపఁదగిన వాఁడు గాని, తక్కిన వానికి లొంగు వాఁడు కాఁడు. ఇక్కడ - 'అసినా జిఘాంసతి' - కత్తితో హింసించు చున్నాఁడు - మొదలగు వాక్యములలో హనన క్రియకుఁ గత్తియుపాయ మైనట్లే భగవంతునిఁ దెలిసికొనుటకు యజ్ఞాదులే యుపాయము లని యీ శ్రుతివాక్యమునకుఁదాత్పర్యము. రామాలాలీ। రామా = రుక్మిణి మొదలగు నష్టమహిషులను, లాలీ = లాలించువాఁడు.

1. రుక్మిణి 2. సత్యభామ 3. జాంబవతి 4. మిత్రవింద 5. భద్ర 6. సుదంత 7. కాళింది 8. లక్షణ యను వారు శ్రీకృష్ణుని యష్టమహిషులు.

గోపీ + ఆరాధీ = గోప్యారాధీ। గోపీ = రాధ మొదలగు గోపికలను; ఆరాధీ = సమ్మానించువాఁడు.

దీనివలన శ్రీకృష్ణుని దక్షిణనాయకత్వము వ్యక్త మగుచున్నది.

యః = ఇట్టివాఁ డెవ్వడో; తమ్ = వానిని; సాభాలంకారమ్ = స + ఆభా + అలంకారమ్। స + ఆభా = కాంతితోఁ గూడిన; అలంకారమ్ = కౌస్తుభము మొదలగు నాభరణములు (వస్తువులు) గలవానిని; దేవమ్ = భగవంతుని; (వాసుదేవమ్ = వసుదేవుని కుమారుఁ డగు; శ్రీకృష్ణుని నామైకదేశముచే నామగ్రహణము పేరు లోని కొంత భాగమే వాడుకలో గ్రహించుట). అహమ్ = నేను; తారమ్ = బిగ్గరగా; వందే = స్తుతించుచున్నాను. ఉచ్చైః స్వరముతో స్తవము చేయుచున్నాను.

'వది - అభివాదన స్తుత్యోః' అను ధాతువునకు 'లట్టు' (వర్తమానకాలము)లో నుత్తమపురుషములో నేకవచనములో 'వందే' యను రూప మగును.

శ్రీమన్మహాభారతము నందలి విష్ణు సహస్రనామములలో 'వాసుదేవో బృహద్భాను రాదిదేవః పురందరః' 'వసుప్రదో వాసుదేవో వసు ర్వసుమనా హవిః' అని రెండు చోట్ల వాసుదేవనామము పఠింపఁబడినది. ఇక్కడ - వసతి - వాసయతి, ఆచ్ఛాదయతి వా సర్వ మితి వాసుః దీవ్యతి - క్రీడతి, విజిగీషతే, వ్యవహరతి, ద్యోతతే, స్తూయతే, కామ్యతే, గచ్ఛతీతి, వా దేవః వాసు శ్చాసౌ దేవ శ్చేతి వాసుదేవః వసుదేవ స్యాపత్యం వాసుదేవః'॥ అని శ్రీశంకరభగవత్పాదభాష్యము. సర్వభూతములందు నంతర్యామిరూపమున వసించువాఁడు; సర్వభూతములను దనయందు వసింపఁజేయువాఁడు, స్వమాయచే సర్వము నాచ్ఛాదించు వాఁడు వాసువు. సృష్టి - స్థితి - లయ క్రియలచేఁ గ్రీడించువాఁడు, రాక్షసులను జయించు వాఁడు, జీవరూపమున వ్యవహరించు వాఁడు, స్వయముగాఁ బ్రకాశించు వాఁడు, బ్రహ్మాదులచే స్తుతింపఁబడు వాఁడు, యోగులచేఁ గామింపఁబడు వాఁడు, గమనశీలుఁడు నగు వాఁడు దేవుఁడు. వాసు వైన దేవుఁడు వాసుదేవుఁడు. వసుదేవుని కుమారుఁ డైన శ్రీకృష్ణపరమాత్మయే వాసుదేవుఁ డని భావము. ఇక్కడ మొదటి నామమునకు నిర్గుణ బ్రహ్మపరముగను, రెండవ నామమునకు సగుణబ్రహ్మపరముగను నిర్వచనము చెప్పఁబడినది. అట్టి వాసుదేవుని స్తుతించుచున్నా నని భావము.

ఇది 'విద్యున్మాలా' వృత్తము.

మో మో గో గో విద్యున్మాలా (వృత్త - 3-13)

అని **వృత్తరత్నాకర** లక్షణము.

విద్యున్మాలావృత్తములోఁ బ్రతిపాదమునందు 'మ - మ-గ - గ' యను గణము లుండును. ౧

## కథా ప్రారంభము

**అవతారిక:-** ఇక్కడనుండి యనులోమ శ్లోకములచే శ్రీరామకథను విలోమశ్లోకములచేఁ బారిజాతాపహరణకథను జెప్పుచున్నాఁడు - **అనులోమము - అయోధ్యాపురవర్ణనము.**

**శ్లో॥ సాకేతాఖ్యా జ్యాయా మాసీ ద్యా విప్రాదీ ప్తార్యాధారా।**

**పూ రాజీతా దేవాద్యావిశ్వా సాగ్ర్యా సావాశారావా॥౩॥** 3

**పదవిభాగము:-** సాకేతాఖ్యా। జ్యాయామ్। ఆసీత్। యా। విప్రాదీప్తా। అర్యాధారా। పూః। ఆజీతా। అదేవాద్యావిశ్వాసా। అగ్ర్యా। సావాశారావా॥

ఆజి+ఇతా= ఆజీతా। అజుని కుమారుఁడు 'ఆజి' = దశరథుఁడు. అజ స్యాపత్యమ్ పుమానాజిః సూ॥ అత 'ఇఞ్' ఆది దీర్ఘము వచ్చి 'ఆజి' యని యగును. ఆజి =దశరథునిచే;



ఇతా = పొందఁబడినది. దశరథునకు నివాసమైన దని భావము. అ + దేవ + ఆద్య + అవిశ్వాసా = అదే వాద్యా విశ్వాసా। దేవ + ఆద్య = గంధర్వులు దానవులు మొదలగు వారి యందు; అవిశ్వాసా = విశ్వాసము లేనిది. అది కానిది - అదే వాద్యా విశ్వాసా దేవాదులు తనకుఁ బైలోకములో నున్నారను విశ్వాసము లేనిది యెప్పుడు కానిది. దేవాదులకుఁ గూడ సాధింప శక్యము గాని దని భావము. అగ్ర్యా = మొదటఁ బుట్టినది.

**శ్లో॥ అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ హ్యవంతికా।**

**పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః ॥**

1) అయోధ్య (2)మధుర (3) మాయ (హరిద్వారము) (4) కాశి (5) కాంచి (6) అవంతిక (ఉజ్జయిని) (7) ద్వారక యను సప్త పట్టణములలో మొట్టమొదట గణింపఁబడిన దని భావము. శ్రేష్ఠ మైన పుర మని యర్థము.

సావాశ + ఆరావా = సావాశారావా!

సవ మనఁగా యజ్ఞము, యజ్ఞః సవోఽధ్వరో యాగః అని యమరము. సవం యజ్ఞ మశ్నంతీతి సవాశాః యజ్ఞహవిస్సును భుజించు వారు = క్రతుభుక్కులు, దేవతలు. వారికి సంబంధించినది సావాశము. లేక సవమునకు సంబంధించినది 'సావము' = హవిస్సు. దానిని భుజించు వారు సావాశులు. ఆ దేవతలయొక్క ఆరావా = కోలాహల ధ్వని గలది. అయోధ్యలో నెల్లప్పుడు యజ్ఞములు జరుగుచుండుటచే నా యజ్ఞహవిస్సును భుజించుటకై వచ్చెడు దేవతలయొక్క కలకలధ్వని గల దని భావము.

అర్య + ఆధారా = అర్యాధారా! అర్య = కోమటులకు, ఆధారా = ఆశ్రయభూత మైనది. అపేక్షిత వస్తు క్రయ విక్రయములచే వైశ్యుల కాధార మైన దని భావము. 'స్యా దర్యః స్వామి వైశ్యయోః' అని యమరసింహుని నామ లింగాను శాసనము. యా = ఏ, పూః = పురి విప్ర+ఆదీప్తా = విప్రాదీప్తా! విప్ర = బ్రాహ్మణులచే, ఆదీప్తా = మిక్కిలి ప్రకాశింపఁ బడినదో; సా = అ, సాకేత + ఆఖ్యా = సాకేత మను పేరు గల యయోధ్యాపురము.

'స్యా త్సాకేత మయోధ్యాయామ్' అని యమరము, జ్యాయామ్ = భూమియందు; 'క్షోణీ జ్యా కాశ్యపీ క్షితిః' అని యమరము. ఆసీత్ = ఉండెను, 'అస - భువి' యను ధాతువునకు లఙ్' (భూతకాలము)లో రూపము.

## విలోమము - ద్వారకావర్ణనము

**శ్లో॥ వారాశావాసాగ్ర్యా సాశ్వా విద్యావాదేతా జీరా పూః।**

**రాధార్యాప్తా దీప్రా విద్యా సీమా యా జ్యా ఖ్యాతా కే సా॥** 4

**పద విభాగము:-** వారాశౌ ఆస అగ్ర్యా సాశ్వా విద్యావాదేతాజీరా పూః। రాధార్యాప్తా దీప్రా విద్యాసీమా యా జ్యాఖ్యాతా కే సా॥

అగ్ర్యా = ఉత్తమ మగు పురము ద్వారక. సప్తపురములలో ద్వారవతి చివరి దగుటచే నుత్తమత్వము, స+అశ్వా = గుఱ్ఱములతోఁ గూడినది. ఇది గజాదుల కుపలక్షకము. రథ – గజ (ఏనుఁగులు) – తురగ (గుఱ్ఱములు) – పదాతు (భటులు)లను చతురంగబలములతోఁ గూడిన దని భావము, విద్యా + వాద + ఇత + ఆజి + ఇరా = విద్యావాదేతాజీరా! విద్యావాద = తర్కశాస్త్రాది విద్యావాదములలో, ఇత + ఆజి = ప్రాప్తయుద్ధులగు పండితులకు, ఇరా = భూమి = స్థానము.

'ఇరా భూమి సురావారి భారతీషు నిగద్యతే' అని హలాయుధనిఘంటువు. చతుర్దశ విద్యలయందు వాదయుద్ధములలోఁ బాల్గొను పండితులకు నిలయ మైన దని భావము.

రాధా + అర్య + ఆప్తా = రాధార్యాప్తా। రాధా = రాధాదేవికి, అర్య = స్వామి యగు శ్రీకృష్ణునిచే, ఆప్తా = పొందఁబడినది. లేక శ్రీకృష్ణునికిఁ బ్రియ మైనది. దీప్రా = ప్రకాశించునది. విద్యా = దహరవిద్య మొదలగు బ్రహ్మ విద్యలకు, సీమా = స్థానము = ఎల్ల యైనది.

ఎల్లప్పుడు భగవంతుఁ డగు శ్రీకృష్ణునకు సన్నిధాన మైన దగుటచే బ్రహ్మ విద్యకు సిద్ధక్షేత్రమైన దని భావము, యా=ఏ, పూః = పురము, జ్మా = భూమియందు, ఖ్యాతా = మిక్కిలి ప్రసిద్ధమైనదో; సా = ఆ ద్వారక, వాః + రాశౌ = జలరాశి యగు సముద్రమునందు, కే = జలమునందు, సముద్రజలమధ్యమునందు, ఆస = ఉండెను.

'ఆస' యనునది తిఙంత ప్రతిరూపక మగు నవ్యయము.

దీని వలన – అస్తేర్భూః (2–4–52) అను సూత్రముచే నార్ధధాతుక మగు 'అస్తి'కి 'భూ' యనునది విధింపఁబడుటచే 'ఆస' యను ప్రయోగ మసాధు వను శంక నిరస్తమైనది.

'లావణ్య ఉత్పాద్య ఇవాస యత్నః' (కుమార 1–35). మొదలగు మహాకవి ప్రయోగము లనేకములు గలవు.

ఇక్కడ – 'రాధార్యాప్త' 'అగ్ర్య' యగు పురి సముద్రమునం దున్న దని చెప్పుటచే 'ద్వారకాపుర' మని తెలియుచున్నది.

అందు వల్లనే యిచ్చటఁ 'బర్యాయోక్త' మలంకారము

**శ్లో॥ పర్యాయోక్తం తు గమ్యస్య వచోభంగ్యంతరాశ్రయమ్।**

**నమ స్తస్మై కృతౌ యేన ముధా రాహువధూకుచౌ॥** (చంద్రా–63)

అని చంద్రాలోకలక్షణము. వర్ణింపఁ దగిన వస్తువును మఱొక భంగిగాఁ బ్రతిపాదించిన చోఁ బర్యాయోక్తము. 'రాహుస్త్రీ స్తనము లెవనిచే వ్యర్థముగాఁ జేయఁబడినవో వానికి నమస్కారము' అనుచోట రాహువు కంఠమును సుదర్శన చక్రముతో ఖండించిన వాఁడు శ్రీమహావిష్ణు వని గమ్యమానమగుచున్నది.

అట్లే ప్రకృత శ్లోకములో రాధాప్రియునకుఁ బ్రియమైన పురము సముద్రములోఁ గల దని ద్వారకను భంగ్యంతముగాఁ జెప్పుటచేఁ బర్యాయోక్తమైనది.



'వారాశౌ బభూవ' – సముద్రములో నుండె నని యింత మాత్రమే చెప్పినచో 'గంగాయాం ఘోషః' గంగయందు గొల్లపల్లె యను వాక్యము వలె లక్షణచే గంగ యొడ్డున గొల్లపల్లె గలదని యర్థము వచ్చునట్లుగా ద్వారక కూడ సముద్రతీరమునఁ గల దను నర్థము వచ్చును. అట్లీ యర్థము రాకుండుటకై 'వారాశౌ – కే – ఆస' సముద్రములో జలమునందు (సముద్రమధ్యమునందు) ఉండె నని చెప్పఁబడినది.

ఈ శ్లోకము కూడ విద్యున్మాలావృత్తము ॥౨॥

**అవతారిక :–** ఇప్పు డనులోమ – ప్రతిలోమ శ్లోకములచే నయోధ్యా – ద్వారకలను వర్ణించుచున్నాఁడు –

**అనులోమము – అయోధ్య**

**శ్లో॥ కామభాస్థలసార శ్రీసౌధాసౌ ఘనవాపికా।**

**సారసారవపీనా సరాగాకారసుభూరిభూః॥౩॥** 5

**పదవిభాగము :–** కామభాస్థలసార శ్రీసౌధా। అసౌ। ఘనవాపికా। సారసారవపీనా। సరాగాకార సుభూరిభూః॥

కామభా = మన్మథకాంతులకు, స్థల = స్థానములు, సారశ్రీ = శ్రేష్ఠ మైన సంపదలు గల, సౌధా = రాజగృహములు గలది. ద్వారకా పట్టణమునందలి మేడలు మన్మథోద్దీపకములు, సార సంపదలకు నిలయములు నని భావము.

ఘనవాపికా = పెద్ద పెద్ద దిగుడు బావులు గలది. సారస = బెగ్గురు పక్షుల, ఆరవ = ధ్వనులచే, పీనా = బలిసినది – నిండినది. బిగ్గరగాఁ గూయుచున్న జలపక్షుల కోలాహలము మిక్కుటముగాఁ గల దని భావము. అసౌ = ఆ యయోధ్యాపురి, సరాగ + ఆకార + సు + భూరి + భూః; సరాగ = ఎఱ్ఱని రంగుతోఁ గూడిన, ఆకార = ఆకృతి గల, సుభూరి = మేలిమి బంగారమునకు, భూః = స్థాన మైనది. 'భూరి ప్రాజ్య సువర్ణయోః' 'భూః పృథివ్యాం స్థానమాత్రే' యని యుభయత్ర విశ్వకోశము. లేక, సరాగ = అనురాగములతోఁ గూడిన, సు = మంచి, భూరి = గొప్ప, భూః=భూములు గలదని కూడ నర్థము చెప్పుకొనవచ్చును. అయోధ్యలో మన్మథోద్దీపకములై సకల సంపదలకు స్థానము లైన ప్రాసాదములు గలవు. నిబిడ మైన దిగుడు బావులు గలవు. ఆ బావులలో జలపక్షుల కలకలధ్వను లెక్కువగా నుండును. ఆ పట్టణ మెఱ్ఱని మేలిమి బంగారమునకు స్థానమైనది. అం దాలుమగల సరాగములు గల మంచి మంచి పెద్ద పెద్ద భూములు గలవు.

**విలోమము – ద్వారక**

**శ్లో॥ భూరి భూసురకాగారా సనా పీవర సారసా।**

**కాపి వానఘసౌధాసౌ శ్రీరసాలస్థ భామకా॥** 6

**పదవిభాగము:–** భూరి భూసుర కాగారా సనా। పీవర సారసా। కా। అపి। వా। అనఘసౌధా। అసౌ శ్రీరసాలస్థ భామకా।

భూరి = ఎక్కువ మంది, భూసురక = బ్రాహ్మణులు గల, అగార + ఆసనా = గృహ వేదికలు గలది. ద్వారకలో నెప్పుడు యజ్ఞములు జరుగుచుండు ననియు, నింటి యరుఁగులపై బ్రాహ్మణు లెప్పుడు తిరుగుచుండు రనియు భావము. పీవర = బలిసిన, సారసా = పద్మములు గలది. పెద్దగా వికసించిన పద్మములకు స్థాన మని భావము.

'సారసః పక్షి భేదే స్యాత్ సారసం సరసీరుహే' అని విశ్వము. న+అఘ = అనఘ = పాపరహిత మైన, నిర్దోషము లైన, సౌధా = భవనములు గలది. లేదా యనఘ మనఁగా నిర్మలమైనది.

'అనఘో నిర్మలాపాప రమ్యేషు చ నిరామయే'

అని నానార్థరత్నమాలా కోశము. వా = మఱియును, వా శబ్దము సముచ్చయార్థకము, వా స్యాద్వికల్పోపమయో రేవార్థే చ సముచ్చయే' అని యభిధానకోశము

కా + అపి = కాపి = ఒకానొక యనిర్వచనీయమైన, అసౌ = ఆ ద్వారకాపురి, శ్రీ+రసాల+స్థ+భామకా, శ్రీ = శోభతోఁ గూడిన, రసాల = తియ్యమామిడి చెట్ల యందు. స్థ = ఉన్న, భామకా = సూర్యుఁడు గలది, 'భామః క్రోధే రవౌ దీప్తౌ' అని విశ్వము, ద్వారక యందలి మామిడి చెట్లు సూర్యమండల మంత యెత్తుగా నున్నవని భావము, అందువల్లనే 'సంబంధాతిశయోక్తి' యలంకారము.

**శ్లో॥ సంబంధాతిశయోక్తిః స్యా దయోగే యోగకల్పనమ్।**
**సౌధాగ్రాణి పుర స్యాస్య స్పృశంతి విధుమండలమ్॥** (చంద్రా – 34)

"సంబంధము లేక పోయినను సంబంధ మున్నట్లు వర్ణించుట సంబంధాతిశయోక్తి. ఆ పట్టణము నందలి సౌధాగ్రములు (రాజగృహశిఖరములు) చంద్రమండలము నంటుచున్నవి" అని చంద్రాలోకము. ఈ కావ్యము నందలి శ్లోకములన్నియుఁ బ్రాయికముగా ననుష్టుప్పులు.

**శ్లో॥ పంచమం లఘు సర్వత్ర సప్తమం ద్విచతుర్థయోః।**
**షష్ఠం గురు విజానీయా దేత త్పద్యస్య లక్షణమ్॥**

అని కాళిదాసుని శ్రుత బోధము. అనుష్టుప్పద్యములోఁ బ్రతిపాదమునందు నెనిమదక్షరము లుండును. నాలుగు పాదము లందు నైదవ యక్షరము లఘువుగా నుండుట రెండు – నాల్గు పాదములలో నేడవ యక్షరము లఘువుగా నుండుట, నాలుగు పాదము లందు నాఱవ యక్షరము గురువుగా నుండుట యనుష్టుప్ఛందోలక్షణము ॥3॥

అవతారిక : – ఈ విధముగా రెండు శ్లోకములలో నయోధ్యా – ద్వారకా పట్టణములను వర్ణించి యిప్పుడు కథానాయకు లగు శ్రీరాముని, శ్రీకృష్ణుని వర్ణించుచున్నాఁడు.





## అనులోమము – శ్రీరాముఁడు

**శ్లో॥ రామధామ సమానేన మాగోరోధన మాస తామ్।**
**నా మహా మక్షరరసం తారాభా స్తు న వేద యా॥౪॥** 7

**పదవిభాగము:–** రామధామ। సమానేనమ్। ఆగోరోధనమ్। ఆస। తామ్। నామహామ్। అక్షరరసమ్। తారాభాః। తు। న। వేద। యా॥

యా=ఏ, పురి, తారాభాః = నక్షత్రకాంతులను, న వేద = ఎఱుఁగుట లేదో. తారాశబ్దము సూర్యాదుల కుపలక్షకము. అయోధ్యా పట్టణము నందలి మేడలు, తోఁటలు దట్టముగా నుండుటచే సూర్య – చంద్ర – నక్షత్రకాంతులు క్రిందకుఁ బడవు. కాఁబట్టి యిచ్చటి ప్రజల కెండ మొదలగునవి తెలియ వని భావము.

న + అమహామ్ = నామహామ్। మహః = ఉత్సవము. 'మహ ఉద్ధవ ఉత్సవః' అని యమరము. అమహా = ఉత్సవములు లేనిది. న = అది కానిది 'నామహా' ఎల్లప్పుడు మహోత్సవములు గల దని యర్థము. నామహామ్ = మహోత్సవములు గల దానిని, తామ్ = ఆ యయోధ్యాపురిని, అక్షరరసమ్ = నిత్యానందము, ఆగః + రోధనమ్ = ఆగోరోధనమ్ = పాపనివారకము, 'అగః పాపాపరాధయోః' అని విశ్వము.

సమాన+ఇనమ్=సూర్యసమాన మైనది యగు, 'ఇనః సూర్యే ప్రభౌ' అని యమరము. రామధామ = రాముఁ డను పేరు గల తేజస్సు, 'గృహ దేహ త్విట్ ప్రభా వా ధామాని' యని యమరము. ఆస = పొందెను. 'అస–గతి–దీప్త్యాదానేషు' అను ధాతువునకు లిట్టులో రూపము. రామనామము గల దివ్యతేజ స్సయోధ్యలో నవతరించె నని భావము.

ఇక్కడ – (నక్షత్ర) కాంతి దిగని యయోధ్యలో (రామ) తేజస్సు దిగిన దని చెప్పుటచే విరోధాభాసధ్వని.

## విలోమము – శ్రీకృష్ణుఁడు

**శ్లో॥ యాదవేన స్తు భారాతా సంరరక్ష మహామనాః।**
**తాం స మానధరో గోమా ననేమాసమధామరాః॥** 8

**పదవిభాగము:–** యాదవేనః తు। భారాతా। సంరరక్ష। మహామనాః। తామ్। సః। మానధరః। గోమాన్। అనే మాసమధామరాః

అనేమ + అసమ + ధామ + రాః = అనేమాసమధామరాః, అనేమ = అవధి (మేర) లేని, అసమ = సాటి లేని, ధామ = కాంతి, రాః= సంపదలు గలవాఁడు. నిరవధిక తేజ స్సంపన్నుఁ డని యర్థము.

'నేమః కాలేఽవధౌ గర్తే ప్రాకారే కైతవేఽపి చ' అని విశ్వము.

'నేమః కాలేఽవధౌ ఖండే ప్రాకారే కైతవేఽపి చ' అని మేదిని.

గోమాన్ = ఆవులు గల వాఁడు = గోపాలుఁడు, మాధరః = మానమును ధరించిన వాఁడు, మహామనాః = గొప్ప మనస్సు గల వాఁడు = ఉదారచేతస్కుఁడు, భారాతా, భా = కాంతులను, రాతా = ఇచ్చు వాఁడు, 'రా–దానే' యను ధాతువునకు – 'తృచ్' చేరఁగా 'రాతా' యని యేర్పడును. దాత యని యర్థము. యాదవ+ఇనః = యాదవులకుఁ బ్రభువు, సః + తు = ఆ శ్రీకృష్ణుఁడే. తామ్ = ఆ ద్వారకాపురిని, సంరరక్ష = పరిపాలించెను.

'ఇనః సూర్యే ప్రభౌ' – అని యమరము

'రక్ష – పాలనే' యను ధాతువునకు 'లిట్టు (భూతకాలము) లో 'రరక్ష' యని యేర్పడును. 'సమ్' అను నుపసర్గము చేరఁగా 'సంరరక్ష' యని యగును ॥౮॥

**అవతారిక:–** ఇప్పు డనులోమ శ్లోకముచే విశ్వామిత్రాగమనము, యాగ సంరక్షణము, విలోమ శ్లోకముచే నారదాగమనము చెప్పుచున్నాఁడు.

**అనులోమము – విశ్వామిత్రాగమనము:**

**శ్లో॥ యన్ గాధేయో యోగీ రాగీ వైతానే సౌమ్యే సౌఖ్యేసౌ।**

**తం ఖ్యాతం శీతం స్ఫీతం భీమానామా శ్రీహాతా త్రాతమ్॥౯॥ 9**

**పదవిభాగము:–** యన్। గాధేయః। యోగీ। రాగీ। వైతానే। సౌమ్యే। సౌఖ్యే। అసౌ। తమ్। ఖ్యాతమ్। శీతమ్। స్ఫీతమ్। భీమాన్। ఆమ అశ్రీహాతా త్రాతమ్॥

సౌమ్యే = అందమైన, వైతానే = యజ్ఞ సంబంధమైన, వితానము = యజ్ఞము, వితానమునకు సంబంధించినది వైతానము. 'వితానో యజ్ఞవిస్తారోల్లోచేషు క్రతు కర్మణి' – అని విశ్వము. సౌఖ్యే = సుఖమునందు, రాగీ = కోరిక గలవాఁడు, అతి సుందర యజ్ఞజన్య సుఖేచ్ఛావంతుఁ డని యర్థము. అశ్రీహాతా – శ్రీ = వేదము

'శ్రీ ర్వేదః సా హి శ్రీ రమృతా సతామ్' అని శ్రుతివాక్యము.

అశ్రీ = వేదమునకు విరోధులు– అవైదికులు నగు వారిని; హాతా = త్యజించు వాఁడు, భీమాన్ = భయము గల వాఁడు, రాక్షసులు వచ్చి యజ్ఞమునకు విఘ్నము కలిగింతు రను భయము గల వాఁడు, గాధేయః=గాధి యొక్క కుమారుఁ డైన విశ్వామిత్రుడు, యోగీ = ముని, స్ఫీతమ్ = స్వచ్ఛమైన వానిని (అభివృద్ధి గలవానిని), శీతమ్ = చల్లని వానిని (కోపము లేని వానిని), ఖ్యాతమ్ = కీర్తి మంతుని, తమ్ = ఆ శ్రీరామచంద్రుని, యన్ = ప్రాపించిన వాఁడై. 'ఇణ్–గతౌ' అను ధాతువునకు లట్టులో 'శతృ' ప్రత్యయము చేరఁగా 'యన్' అను రూప మేర్పడును. త్రాతమ్ = త్రాణమును, భావములో 'క్త' ప్రత్యయము. యజ్ఞ సంరక్షణమును, ఆమ = పొందెను. 'అమ – గత్యాదిషు' అను ధాతువునకు లిట్టులో 'ఆమ' యను రూపము వచ్చును.

యజ్ఞము చేయఁ గోరిన విశ్వామిత్రమహర్షి శ్రీరాముని జేరి యజ్ఞరక్షణమును బొందె నని భావము.



**విలోమము – నారదాగమనము :**

**శ్లో॥ తం త్రాతా హా శ్రీమా నామాభీతం స్ఫీతం శీతం ఖ్యాతమ్।**

**సౌఖ్యే సౌమ్యేసౌ నేతా వై గీరాగీ యో యోధే గాయన్॥ 10**

**పదవిభాగము :–** తమ్। త్రాతా। హా। శ్రీమాన్। ఆమ। అభీతమ్। స్ఫీతమ్। శీతమ్। ఖ్యాతమ్। సౌఖ్యే। సౌమ్యే। అసౌ। నేతా। వై। గీరాగీ। యః। యోధే। గాయన్॥

సౌమ్యే = బ్రాహ్మణుని యందు, జాతి యం దేకవచనము. బ్రాహ్మణుల యం దని యర్థము. 'సౌమ్యః పుమాన్ బుధే విప్రే త్రిషు స్యాత్ సోమదైవతే। రమ్యేఽనుగ్రే చ' – అని నానార్థరత్నమాల. నేతా = నాయకుఁడు – బ్రాహ్మణోత్తముఁ డని యర్థము. యోధే = యోధుని యందు, అభీతమ్ = భయము లేని వానిగా; త్రాతా = రక్షించువాఁడు.

'భటా యోధాశ్చ యోద్ధారః' అని యమరము

యోధుని యందుఁ గల భయాభావమును (భయము లేక పోవుటను) ధైర్యాతిశయోత్పాదనముచే సంరక్షించు వాఁ డని భావము.

శ్రీమాన్ = శ్రీమంతుఁడు = శోభావంతుఁడు బ్రహ్మ వర్చస్వియని భావము. గీః + రాగీ = గీరాగీ। గీః = వాక్కుల యొక్క, రాగీ = రాగములు గలవాఁడు. గాంధారాదిస్వరములు సంగీత ప్రసిద్ధములగు రాగములు గల వాఁడు.

'రాగోఽ నురాగే మాత్సర్యే లాక్షాదౌ లోహితాదిషు

గాంధారాదౌ రంజనేచ' – అని నానార్థరత్నమాల

ఈ లక్షణములు గల వాఁడు, యః = ఎవఁడో, అసౌ = ఆ నారాదముని, గాయన్ = గానము చేయుచున్న వాఁడై, శీతమ్ = దయచేఁ జల్లని వానిని, ఖ్యాతమ్ = ప్రసిద్ధుఁ డైన వానిని, సౌఖ్యే = జగములకు సౌఖ్యమును గూర్చుటయందు, స్ఫీతమ్ = అభివృద్ధి గల వానిని, నిత్యజగద్రక్షకుఁ డైన వాని నని భావము. తమ్ = ఆ శ్రీకృష్ణుని, ఆమ = చేరెను. హా = అయ్యో. ఈ నారదుని యాగమనము సత్యభామ కోపమునకు మూలమగు చున్నదని 'హా' శబ్దము ఖేదమును సూచించుచున్నది.

'వై' యనునది పాదపూరణార్థము. 'వై స్యాత్ సంబోధనే పాదపూరణేననుయేకపి చ' – అని విశ్వము. లేక 'వై' శబ్దము ప్రసిద్ధార్థకము. 'వై సంబుద్ధా వనునయే తదారంభ ప్రసిద్ధయోః' – అని రత్నమాల.

సౌమ్యే నేతా వై = బ్రాహ్మణోత్తములలో నారదుఁడు ప్రసిద్ధుఁడు గదా యని భావము. ఇక్కడ– యోధులకు సాహసము గలిగించు వాఁడు, గానము చేయు వాఁడు ననువిశేషణములచే వచ్చిన వాఁడు నారదు ఁడని వ్యజ్యమాన మగుచున్నది. అందువల్లనే పర్యాయోక్త మలంకారము. ఈ పద్యము కూడ 'విద్యున్మాలా' వృత్తము. లక్షణము చెప్పఁబడినది. ॥౧౦॥

**అవతారిక :-** ఇప్పు డనులోమశ్లోకముచే శ్రీసీతారాముల కళ్యాణము, విలోమ శ్లోకముచే రుక్మిణీదేవికిఁ బారిజాతకుసుమప్రాప్తి చెప్పుచున్నాఁడు.

### అనులోమము - శ్రీసీతారాముల కల్యాణము

**శ్లో॥ మారమం సుకుమారాభం రసాజాప నృతాశ్రితమ్।**

**కావిరామదలాపా గో సమావామ తరానతే ॥ ।౬। 11**

**పదవిభాగము:-** మారమమ్। సుకుమారాభమ్। రసాజా। ఆప। నృతాశ్రితమ్। కావిరామదలాపా। గోసమా। అవామతరా। నతే॥

క+అవిరామ+ద+లాపా = కావిరామదలాపా, క = సుఖమును, అవిరామ = అవిచ్ఛేదముగా = విరామము లేకుండ, ద = ఇచ్చు, లాపా = మాటలు గలది. అవిచ్ఛిన్నముగా సౌఖ్యము నిచ్చు మాటలు పలుకునది. 'కం శిరో౽ఽంబు సుఖం క్లీబే' - అని రత్నమాల. 'కం బ్రహ్మ ఖం బ్రహ్మ' అని శ్రుతి. గోసమా = ఓర్పులో భూదేవితో సమాన మైనది, అందు వల్లనే ప్రణతజన విషయములో - అవామతరా = కుటిలత్వ మసలే లేనిది యగు, రసాజా = భూమికిఁ బుట్టిన సీతాదేవి 'రసా విశ్వంభరా స్థిరా' - అనియమరము.

సుకుమారాభమ్. సుకుమార = కోమల మైన, ఆభమ్ = కాంతి గల వానిని, నృతాశ్రితమ్, నృతా = నరత్వమును, ఆశ్రితమ్ = పొందిన వానిని, లీలామానుష విగ్రహుఁ డగు శ్రీరామచంద్రుని, మా + రమమ్ = లక్ష్మీ కాంతుని.

'మః శివే మా రమాయాం స్యాత్' - అని విశ్వము

'రమః కాంతే రమా లక్ష్మ్యామ్' - అని రత్నమాల

ఆప = పొందెను.

దీని వలన శ్రీ సీతారాముల వివాహమహోత్సవము ప్రదర్శింపఁబడినది.

### విలోమము - పారిజాతసుమప్రాప్తి.

**శ్లో॥ తేన రాత మవామాస గోపాలా దమరావికా।**

**తం శ్రితా నృపజా సారభం రామా కుసుమం రమా॥ 12**

**పదవిభాగము :-** తేన। రాతమ్। అవామా। ఆస। గోపాలాత్। అమరావికా। తమ్। శ్రితా। నృపజా। సారభమ్। రామా। కుసుమమ్। రమా॥

రమా = లక్ష్మీదేవి, నృపజా = రాజకుమారియై. 'రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని' అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ (విష్ణు - 1 అంశ - 9 అధ్యా - 144 శ్లో) శ్రీరామావతారములో లక్ష్మీదేవి సీత యైనది. శ్రీకృష్ణావతారములో రుక్మిణి యైన దని విష్ణుపురాణము. తమ్ = ఆ శ్రీకృష్ణుని, శ్రితా = ఆశ్రయించినది = పొందినది. దీని వలన



రుక్మిణీ కల్యాణము సూచింపఁబడినది. అమర + ఆవికా = అమరావికా, అమర = దేవతలకు, ఆవికా = రక్షికయైనది.

'అవ - రక్షణే' అనుధాతువునకు 'ణ్వుల్' ప్రత్యయము. 'యువో రనాకౌ' (7-1-1) అను సూత్రముచే - 'అకా' దేశము. స్త్రీలింగమునందు - 'ప్రత్యయస్థాత్ కాత్ పూర్వ స్యాత ఇదాప్యసుపః' (7-3-44) అను సూత్రముచే - అత్త్వమునకు - ఇత్త్వము. అవామా = కౌటిల్యము లేనిది యగు, రామా = స్త్రీ = రుక్మిణి, తేన = నారదునిచే, రాతమ్ = ఈయఁ బడిన, 'రా - దానే' యను ధాతువునకుఁ గర్తయందు - 'క్త' ప్రత్యయము. సార + భమ్ = ముఖ్య మైన కాంతి గల; కుసుమమ్ = పారిజాత పుష్పమును, గోపాలాత్ = శ్రీకృష్ణుని నుండి, ఆస = పొందెను.

'అస - గతి దీప్త్యాదానేషు' - అను ధాతువునకు లిట్టులో **'ఆస'** యని రూపము.

శ్రీనాదమహర్షిచే నొసఁగఁబడిన పారిజాత కుసుమమును శ్రీకృష్ణుని నుండి రుక్మిణీదేవి గైకొనెను. నారదముని పారిజాత పుష్పమును శ్రీకృష్ణున కీయఁగా శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవి కిచ్చె నని తాత్పర్యము ॥౪॥

**అవతారిక : -** ఇప్పు డనులోమ శ్లోకముచేఁ బరశురామకథను, విలోమశ్లోకముచేఁ బారిజాత సుమమును ధరించిన రుక్మిణి శోభాతిశయమును వర్ణించుచున్నాఁడు -

### అనులోమము - పరశురామ కథ

**శ్లో॥ రామనామా సదా ఖేదభావే దయా వా నతాపీనతేజా రిపా వానతే।**

**కాదిమోదాసహాతా స్వభాసా రసా మే సుగో రేణుకాగాత్రజే భూరుమే॥౭॥ 13**

**పదవిభాగము:-** రామనామా। సదా। ఖేదభావే। దయావాన్। అతాపీ। ఇనతేజాః। రిపౌ। ఆనతే। కాదిమోదాసహాతా। స్వభాసా। రసామే। సుగః। రేణుకాగాత్రజే। భూరుమే॥

క+ఆది+మోద+అస+హాతా = కాదిమోదా సహాతా. క = జలమును, ఆది = త్రాగి జీవించు వారు మునులు. కం జలమ్ అదంతీతి కాదినః - అబ్భక్షకా మునయః, కాది = మునుల యొక్క మోద = హర్షమును, అస = నిరసించు వారు రాక్షసులు. తేషామ్ మునీనాం హర్షమ్ అస్యంతి నిరస్యంతీతి రాక్షసాః. ఆ రాక్షసులను, హాతా = వర్జించువాడు - నిరసించు వాఁడు శ్రీరాముఁడు. ఖేద భావే = ఖిన్నమైన మనస్సు గల వాని యందు, దయావాన్ = కృప గల వాఁడు, ఇన తేజాః = సూర్యుని కాంతి వంటి కాంతి గలవాఁడు. సూర్యప్రకాశుఁ డయినను, సుగః = సుఖముగా (సులభముగా) పొందఁ దగిన వాఁడు, రామనామా = రాముఁ డను పేరు గల భగవంతుఁడు - శ్రీరాముఁడు. 'భూరుమే - రసమే' యనునని సప్తమ్యంతములు, పరశురామునకు విశేషణములు.

భూ + ఉరు + మే = భూరుమే। భూ = భూమిచేత, ఉరు = విపులమైన, మా = లక్ష్మి గల వాఁడు భూరుముఁడు. పృథివీ సంపన్న విపులశ్రీకుఁ డని యర్థము.

రసామే – రసా = భూమిని, మ = చేరు వాఁడు రసాముఁడు, పరశురాముఁడు మహాతపస్వి. అతఁడిరువది యొక్క మాఱులు రాజుల నందఱను వధించి నిఃక్షత్రము గావించిన సర్వభూమికి నధిపతియై సార్వభౌముఁడైన వాఁడు. అతఁడు సర్వసంగ పరిత్యాగము చేసి భూమిని విడిచి పెట్టినను భూమి మరల వానినే చేరినది. ఇరువది యొక్క యశ్వమేధములు చేసి సమస్త భూమిని గశ్యపప్రజాపతికి దానము చేయుటచే భూమి 'కాశ్యపి' యైనది. ఈ విధముగాఁ బరశురాముఁడు భూరుముఁడు = విశాలమైన భూమిచే లక్ష్మీ సంపన్నుడు, రసాముఁడు = భూమిని బొందిన వాఁడునయ్యెను. అట్టి – ఆనతే = వంగి నమస్కరించిన, రిపౌ = శత్రువైన, రేణుకాగాత్రజే = రేణుకాదేవి తనూజుఁడైన పరశురాముని యందు, స్వభాసా = తన తేజస్సుచే, అతాపీ = అతాపనుఁడు = తాపము గలుగఁజేయని వాఁడు. బభూవ = అయ్యె నని శేషము.

పరశురాముని తల్లి 'రేణుక'. తండ్రి 'జమదగ్ని'.

జలభక్షులగు మహర్షుల హర్షమును నిరసించు రాక్షసులను వర్జించినవాఁడు, ఖిన్నమనస్కులగు భక్తుల యందు దయ గల వాఁడు, సూర్యతేజుఁడు, భక్తులకు సులభముగాఁ బొందఁదగిన వాఁడు నగు శ్రీరాముఁడు – భూరుముఁడు, రసాముఁడు శత్రువునగు పరశురాముఁడు వంగి నమస్కరింపఁగా స్వీయతేజస్సుచే వానికిఁ దాపము కలిగింపక కృపతోఁ జూచెనని భావము

## విలోమము – రుక్మిణి శోభ

**శ్లో॥ మేరు భూ జేత్రగా కాణరే గోసుమే సారసా భాస్వతా హా సదామోదికా।**
**తేన వా పారిజాతేన పీతా నవా యాదవే భాదఖేదా సమానామరా॥ 14**

**పదవిభాగము:–** మేరుభూజేత్రగా। కాణరే। గోసుమే। సా। అరసా। భాస్వతా। హా। సదామోదికా। తేన। వా। పారిజాతేన। పీతా। నవా। యాదవే। అభాత్। అఖేదా। సమానామరా॥

మేరు + భూ + జేతృ + అగా. మేరు భూ = మేరుపర్వత ప్రదేశమును, జేతృ = జయించు, అగా = 'రైవతక' మను పర్వతము గలది – ఇవి యన్నియు రుక్మిణీదేవికి విశేషణములు.

మేరుపర్వతముతో సమానమైన రైవతికాద్రి పై రుక్మిణీదేవితో నున్న శ్రీకృష్ణునకు నారదుఁడు పారిజాతసుమము నిచ్చె నని హరివంశపురాణము.

**శ్లో॥ ప్రాప్తదారో మహాతేజా వాసుదేవః ప్రతాపవాన్।**
**రుక్మిణ్యా సహితో దేవ్యా యయౌ రైవతకం నృప॥ ౪**

**శ్లో॥ వసత స్తస్య కృష్ణస్య సదార స్యామితౌజసః।**
**సహాసీనస్య రుక్మిణ్యా నారదోఽభ్యాయయౌ మునిః॥**





**శ్లో॥ సోఽర్చితో వాసుదేవేన ముని రర్చ్యతమః సతామ్।**
**పారిజాతతరోః పుష్పం దదౌ కృష్ణాయ భారత॥ ౧౪**

(హరి – విష్ణు – 65 అధ్యా.)

'కాణరే' 'గోసుమే' యనునవి సప్తమీ విభక్తులు. 'కాణరే' యనునది 'గోసుమే' యను దానికి విశేషణము, క + అణు + రే = కాణరే, క = సుఖము యొక్క ; అణు = లేశమునే 'లవలేశకణాణవః' అని యమరము, ర = ఇచ్చు, 'రా – దానే' యను ధాతువునకు – 'సూ॥ ఆతోనుపసర్గే కః' (3–2–3) అను సూత్రముచే 'ర' అను రూప మేర్పడును. సుఖలేశము నిచ్చునది 'కాణరము'. దీనికి సప్తమి – 'కాణరే'. ఇది గోసుమమునకు విశేషణము.

గోసుమే = భూమి యందుఁ బుట్టిన పూవు నందు, 'గౌ రిలా కుంభినీ క్షమా' – అని యమరము, అరసా = రాగము లేనిది – ఇష్టము లేనిది. పారిజాత పుష్పము వచ్చిన పిమ్మట రుక్మిణీ దేవికి భూకుసుమముపై ననురాగము పోయిన దని భావము. ఈ విధముగా రుక్మిణి సరస – దివ్య – కుసుమ సంతోషవతి యైనది. సమాన + అమరా = పారిజాతకుసుమలాభము వలన దేవతాసమానయైనది. అందువల్లనే, సదామోదికా = ఎల్లప్పుడు సంతోషము (సువాసనలు) గలది. 'ఆమోదో గంధ హర్షయోః' – అని మేదినీ – విశ్వకోశములు. భాస్వతా = ప్రకాశించు, తేన = పారిజాత పుష్పముచే, పీతా = గౌరవర్ణ – పసుపు పచ్చని వన్నె కలది యగు, సా = ఆ రుక్మిణీదేవి, నవా + వా = నూతన మైన కాంత వలె – శోభాతిశయముచే, యాదవే = శ్రీకృష్ణుని యందు, ఈమె రుక్మిణియా? కాదా? యని సందేహమును బొందిన భర్తతో, అభాత్ = ప్రకాశించెను.

ఇక్కడ 'వా' శబ్దము – ఇవార్థకము.

'ఇవవ ద్వా యథా శబ్దౌ' – అని దండి.

హా! = ఆశ్చర్యము. 'హా – శోక – ఖేద – నిందా – సంభ్రమ – విస్మయేషు' అని యవ్యయకోశము. పారిజాతకుసుమమును ధరించుటచేఁ బచ్చని చాయతోఁ గ్రొత్త శోభ నధికముగా నొందిన రుక్మిణీ దేవి శ్రీకృష్ణుని ప్రక్క నుండి మానవ కాంత యయ్యును దేవకాంత వలె విరాజిల్లిన దని భావము.

ఇది స్రగ్విణీ వృత్తము, 'రై శ్చతుర్భి ర్యుతా స్రగ్విణీ సమ్మతా' అని వృత్తరత్నాకర లక్షణము. స్రగ్విణీవృత్తములోఁ బ్రతిపాదమునందు 4 రగణములు వరుసగా వచ్చును. ౬

**అవతారిక :–** ఇప్పు డనులోమ శ్లోకముచే శ్రీరాముఁడు సాకేతము చేరి స్వగృహములలో సీతతో రమించుట, విలోమశ్లోకముచే శ్రీకృష్ణదత్తపారిజాత కుసుమభూషితయగు రుక్మిణి శ్రీ కృష్ణునితో స్వగృహము చేరుట వర్ణించుచున్నాఁడు –

## అనులోమము – శ్రీరాముఁడు సాకేతము చేరుట

**శ్లో॥ సారసాసమధా తాక్షిభూమ్నా ధామసు సీతయా।**

**సాధ్వసా విహా రేమేక్షే మ్యర మాసుర సారహా ॥౧౫॥ 15**

**పదవిభాగము :–** సారసాసమధాతా। అక్షిభూమ్నా। ధామసు। సీతయా। సాధు। అసౌ। ఇహ। రేమే। క్షేమీ। అరమ్। ఆసురసారహా॥

అరమ్ = వేగముగా, ఆసుర = రాక్షససంబంధమైన, సారమ్ = బలమును,హా = హరించువాఁడు. (హంతీతిహా), క్షేమీ = క్షేమము గల వాఁడు, అక్షిభూమ్నా = నేత్ర మహిమచే, సారసాసమధాతా = సారస + అసమ + ధాతా. సారస = పద్మముల యందు, అసమ = అసమానత్వమును – అసాధుత్వమును, ధాతా = పోషించువాఁడు, పద్మాసాధుత్వావహ నేత్ర ప్రభావుఁడని యర్థము అసమశబ్దము భావప్రధానము. 'సమా స్త్రీ వత్సరే సాధు సర్వతుల్యేషు త్రిషు' – అని రత్నమాల. పద్మములను మించిన కన్నులు గలవాఁ డని భావము. అసౌ = శ్రీరాముఁడు, ఇహ = అయోధ్య యందు, ధామసు = గృహములయందు. 'గృహ – దేహ – త్విట్ – ప్రభావా ధామాని' – అని యమరము.

సీతయా = జానకితో, సాధు = బాగుగా – అందముగా. 'సుందరం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్' అని యమరము. రేమే = రమించుచుండెను.

**విలోమము – రుక్మిణీ శ్రీకృష్ణుల స్వగృహాగమనము.**

**శ్లో॥ హారసార సుమా రమ్యక్షేమే రేహ విసాధ్వసా।**

**యాతసీసుమధామ్నా భూక్షితా ధామ ససార సా॥ 16**

**పదవిభాగము:–** హారసారసుమా। రమ్యక్షేమేరా। ఇహ। విసాధ్వసా। యా। అతసీసుమధామ్నా। భూక్షితా। ధామ। ససార। సా।

హార = ముత్యాల పేరు వలె, సార = శ్రేష్ఠమైన, సుమా = పారిజాత కుసుమము గలది. రమ్య + క్షేమ + ఇరా = రమ్యక్షేమేరా – రమ్య = అందమునకు, క్షేమ = కల్యాణమునకు, ఇరా = భూమి = స్థానమైనది. 'ఇరా భూ వాక్ సురాప్సు స్యాత్' – అని యమరము. రమ్యశబ్దము భావార్థకము. రమ్యత్వ మని యర్థము. లేక రమ్యమైన క్షేమ మని విశేషణముగా నన్వయింప వచ్చును.

యా = ఎవ్వతె, ఇహ = ఈ లోకములో, విసాధ్వసా = భయము లేనిదో, సవతులగు సత్యభామాదులకుఁ గూడ భయపడని దని భావము. సా = ఆ రుక్మిణి, అతసీ సుమధామ్నా = అవిసె పూవు వంటి నల్లని కాంతి గల, ఇది శ్రీకృష్ణునకు విశేషణము. భూక్షితా = పృథివికి రాజైన శ్రీకృష్ణునితో, ధామ = తన గృహమునకు, ససార = వెళ్ళెను. 'సృ – గతౌ' అను ధాతువునకు లిట్టులో రూపము. 'ధామ జన్మ ప్రభాస్థాన ప్రభావసుఖపద్మసు' అని రత్నమాల.



**అవతారిక :–** ఇప్పు డనులోమశ్లోకముచేఁ గోపించిన కైకేయి తన పుత్రుడుఁడగు భరతుని కొఱకు దశరథుని నుండి భూమిని(రాజ్యమును) గ్రహించుట, విలోమశ్లోకముచే శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవికి ఁబారిజాతపుష్పము నిచ్చుటచే సత్యభామ కోపించుట వర్ణించు చున్నాఁడు –

**అనులోమము – కైకేయి రాజ్యప్రాప్తి.**

**శ్లో॥ సాగసా భరతా యేభమాభాతా మన్యుమత్తయా।**

**సాత్ర మధ్యమయా తాపే పోతాయాధిగతా రసా॥ ౧౭॥ 17**

**పదవిభాగము:–** సాగసా। భరతాయ। ఇభమాభాతా। మన్యుమత్తయా। సా। అత్ర। మధ్యమయా। తాపే। పోతాయ। అధిగతా। రసా ॥

అత్ర = అయోధ్యయందు, ఇభ + మా + భాతా – ఇభమా = గజలక్ష్మిచే, 'ఇందిరా లోకమాతా మా' – అని యమరకోశాధికపాఠము. భాతా = శోభితయగు, సా = ఆ, రసా = భూమి, 'రసా విశ్వంభరా స్థిరా' – అని యమరము. మన్యు = కోపముచే, మత్తయా = మదించిన, ఇది కైకేయికి విశేషణము

తాపే = తన పుత్రుఁ డగు భరతునకు రాజ్యలాభము కలుగ లే దను సంతాపము నొందిన, సాగసా = స + ఆగసా = శ్రీరామునకు రాజ్య విఘ్నము కలిగించుట యను పాపముతోఁ గూడిన, 'ఆగః పాపారాధయోః' – అని విశ్వము.

మధ్యమయా = దశరథుని మధ్యమ భార్యయగు కైకేయిచే, పోతాయ = తన పుత్రుఁ డగు భరతునికొఱకు, 'పోతః పాకోఽర్భకో డింభః పృథుకః శాబకః శిశుః – అని యమరము అధిగతా = పొందఁ బడినది. దీనికి 'రసా' తో నన్వయము. దశరథుని నుండి కైకేయి రాజ్యమును భరతుని కోసము పొందిన దని భావము.

**ప్రతిలోమము – సత్యభామ కోపము**

**శ్లో॥ సారతాగధియా తాపోపేతా యా మధ్యమత్రసా।**

**యాత్తమన్యుమతా భామా భయేతా రభసాగసా॥ 18**

**పదవిభాగము:–** సారతాగధియా। తాపోపేతా। యా। మధ్యమత్రసా। యా। ఆత్తమన్యుమతా। భామా। భయేతా। రభసాగసా॥

యా = ఎవ్వతె, మధ్యమత్రసా = నడు మను త్రసరేణువు గలదియో, త్రసరేణువు వంటి సూక్ష్మమైన (సన్నని) నడుము గల దని భావము. ఇది సత్యభామకు విశేషణము.

**శ్లో॥ జాలసూర్యమరీచిస్థం సూక్ష్మం యద్దృశ్యతే రజః**

**తస్య షష్ఠతమో భాగస్త్రసరేణు రితీర్యతే॥**

కిటికీ నుండి వచ్చు సూర్యుని కాంతిలోఁ గన్పట్టు రజములో నాఱవ భాగము త్రసరేణువు. త్రసరేణువు = ముప్పది పరమాణువుల కొలఁది' – అని శబ్దరత్నాకరము. "వైద్య పరిభాషయందు' ముప్పది పరమాణువుల ప్రమాణము కలది 'త్రసరేణువు' అని కలదనియు; బ్రహ్మవైవర్తమున – పరమాణుద్వయము – అణువు. అట్టి యణువులు మూఁడు కలిసినది 'త్రసరేణువు' అని కలదనియు, మనుస్మృతి యందు జాలాంతరగతమైన యెండ యందు సూక్ష్మముగాఁ గనఁబడు రేణువు 'త్రసరేణు' వని కల దనియు, అదియే ప్రమాణములలోఁ బ్రథమ మనియు శబ్దకల్పద్రుమమున నున్నది. 'ఆఱు పరమాణువుల కొలఁది'యని సూర్యరాయనిఘంటువు' అని శ్రీ వెంపరాలవారి మనుచరిత్రవ్యాఖ్య (మను 3-87).

యా = ఎవ్వతె, సారతా + గ + ధియా, సారతా = శ్రేష్ఠత్వమును, గ = పొందిన, ధియా = బుద్ధితోఁ గూడినదియో, సా = ఆ, భామా = సత్యభామ. నామైకదేశముచే నామగ్రహణము. భీమసేనుఁడు భీముఁ డైనట్లే సత్యభామ – భామ యగును.

"అథవా పూర్వపదలోపోఽత్ర ద్రష్టవ్యః। అత్యంతసిద్ధః సిద్ధ ఇతి. తద్యథా – 'దేవదత్తః – దత్తః, సత్యభామా – భామా" ఇతి – అని పతంజలి మహాభాష్య పస్పశాహ్నికము. "కామాదీతి – సత్యకామాదీత్యర్థః యథా। దేవదత్తో దత్తః సత్యభామా భామేతి" అని బ్రహ్మసూత్ర శంకరభాష్యము (3-3-39). తర్కభాషాప్రకాశికలోఁ జిన్నంభట్టు కూడ నిట్లే చెప్పినాఁడు – 'భీమో భీమసేన ఇత్యాదివన్నామైకదేశేన నామగ్రహణమ్'। సత్యాశబ్దము కూడ నిట్లే గ్రహింపవలెను.

రభస + ఆగసా = రభసాగసా, రభస = వేగముగా, ఆగసా = అపరాధముచే, 'పాపాపరాధయో రాగః' – అని యమరము

అనాలోచితముగా సత్వరముగా శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవికిఁ బారిజాతపుష్పము నిచ్చిన యపరాధముచే, ఆత్తమన్యుమతా = పొందిన కోపము గలది, భయ + ఇతా = భయేతా = భయమును బొందినది. తాపోపేతా – తాప = సంతాపమును, ఉపేతా = పొందినది. అభూత్ = అయ్యె నని శేషము. త్రసరేణువువలె సన్నని నడుము గల యా సత్యభామ శ్రేష్ఠమైన బుద్ధితోఁ గూడినదై శ్రీకృష్ణుఁడు ముందుగా రుక్మిణీదేవికిఁ బారిజాతకుసుమము నిచ్చుటచే నామెకే వశుఁ డయ్యె నను భయముతో మిక్కిలి సంతాపమును జెందిన దని భావము. ౯

**అవతారిక :–** ఇప్పు డనులోమ శ్లోకముచేఁ గైకేయి రామపట్టాభిషేకమును జెడఁగొట్టి యడవులకుఁ బంపుట, ప్రతిలోమ శ్లోకముచే సత్యభామ కోపాతిశయమును బొందుట వర్ణించుచున్నాఁడు –

**అనులోమము – రామపట్టాభిషేక విఘటనము – కాననప్రాప్తి**

**శ్లో॥ తానవా దపకోమాభా రామే కాననదాస సా।**
**యా లతావృద్ధసేవాకా కైకేయీ మహదా హహ॥౧౦॥** 19





**పదవిభాగము:–** తానవాత్। అపకా। ఉమాభా। రామే। కాననదా। ఆస। సా। యా। లతా। అవృద్ధ। సేవాకా। కైకేయీ। మహదా। హహ॥

ఉమాభా = పసుపు వంటి పచ్చని కాంతి గలది. ఇది కైకేయికి విశేషణము. 'ఉమా స్యా దతసీ గౌరీ హరిద్రా కాంతి కీర్తిషు' – అని రత్నమాల. అపకా = అపగతసుఖ – సుఖము లేనిది. 'సుఖశీర్షజలేషు కమ్' అని మేదిని, తానవాత్ = కృశత్వముచే, లతా = తీఁగ వంటిది యగు. సవతి యగు కౌసల్య యొక్క కుమారునకుఁ బట్టాభిషేకము జరుగు నను వార్త విని సన్నని తీఁగె వలెఁ జిక్కి పోయిన దని భావము. యా = ఏ, కైకేయీ = కైక, అవృద్ధ సేవాకా = ముసలి వాఁ డగు దశరథునకు సేవ చేయనిదై, లేక హితము నుపదేశించు వసిష్ఠుఁడు మొదలగు వృద్ధుల మాటలు విననిదై, సా = ఆమె (కైక), మహ = అభిషేకోత్సవమును, దా = ఖండించినదై, శ్రీరామపట్టాభిషేకము నంగీకరింపనిదై, 'మహ ఉద్ధవ ఉత్సవః' – అని యమరము. మహం ద్యతీతి మహదా 'దో – అవఖండనే' – దివాది ధాతువు. రామే = శ్రీరామునకు, కాననదా = అడవుల నిచ్చినదై, కాననం దదాతీతి కాననదా 'డుదాఞ్–దానే' – జుహోత్యాది ధాతువు. ఆస = అయ్యెను, హహ = అయ్యో! ఇది ఖేదార్థకము.

'ఆస' యనునది తిఙంత ప్రతిరూపకమగు నవ్యయము. అందువల్లనే 'అస్తేర్భూః' (2-4-52) అను సూత్రముచే 'భూ' ఆదేశము రాలేదని శంకింపఁగూడదు. అందువల్లనే – 'లావణ్య ఉత్పాద్య ఇవాస యత్నః' (కుమార 1-35) అని కాళిదాసు ప్రయోగించినాఁడు.

ఇక్కడ – "ఆసేతి బభూవార్థే తిఙంత ప్రతిరూపక మవ్యయ మిత్యాహ శాకటాయనః। వల్లభస్తు – న తిఙంతప్రతిరూపక మవ్యయమ్. 'అస్తేర్భూః' ఇతి భ్వాదేశనియమాత్ తాదృక్ తిఙంతస్యైవాభావాత్। కింతు కవీనామ యమ్ ప్రామాదికః ప్రయోగ ఇత్యాహ। వామనస్తు – 'అస – గతిదీప్త్యాదానేషు' ఇతి ధాతో ర్లిటి రూప మిదమ్ – ఇత్యాహ॥" అని మల్లినాథ మహోపాధ్యాయుని సంజీవని.

**విలోమము – సత్యభామ కోపాతిశయము**

**శ్లో॥ హహ దాహమయీ కేకైకావాసేద్ధవృతాలయా।**
**సా సదానన కామేరా భామా కోపదవానతా॥** 20

**పదవిభాగము:–** హహ దాహమయీ। కేకైకా। వాసేద్ధవృతాలయా। సా। సదాననకా। ఆమేరా। భామా। కోపదవానతా॥

దాహమయీ = దాహముతో నిండినది – మిక్కిలి సంతాపము గలది, కేకా + ఏక + ఆవాస + ఇద్ధ + వృత + ఆలయా = కేకైకావాసేద్ధ వృతాలయా, కేకా = నెమిలి కూఁతలకు, ఏకావాస = ముఖ్యస్థానమై, ఇద్ధ = ప్రకాశించు, వృత = మూయఁబడిన, ఆలయా = గృహము గలది. మయూరాదిధ్వనులచే మనోహరమైన మందిరమును శ్రీకృష్ణుఁడు రాకుండ మూసి వేసిన దని భావము.

'కేకా వాణీ మయూరస్య' – అని యమరము. 'షడ్జసంవాదినీః కేకా ద్విధా భిన్నాః శిఖండిభిః (రఘు 1–39) అని కాళిదాసు రఘువంశము.

సత్ + ఆననకా = సదాననకా, సత్ = సుందర మైన, ఆననకా = ముఖము గలది. స్వార్థమునందు – క ప్రత్యయము, 'సత్యే సాధౌ విద్యమానే ప్రశస్తే ఽభ్యర్హితే చ సత్', 'ఆననం లపనమ్ ముఖమ్' – అని యుభయత్ర యమరము. కోపదవానతా. కోప = కోప మనెడి, దవ = దావాగ్నిచే, 'దవదావౌ వనారణ్య వహ్న్యోః' – అని వైజయంతి. ఆనతా = వంగినది. మిక్కిలి కోపాగ్నిచే రగుల్కొన్న దని భావము. సా = ఆ, భామా = సత్యభామ, ఆమేరా, ఆమ = రోగమునకు, ఇరా = స్థానము, బభూవ = అయ్యె నని శేషము. హహ = అయ్యో!. 'ఆమే రోగే రోగభేదే' – అని రత్నమాల. ఇక్కడ రోగవాచి యగు నామ శబ్దముచేఁ దత్కార్య భూత మగు సత్యభామయొక్క ఖేదము వ్యక్త మగుచున్నది.

**అవతారిక :–** ఇప్పు డనులోమ శ్లోకముచే శ్రీరాముఁడు పితృభక్తితో నడవుల కేఁగుట, విలోమశ్లోకముచే శ్రీకృష్ణుఁడు సత్యభామా సాంత్వనమునకై యామె మందిరమును జేరుట వర్ణించుచున్నాఁడు –

### అనులోమము – శ్రీరాముని వనగమనము

**శ్లో॥ వరమానదసత్యాసహ్రీతపిత్రాదరా దహో।**
**భాస్వర స్థిరధీరోపహారోరా వనగా మ్యసౌ॥ ౧౧॥** 21

**పదవిభాగము:–** వర – మానద – సత్యాస – హ్రీత – పిత్రాదరాత్ అహో భాస్వరః స్థిరధీరః అపహారోరాః వనగామీ అసౌ।

భాస్వరః = ప్రకాశించువాఁడు, స్థిరధీరః = నిశ్చల మైన ధైర్యము గల వాఁడు నగు, అసౌ = ఆ శ్రీరామచంద్రుఁడు, వర = శ్రేష్ఠులగు వారికి, మానద = పూజాప్రదుఁడు – పూజ లిచ్చువాఁడు, సత్య + అస = సత్యమును నిరసించుట యందు, హ్రీత = సిగ్గు పడువాఁడు నగు, ఇవి రెండును దశరథునకు విశేషణములు. దశరథుఁడు శ్రేష్ఠులగు వారిని సేవించువాఁ డనియు సత్యము తప్పని వాఁ డనియు భావము. పితృ = తండ్రి యగు దశరథుని యందు, ఆదరాత్ = భక్తితో, అప + హార + ఉరాః , అప = అపగతములైన, హార = ముత్యాలహారములు గల, ఉరాః = వక్షః స్థలము గలవాఁడు. ఇది తక్కిన యాభరణముల కుపలక్షణము. శరీరముపై నున్న సకలాభరణములను దీసివేసిన వాఁ డని భావము. అట్టి రాముఁడు – వనగామీ = అడవులకు వెళ్ళిన వాఁడు, బభూవ = అయ్యె నని శేషము. అహో! = ఆశ్చర్యము.

### విలోమము – శ్రీకృష్ణుని సత్యభామా మందిరాగమనము

**శ్లో॥ సౌమ్యగానవరారోహాపరో ధీర స్థిర స్వభాః।**
**హో దరా దత్రాపితహ్రీ సత్యాసదన మార వ॥** 22



**పదవిభాగము:–** సౌమ్యగానవరారోహాపరః। ధీరః। స్థిరస్వభాః। హో। దరాత్। అత్ర। ఆపితహ్రీ సత్యాసదనమ్। ఆర। వ॥

అత్ర = ద్వారకా పట్టణమందు, సౌమ్య = అంద మైన = మధుర మైన, గాన = పాటలు పాడు, వరారోహా = కాంతలయందు, (వర = శ్రేష్ఠమైన, ఆరోహా = జఘనము గలది – స్త్రీ). పరః=తత్పరుఁడై, ధీరః = ధైర్యవంతుఁడు, స్థిర స్వభాః = శాశ్వత మైన స్వీయకాంతి గలవాఁడు నగు శ్రీకృష్ణుఁడు, ఆపితహ్రీ = సిగ్గునొందిన, సపత్నికిఁ బారిజాత కుసుమమునిచ్చుటచే సిగ్గు చెందిన – యని సత్యభామకు విశేషణము. సత్యా = సత్యభామయొక్క, నామైకదేశముచే నామగ్రహణము. సదనమ్ = గృహమును, దరాత్ = భయముతో, వ = వలె (భయము పొందిన వాని వలె) ఆర = చేరెను.

'దరోఽస్త్రియామ్ భయే' – అని యమరము

'ఋ – గతౌ' – అను ధాతువునకు లిట్ – ప్రథమ పురుషైక వచనములో 'ఆర' యని రూపము. హో = ఇది శిష్యులకు లేక పాఠకులకు సంబోధనము. 'భో హో చైవం విధౌ జ్ఞేయౌ సంబుద్ధ్యాహ్వాన యో రపి' – అని విశ్వము. లేక – 'హః + దరాత్' అని కూడ విభాగము చేయవచ్చును. హః = శ్రీకృష్ణుఁడు అని యర్థము.

'హః శంకరే హరౌ సంహరణ రోమాంచ వాజిషు' – అని రత్నమాల. వ = వశబ్దము – ఇవార్థకము. 'వం ప్రచేతసి జానీయా దివార్థే చ తదవ్యయమ్' – అని మేదిని. 'శాత్రవం వ పపుర్యశః' 'కాదంబ ఖండితదళాని వ పంకజాని' (ప్రౌఢమనోరమ – ఈదూదేత్ద్విగృహ్య సూత్రము) మొదలగు కాళిదాసాదిమహాకవుల ప్రయోగములు గలవు.

"మణీవోష్ట్రస్య' – ఇతి త్వివార్థే వశబ్దో వాశబ్దో వా బోధ్యః' – అని సిద్ధాంతకౌముది. 'మణీ వోష్ట్రస్యలంబేతే' మొదలగు వానిలో వ శబ్ద మివార్థక మని శాబ్దికు లంగీకరించుచున్నారు.

**అవతారిక :–** ఇప్పు డనులోమ శ్లోకముచే సీతాదేవి శ్రీరామచంద్రునితో నడవుల కేఁగుట, విలోమశ్లోకముచేఁ గుపితయగు సత్యభామను బతిమాలుటకై శ్రీకృష్ణుఁడు వెళ్ళుట వర్ణించుచున్నాడు –

### అనులోమము – సీతారాముల వనగమనము

**శ్లో॥ యా నయానఘధీతాదా రసాయా స్తనయా దవే।**
**సా గతా హి వియాతా హ్రీసతాపా న కి లోనభా॥ ॥౧౨॥** 23

**పదవిభాగము:–** యా। నయానఘధీతాదా। రసాయాః। తనయా। దవే। సా। గతా। హి। వియాతా హ్రీసతాపా। న। కిల। ఊనభా॥

నయానఘధీతాదా = నయ + అనఘ + ధీ + తా + దా. నయ = శాస్త్రముచే, న + అఘ = అనఘ = పాపములేని, ధీతా = బుద్ధిత్వమును – ఇది 'తల్' ప్రత్యయము, దా =

ఇచ్చునది. త న్నాశ్రయించిన వారికి శాస్త్రనిర్దోష బుద్ధిత్వమును బ్రసాదించున దగు - ఇది సీతకు విశేషణము. రసాయాః = భూమి యొక్క తనయా = కుమారి = సీత, హ్రీ = సిగ్గుచే, సతాపా = తాపముతోఁగూడినది. భర్తకు రాజ్య విఘ్నము గల్గుటచే సిగ్గుతో విషాదము నొందిన దని భావము. సా = సీత, వియాతా = దిట్టతనము గల్గినదై, దవే గతా హి = వనమున కేఁగినది గదా! 'వనవన్యానలౌ దావదవౌ వైశ్వానరే హయే' - అని రత్నమాల. అట్లయ్యును, ఊనభా = కాంతి తగ్గినది, న కిల = కాలేదు గదా!

'స్యుః ప్రభారుగ్రుచిస్త్విడ్భాః' - అని యమరము. సీత వనముల కేఁగినను శ్రీరామునితోఁ గూడి యుండుటచేఁ గాంతిని గోలుపో లే దని భావము

## విలోమము - శ్రీకృష్ణుని సత్యభామాగృహప్రాప్తి

**శ్లో॥ భా నలోకి న పాతా స హ్రీతా యా విహితాగసా।**

**వేదయాన స్తయా సారదాతా ధీఘన యానయా ॥ 24**

**పదవిభాగము:-** భాన్। అలోకి। న। పాతా। సః। హ్రీతా। యా। విహితాగసా। వేదయానః। తయా। సారదాతా। ధీఘనయా। అనయా॥

యా = ఏ సత్యభామ, విహిత + ఆగసా = చేయఁబడిన యపరాధముచే, సపత్నికిఁ బారిజాతపుష్పము నిచ్చుట యను నపరాధముచే, హ్రీతా = సిగ్గు చెందిన దయ్యెనో, ధీఘనయా = బుద్ధిచే గొప్ప దగు, అనయా = ఆ సత్యభామచే, సారదాతా = శ్రేష్ఠ పదార్థముల నిచ్చువాఁడు, భాన్ = ప్రకాశించువాఁడు. 'భా-దీప్తౌ' - అను ధాతువునకు 'శతృ ప్రత్యయము చేరఁగా భాన్ అను రూప మేర్పడును. పాతా = రక్షకుఁడు, వేదయానః =వేదస్వరూపుఁ డగు గరుత్మంతుఁడు వాహనముగాఁ గలవాఁడు నగు శ్రీకృష్ణుఁడు. న+అలోకి = చూడఁబడ లేదు.

'సుపర్ణోఽసి గరుత్మాన్' మొదలగు శ్రుతులు

**శ్లో॥ 'ఛందోమయేన గరుడేన సముహ్యమాన**

**శ్చక్రాయుధోఽభ్యగమదాశు యతో గజేంద్రః'।**

అను భాగవతపురాణము

'వేదాత్మా విహగేశ్వరః' మొదలగు నభియుక్తోక్తులు (శ్రీమద్యామునాచార్యుల చతుః శ్లోకీశ్రీస్తుతి). గరుత్మంతుఁడు ఛందోమయుఁ డని చెప్పుచున్నవి. 'లోకృ-దర్శనే' అను ధాతువునకుఁ గర్మమునందు 'లుఙ్'లో - 'అలోకి' యను రూప మేర్పడును. సత్యభామ శ్రీకృష్ణునిఁ గన్నెత్తి చూడ లే దని భావము. ౧౨

**అవతారిక:-** ఇప్పు డనులోమశ్లోకముచే శ్రీరాముఁ డరణ్యవాసములో భరద్వాజుని దక్కిన మునులను జూచుట, ప్రతిలోమ శ్లోకముచేఁ గోపించిన సత్యభామ శ్రీకృష్ణునితో మాట్లడక



మౌనము వహించుట, శ్రీకృష్ణుఁడు పారిజాతవృక్షమును దెచ్చెద నని చెప్పిన పిమ్మట ప్రసన్నయై సంభాషించుట వర్ణించుచున్నాఁడు -

## అనులోమము - శ్రీరాముఁడు భరద్వాజాదులను జేరుట

**శ్లో॥ రాగిరాధుతి గర్వాదార దాహో మహసా హహ**

**యా నగాత భరద్వాజ మాయాసీ దమగాహినః॥ ౧౩॥ 25**

**పదవిభాగము:-** రాగిరాధుతిగర్వాదారదాహః। మహసా। హహ। యాన్। అగాత। భరద్వాజమ్। ఆయాసీ। దమగాహినః॥

మహసా = తేజస్సుచే,రాగి + ర + ఆధుతి + గర్వ + అద + ఆర + దాహః = రాగిరాధుతిగర్వాదారదాహః. రాగి = మాత్సర్యముగల, 'రా గో ఽనురక్తౌ మాత్సర్యే' - అని విశ్వము, ర = తీక్ష్ణమైన, 'రః పావకే చ తీక్ష్ణే చ' - అని విశ్వము, ఆధుతి = ఖండనము నందు, గర్వ = గర్వముచే, అద = క్షాంతిరహిత మైన, 'దా స్త్రియాం క్షాంతిదానయోః' - అని రత్నమాల, ఆర = శత్రుసమూహమును, అరీణాం సమూహః ఆరమ్ - సమూహార్థమునం దణ్ ప్రత్యయము, దాహః = దహించువాఁడు, దహతీతి దాహః - కర్మమునం దణ్ ప్రత్యయము, మాత్సర్యముచే దుష్టులు, తీక్ష్ణముగా ఖండించుటయందు గర్వముతోఁ గూడి క్షమ లేని వారు నగు శత్రువుల సమూహమును భంజించు వాఁడు, యాన్ = గమించుచున్నవాఁడు, ఆయాసీ = ఆయాసము గల వాఁడు, శత్రువులను దహించుటచే నాయాసపడిన వాఁడు నగు శ్రీరాముఁడు. భరద్వాజమ్ = భరద్వాజమహర్షిని, దమగాహినః = దాంతియుక్తు లగు మునులను, అగాత = ఉపాసించెను. 'గాఙ్ - గతౌ' అను ధాతువునకు లఙ్లోఁ బ్రథమైక వచనము నందు 'అగాత' యను రూప మేర్పడును. హహ = అనునది ఖేదార్థకము. ఇక్కడ భరద్వాజుని, తక్కిన మునులను 'గూడ' నను సముచ్చయమును ద్యోతకము చేయుటకై 'దమగాహినశ్చ' యని 'చ' కార ముండ వలయును. కాని -

**శ్లో॥ 'శ్రీమద్విట్ఠల మానమ్య పాణిన్యాది మునీన్ గురూన్'**

అను ప్రక్రియా కౌముదీ మంగళశ్లోకములో - చకారాపేక్ష లేనట్లే యిక్కడఁ గూడఁ జకార ముపేక్షింపఁ బడిన దని గ్రహింపవలెను. లేక - ప్రక్రియా ప్రసాదవ్యాఖ్యలో శ్రీవిట్ఠలాచార్యులు మఱియొక విధముగా సమన్వయము చేసినారు - "నను శ్రీమద్విట్ఠలమ్ పాణిన్యాదీన్ మునీన్ గురూన్ ఇత్యేషామ్ ప్రత్యేక మానమ్యే త్యేకయా క్రియయా సంబంధాత్ సముచ్చయోఽస్తి. తతశ్చ తద్ద్యోతకే నావ్యయపదేన (చకారేణ) భావ్యమ్. ఉచ్యతే - గురుదైవతైక్యప్రతిపత్త్యర్థం తన్న ప్రయుక్తమ్"

ప్రక్రియాకౌముదీ మంగళ శ్లోకములో గురు - దైవతైక్య ప్రతిపత్తికై చకారసముచ్చయ మెట్లు లేదో యట్లే యిక్కడ కూడ భరద్వాజమహర్షికిఁ దక్కిన మునులకు నైక్యప్రతిపత్తికై చకారము ప్రయోగింపఁబడ లే దని గ్రహింపవలెను.

## విలోమము - సత్యభామ ప్రసన్న భాషణము

**శ్లో॥ నో హి గా మదసీయా మాజద్వారభత గా న యా।**

**హహా సా హ మహోదార దార్వాగతిధురా గిరా ॥ 26**

**పదవిభాగము:-** నో। హి। గామ్। అదసీయామ్। ఆజత్। వా। ఆరభత। గాః। న। యా। హహా। సా। ఆహ। మహోదార। దార్వాగతిధురా। గిరా।

యా = ఏ సత్యభామ, గాః = మాటలను, న + ఆరభత = ఆరంభింప లేదో, కోపముతో శ్రీకృష్ణునితో సంభాషణ మున కుపక్రమింప లేదో, అదసీయామ్ = శ్రీకృష్ణ సంబంధమగు, గామ్ = వాదమును, నో + అజత్ + వా = మఱియుఁ దెలియ లేదో, 'అజ-గతి క్షేపణయోః' - అజతి ధాతువు గత్యర్థక మగుటచే జ్ఞానార్థకము గావున లఙ్లో 'ఆజత్' అనురూప మేర్పడును. 'హి' శబ్దము ప్రసిద్ధార్థకము. సత్యభామ శ్రీకృష్ణవాక్యము నించుక కూడ విన లే దని యర్థము. సా = అట్టి సత్యభామ, మహా + ఉదార + దారు = మిక్కిలి యుదారమైన వృక్షము. కోరిన వస్తువుల నిచ్చుటలో మిక్కిలి యౌదార్యము గల పారిజాత తరువు యొక్క; ఆగతిధురా = ఆగమనభారముగల, గిరా = వాక్కు చేత, 'పారిజాతవృక్షమును దెచ్చి నీ పెరటి చెట్టుగా నాటింతును. ఆ భారము నాది" యను శ్రీకృష్ణుని మాటచేత, ఆహ = సంభాషణము చేసినది. హహా = ఆశ్చర్యము.

ఇంతకు ముందు కోపముతో శ్రీకృష్ణుని బలకరింపని సత్యభామ - 'పారిజాత వృక్షమును దెత్తును. తదాగమన భారమును నేనే వహింతు' నను శ్రీకృష్ణవాక్యముచేఁ బ్రసన్నయై మఱల శ్రీకృష్ణునితో సంభాషించిన దని భావము. ౧౩

**అవతారిక:-** ఇప్పు డనులోమ శ్లోకముచే శ్రీరాముని చిత్రకూట ప్రాప్తిని, విలోమ శ్లోకముచేఁ బారిజాతమును దెచ్చుటకై శ్రీకృష్ణుని స్వర్గగమనమును వర్ణించుచున్నాఁడు. -

## అనులోమము - శ్రీరాముని చిత్రకూటప్రాప్తి.

**శ్లో॥ యాతురాజి దభాభారం ద్యాం వ మారుతగంధగమ్।**

**సోగమార పదం యక్షతుంగాభోనఘ యాత్రయా॥ ౧౪॥ 27**

**పదవిభాగము:-** యాతురాజి। దభాభారమ్। ద్యామ్। వ। మారుతగంధగమ్। సః। అగమ్। ఆర। పదమ్। యక్షతుంగాభః। అనఘ। యాత్రయా॥

యక్ష = కుబేరుని వలె, తుంగ + ఆభః = (ఎత్తైన) ప్రౌఢ మైన దీప్తి గల, సః = రామచంద్రుఁడు, యాతు + రాజి + ద + భా + భారమ్, యాతు = రాక్షసులయొక్క 'యాతుధానః పుణ్యజనో నైరృతో యాతురక్షసీ' - అని యమరము, రాజి = పంక్తిని - సమూహమును, 'వీథ్యాలి రావలిః పంక్తిః శ్రేణీ లేఖాస్తు రాజయః' - అని యమరము, ద = ఖండించు, 'దో - అవఖండనే' అని ధాతువు, భా = కాంతి యొక్క, భారమ్ = బరువు గల





దానిని, ఇది చిత్రకూటమునకు విశేషణము. రాక్షసులు మొదలగు విరోధులను దూరముగాఁ ద్రోలఁ గల గొప్ప తేజస్సు గలది చిత్రకూట మని భావము. మారుతగంధగమ్ = మారుతలేశము గల దానిని. మంద మారుతము గల దాని నని యర్థము.

'గంధో గంధక సంబంధామోద లేశ స్మయేషు చ' - అని రత్నమాల

అగమ్ = చిత్రకూట పర్వతముయొక్క, పదమ్ = స్థానమును, ద్యాం వ = స్వర్గము వలె. ఇక్కడ 'వ' శబ్ద మివార్థకము. అనఘ యాత్రయా = నిర్దోషగతిచేత, ఆర = గమించెను పొందెను.

ఈ శ్లోకములో (1) యక్షతుంగాభ (2) ద్యాంవ-అను విశేషణములచే -

**శ్లో॥ సుభగ శ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమో గిరిః।**

**యస్మిన్ వసతి కాకుత్థ్సః కుబేర ఇవ నందనే॥**

(వాల్మీకి - అయోధ్యా - 98 అధ్యా 12శ్లో॥)

"ఈ చిత్రకూటము సుందర మైనది. హిమవత్పర్వతమును బోలిన పర్వతము. కుబేరుఁ డు నందనవనములో వలె దీనిపై శ్రీరాముఁడు నివసించుచున్నాఁడు" - అను శ్రీమద్రామాయణ శ్లోకార్థము సూచింపఁబడినది.

## విలోమము - శ్రీకృష్ణుని స్వర్గగమనము

**శ్లో॥ యాత్రయా ఘనభో గాతుం క్షయదం పరమాగసః।**

**గంధగం తరు మావ ద్యాం రంభాభాదజిరా తు యా ॥ 28**

**పదవిభాగము:-** యాత్రయా। ఘనభః। గాతుమ్। క్షయదమ్। పరమాగసః। గంధగమ్। తరుమ్। ఆవ। ద్యామ్। రంభాభాదజిరా। తు। యా॥

ఘనభః = మేఘము వంటి నల్లని కాంతి గల శ్రీకృష్ణుఁడు, 'ఘన జీమూత ముదిర జలము గ్ధూమయోనయః'- అని యమరము, పరమ + ఆగసః = గొప్ప యపరాధమునకు, సత్యభామకుఁ బారిజాత కుసుమము నీయని నేరమునకు, క్షయ-దమ్ = శాంతి ప్రదమైన (తన నేరము తగ్గు నట్లు చేయు) 'నిలయాపచయౌ క్షయౌ' - అని యమరము.

(అపచయమనఁగా హ్రాసము - తగ్గుదల) గంధగమ్ = దివ్యమైన సువాసనను బొందిన, తరుమ్ = పారిజాతపుఁ జెట్టును గూర్చి, గాతుమ్ = వెళ్ళుటకు, 'గాఙ్ - గతౌ' - అను ధాతువునకు 'గాతుమ్' అనునది తుమున్నంత రూపము, ద్యామ్ = స్వర్గమునుగూర్చి - స్వర్గమున కని యర్థము, యాత్రయా = ప్రస్థానముతో, ఆవ = వెళ్ళెను.

'అవ - గతి - రక్షణ - కాంత్యాదిషు' - అను ధాతువునకు లిట్టులో 'ఆవ' యను రూపము. 'యాత్రయా' అను వచనముచే దేశాంతరమునకు వలె లోకాంతరమునకుఁ గూడ శ్రీకృష్ణుఁడు సశరీరుఁడై వెళ్లె నని ద్యోతక మగుచున్నది.

యా = ఏది, రంభా + భాత్ + అజిరా = రంభాభాదజిరా. రంభా = రంభ యను నప్సరసచే, భాత్ = ప్రకాశించుచున్న, అజిరా =ముంగిలి (ప్రాంగణము) గలదో, సా ద్యౌః = అట్టి స్వర్గము.

సత్యభామా విషయములో స్వకృతాపరాధమును శాంతింపఁ జేయుటకై పారిజాత వృక్షమును దెచ్చుటకై శ్రీకృష్ణుఁడు సశరీరుఁడై రంభాద్యప్సరః కాంతాలంకృతప్రాంగణమైన స్వర్గలోకమునకు స్వీయరథమైన గరుత్మంతు నెక్కి యేఁగె నని భావము.

**అవతారిక:-** ఇప్పు డనులోమశ్లోకముచే శ్రీరాముని దండకావనప్రాప్తి, విలోమశ్లోకముచే శ్రీకృష్ణుని నందనవన ప్రాప్తి వర్ణించు చున్నాఁడు. -

**అనులోమము - శ్రీరాముని దండకావనప్రాప్తి**

**శ్లో॥ దండకాం ప్రదమో రాజాల్యా హతామయకారిహా।**
**స సమానవతానేనో భోగ్యాభో న తదాస న॥ ॥౧౫॥ 29**

**పదవిభాగము:-** దండకామ్। ప్రదమః। రాజాల్యా। హతామయకారిహా। సః। సమానవతానేనో। భోగ్యాభః। న। తదా। ఆస। న।

ప్రదమః = ప్రకృష్టమైన దమము (ఇంద్రియనిగ్రహము) గల, సః = ఆ రాముఁడు, రాజ + ఆల్యా = రాజపంక్తితో, రాజుల సమూహముతో, హత + ఆమయక + అరి + హా = హతామయకారిహా. హత = నాశనము చేసిన, ఆమయక = రోగము గల, అరి = శత్రువులుగల, పరశురాముని, హా = పీడించినవాఁడు

'స్త్రీ రు గ్రుజాచోపతాప రోగ వ్యాధి గదామయాః' - అని యమరము. దుష్టులగు క్షత్రియుల రోగము గుదిర్చిన వాఁడు భృగురాముఁడు. ఆ పరశురాముని గూడ గెలిచిన వాఁడు శ్రీరాముఁడు. ఇక్కడ 'హనన' మనఁగా నవమాన రూపహింస యని తెలియ వలయును. క్షత్రియవర్గమును రూపుమాపుటలో నిపుణుఁడగు పరశురామునియొక్క సామర్థ్యమును గూడ భంజించిన వాఁడు శ్రీరాముఁ డని ఫలితము.

స + మానవతా + న + ఏనః + భోగ్య + ఆభః = సమానవతానైనోభోగ్యాభః, స + మానవతా = మానవత్వముతోఁ గూడినవారు, న + ఏనః = అనేనః = పాపము లేని వారు నగు పుణ్యపురుషులకు, 'కలుషం వృజినైనో ఉఘ మంహో దురిత దుష్కృతమ్ - అని యమరము

భోగ్య = భోగింపఁ దగిన, ఆభః = కాంతి గల వాఁడు. నిత్యసూరిభోగ్యుఁడై కూడనా భగవంతుఁడు నిర్దోషమానుష రూపుఁడై యవతరించె నని పరమాత్మయొక్క సౌలభ్యము ప్రదర్శింపఁ బడినది. సః = ఆ రాముఁడు, తదా = అప్పుడు, దండకామ్ = దండకారణ్యమును గూర్చి, ఆస = వెళ్ళెను. 'అస-గతి దీప్త్యాదానేషు' - అను ధాతువునకు లిట్ ప్రథమైక వచనములో 'ఆస' యని రూపము.



న న = 'లేదు లేదు' అను రెండు వ్యతిరేకములు ప్రకృతార్థగమకములు. న + ఆస +న, ఆస = వెళ్ళినవాఁడు. న + ఆస = వెళ్ళని వాఁడు. న + ఆస + న = వెళ్ళని వాఁడు కాఁడు. వెళ్ళిన వాఁడే యని భావము 'ద్వౌ నఞౌ ప్రకృతార్థం గమయతః' రెండు నకారములు ప్రకృతార్థమునే సూచించును. 'న చ న స్వీకృత మర్థగౌరవమ్' (భారవి 2-27) మొదలగు మహాకవి ప్రయోగము లనేకములు గలవు. ఇక్కడ - 'అర్థగౌరవమ్ అర్థభూయ స్త్వం చ న న స్వీకృతమ్ స్వీకృతమే వేత్యర్థః వైశద్య ప్రసక్తార్థగౌరవాభావ నివర్తనార్థం నఞ్ద్వయమ్ 'సంభావ్య నిషేధనివర్తనే' ద్వౌ ప్రతిషేధౌ' - ఇతి వామనః' - అని మల్లినాథమహోపాధ్యాయుని కిరాతార్జునీయ ఘంటాపథము.

ఈ నఞ్ ద్వయ ప్రయోగము కేవలము కావ్యము లందే కాదు. 'వాఁడు నాస్తికుఁడు కాఁడు' మొదలగు వాక్యములలో నకారద్వయము లోకవ్యవహారములోఁ గూడఁ గలదు.

**విలోమము - శ్రీకృష్ణుని నందనవన గమనము**

**శ్లో॥ న సదాతన భోగ్యాభో నో నేతా వన మాస సః।**
**హారికాయమతాహల్యాజారామోద ప్రకాండదమ్॥ 30**

**పదవిభాగము:-** న। సదాతన భోగ్యాభః। నో। నేతా। వనమ్। ఆస। సః। హారికాయమతాహల్యా జారామోద ప్రకాండదమ్॥

సదాతన = నిత్య మై, భోగ్య = భోగింపఁ దగిన, ఆభః = కాంతి గలవాఁడు - నిత్యభోగ్యదివ్యతేజస్కుఁడు, నేతా = నాయకుఁడు నగు, సః = శ్రీకృష్ణుఁడు, హారి = మనోహర మైన 'స్యుంఖం హారి ప్రియం సాధు లడహం చ మనోరమమ్' - అని వైజయంతి.

కాయ = దేహముచే, మత = సమ్మతుఁ డైన, సుందర శరీరయుక్తుఁడైన, అహల్యాజార = అహల్యకు అంకు మగఁడైన యింద్రునకు, ప్రకాండ = ప్రశస్తమైన, ఆమోద = ఆనందమును, దమ్ = ఇచ్చున దగు, వనమ్ = నందనవనమును, ఆస = పొందెను - చేరెను.

'ప్రకాండ ముద్ధ తల్లజౌ ప్రశస్తవాచకా న్యమీ' - అని యమరము. హారికాయమతా = మనోజ్ఞ మైన దేహము గలది యని యహల్యకు విశేషణముగాఁ గూడ నన్వయింపవచ్చును. అట్లే - ఆమోద = సువాసనలతో, ప్రకాండ = శ్రేష్ఠ మైన దని కూడఁ జెప్పవచ్చును. 'అహల్యాయై జారః' అని వేదము కూడ నింద్రు నహల్యకు మిండఁ డని వర్ణించినది. 'న - నో' యనునవి పూర్వానులోమ శ్లోకము నందు వలెనే ప్రకృతార్థమును సూచించును. సదాతన భోగ్యాభుఁడు కాని వాఁడు నసదాతనభోగ్యాభుఁడు. నో = అట్లు కాని వాఁడు - 'సదాతనభోగ్యాభుఁడే' యగు నని భావము.

'అభావే న హ్య నో నా పి' - అని యమరకోశము. ౧౫

**అవతారిక:-** ఇప్పు డనులోమ శ్లోకముచే శ్రీరాముఁడు విరాధుని జంపుట, అగస్త్యాశ్రమము చేరుట, విలోమశ్లోకముచే శ్రీకృష్ణుఁడు స్వర్గమునకు వచ్చె నని విని యింద్రుఁడు భయపడుట వర్ణించుచున్నాఁడు -

**అనులోమము - శ్రీరాముని విరాధహంతృత్వము, అగస్త్యప్రాప్తి**

**శ్లో॥ సోర మార దనజ్ఞానో వేదేరాకంఠకుంభజమ్।**

**తం ద్రుసారపటో నాగా నానా దోషవిరాధహా॥౧౬॥** **31**

**పదవిభాగము:-** సః। అరమ్। ఆరత్। అనజ్ఞానః। వేదేరాకంఠకుంభజమ్। తమ్। ద్రుసారపటః అనాగాః। నానా। దోషవిరాధహా॥

ద్రు + సార + పటః - ద్రు = చెట్టు యొక్క, సార = సార మైన నారయే, పటః = బట్టగాఁ గలవాఁడు. నారచీరలు ధరించిన వాఁడు.

**శ్లో॥ వృక్షో మహీరుహః శాఖీ విటపీ పాదప స్తరుః**

**అనోకహః కుటః శాలః పలాశీ ద్రు ద్రుమాగమాః** - అని యమరము

అనాగాః = న+ఆగాః = అపరాధము లేని వాఁడు. జీవితములో నెప్పుడు నపరాధము చేయని వాఁ డని భావము. అనజ్ఞానః - న + అజ్ఞానః = అజ్ఞానము లేని వాఁడు - మిక్కిలి జ్ఞాని యని యర్థము.

సః = ఆ రాముఁడు, నానాదోష = అనేక హింసలు మొదలగు తప్పులు చేసిన, విరాధ = విరాధుఁ డను రాక్షసుని, హా = చంపిన వాఁడై, తమ్ = ప్రసిద్ధుఁ డగు వానిని, వేద + ఇరా + కంఠ + కుంభ + జమ్ = వేదేరాకంఠ కుంభజమ్, వేద = వేదముల యొక్క, ఇరా = వాక్కులు

'ఇరా భూ వాక్ సురాప్సు స్యాత్' - అని యమరము

కంఠ = కంఠము నందుఁ గల వానిని, వేదవాక్య పరిపూర్ణ కంఠుఁ డగు వానిని, ఇది యగస్త్యునకు విశేషణము, కుంభజమ్ = కుండ నుండి పుట్టిన యగస్త్య మహర్షిని, 'అగస్త్యః కుంభసంభవః' - అని యమరము

అరమ్ = వేగముగా, 'జవోఽథ శీఘ్రం త్వరితం లఘు క్షిప్రమరం ద్రుతమ్' అని అమరము. ఆరత్ = పొందెను చేరెను. 'ఋ-గతౌ' - అను ధాతువునకు లుఙ్ - ప్రథమైకవచన రూపము 'ఆరత్' - అని యగును. మునివృత్తి నవలంబించి వల్కములు ధరించిన వాఁడు నిరపరాధుఁడు భక్తుల యజ్ఞానమును నాశనము చేయువాఁడు నగు శ్రీరాముఁడు నిర్నిమిత్తముగా హింసల నాచరించు విరాధుని సంహరించి వేదవచనాలంకృత కంఠుఁ డగు నగస్త్యుని శీఘ్రముగాఁ జేరె నని తాత్పర్యము.





**ప్రతిలోమము - శ్రీ కృష్ణుని స్వర్గగమనముచే నింద్రుని భయము**

**శ్లో॥ హా ధరావిషదో నానా గానాటోపరసా ద్రుతమ్।**

**జంభకుంఠకరా దేవే నో జ్ఞాన దర మార సః॥** **32**

**పదవిభాగము:-** హా। ధరావిషదః। నానాగానాటోపరసాత్। ద్రుతమ్। జంభకుంఠరాః। దేవేనః అజ్ఞానదరమ్। ఆర। సః॥

ధరా = భూమికి, విష = నీటిని, ద = ఇచ్చువాఁడు. ఇంద్రుని వల్లనే వర్షములు కురియుటచే నిట్లు చెప్పఁబడినది. విషదః = గరళము నిచ్చు వాఁడు కూడ నని యర్థాంతరము ధ్వనించుచున్నది. అందువలన ధరను బాలించి ధర్మమును రక్షించు శ్రీకృష్ణునిచే శిక్షింపఁ బడుట కింద్రుఁ డర్హుఁడే యను విషయము వ్యంగ్యము.

'విషం తు గరళే జలే' - యని రత్నమాల. నానా + గాన + ఆటోప +రస + అత్ = నానా గానా టోపరసాత్, నానా = అనేక విధము లైన, గాన = పాటల యొక్క, ఆటోప = ఆడంబరముచేఁ బుట్టిన, రస = రసమును, అత్ = త్రావు వాఁడు - అనుభవించువాఁడు. వివిధ గంధర్వాప్సర స్సంగీతరసికుఁ డని యర్థము. జంభ = జంభుఁ డను రాక్షసుని కుంఠ = భంజించు, రా ః = సంపద గల వాఁడు. లేక 'రై' శబ్దము గత్యర్థకము. జంభాసురుని నిరోధించి స్వర్గమును జేరిన వాఁ డని యర్థము. 'రాస్త్రియాం హేమ్ని శాలాయా మాశంసాయాం గతా వపి' అని రత్నమాల. సః = ఆ ప్రసిద్ధుఁ డగు, దేవ + ఇనః = దేవతలకుఁ బ్రభు వగు దేవేంద్రుఁడు. అజ్ఞాన = అజ్ఞానమును (మోహమును) దరమ్ = భయమును. 'అజ్ఞానం చ దరశ్చ' యని సమాహారద్వంద్వము. అందు వల్లనే యజ్ఞానదర మని యేకవద్భావము నపుంసకత్వము తెలియవలయును.

ద్రుతమ్ = వేగముగా, ఆర = పొందెను. హా = అయ్యో! కష్టము. వర్షించు మేఘములకు నియోజకుఁడు, గంధర్వాది సంగీతములచే నానందించువాఁడు, జంభాద్యసుర సంహార సమర్థుఁడు నై కూడ దేవేంద్రుడు - స్వర్గమునకు శ్రీకృష్ణుఁడు వచ్చిన వార్తను విని మూర్ఛిల్లిన వాఁడై భయము నొందెనని భావము.

**అవతారిక:-** ఇప్పు డనులోమశ్లోకముచే శ్రీరామచంద్రుఁడు గృధ్రరాజగు జటాయువుచే సేవింపఁబడుట, శూర్పణఖచే రతిప్రార్థనము, విలోమశ్లోకముచే శ్రీకృష్ణుని యెడలఁ జేసిన యపరాధముచే నింద్రుఁడు దుఃఖించుట, పారిజాతవృక్షమును బెకలించి నందన వనమును భంజించిన శ్రీకృష్ణుని యభిగమనము చెప్పుచున్నాఁడు -

**అనులోమము - జటాయుస్సేవనము, శూర్పణఖారతిప్రార్థనము**

**శ్లో॥ సాగమాకరపాతా హా కంకే నావనతో హి సః**

**న సమానర్ద మారామా లంకారాజస్వసా రతమ్॥౧౭॥** **33**

**పదవిభాగము:-** సాగమాకరపాతా। హా। కంకేన। అవనతః। హి। సః। న। సమానర్ద। మా అరామా। లంకారాజస్వసా। రతమ్।

స + ఆగమ + ఆకర + పాతా = సాగమాకరపాతా, స + ఆగమ = వేదములతోఁ గూడిన వారు. అనఁగా వేదవిదు లగు మహర్షుల యొక్క ఆకర = సమూహమును, పాతా = రక్షించు వాఁడు. 'ఆకరాః స్థాన ఖ న్యో ఘాః' అని రత్నమాల. సః = శ్రీరాముఁడు; కంకేన = గ్రద్ద యగు జటాయువుచే, అవనతః + హి = నమస్కరింపఁ బడిన వాఁడై, సేవింపఁబడిన వాఁడై, 'హి' యనునది ప్రసిద్ధార్థక మగు నవ్యయము. అగస్త్యాశ్రమమము నుండి బయలు దేరి దండకారణ్యములోఁ దపోధను లగు మహర్షులను రక్షించుచు శ్రీరామ చంద్రుఁడు పంచవటిలో జటాయువుచేఁ బూజింపఁ బడెనని భావము. అప్పుడు, అరామా = మనోజ్ఞ కాని, సుందరరూపము లేని, 'రామః...............సితా సితమనోజ్ఞేషు త్రిషు' - అని రత్నమాల.

ఇది శూర్పణఖకు విశేషణము. లంకా రాజ స్వసా = లంకారాజ్యమున కధిపతి యైన రావణునకుఁ జెల్లె లైన శూర్పణఖ, ఇక్కడ - 'లంకారాజః + స్వసా' యని రాజః' అను దానిని 'రాట్' శబ్దమునకు షష్ఠ్యంతముగాఁ గూడ నన్వయింపవచ్చును. రతమ్ = సంభోగమును, ఆనర్ద = యాచించెను. 'అర్ద గతౌ యాచనేచ' - అను ధాతువునకు

'ఆడ జాదీనామ్' (6-4-71) అను సూత్రముచే 'ఆట్' ఆగమము . 'తస్మా న్నుడ్ ద్విహలాదేః' (7-4-71) అను సూత్రముచే 'నుట్' ఆగమము వచ్చి లఙ్లు - ప్రథమైక వచనములో 'ఆనర్ద' యను రూప మేర్పడును.

ఈ శ్లోకములో న-మా యనునవి నిషేధార్థకము లగు నవ్యయములు. రెండు నిషేధార్థములు ప్రకృతార్థమునే సూచించును.

ఈ విషయము 15 శ్లోక వ్యాఖ్యలోఁ జెప్పఁబడినది. హా = అయ్యో! ఇక్కడ 'హా' యనునది శ్రీరాముని వంటి యేకపత్నీవ్రతుని శూర్పణఖ రతికై ప్రార్థించుట లోని యనౌచిత్యమును వ్యక్తము చేయుచున్నది.

**విలోమము - శ్రీకృష్ణుని పారిజాతోత్పాటనము**

**శ్లో॥ తం రసాస్వజరాకాలమ్ మారామార్దన మాస న।**

**స హితో నవనాకేకం హా తాపారక మాగసా॥ 34**

**పదవిభాగము:-** తమ్ రసాసు। అజరాకాలమ్। మా। ఆరామార్దనమ్। ఆస। న। సః। హితః। అనవనాకే। అకమ్। హాతా। అపారకమ్। ఆగసా।

హితః = (ఇంద్రుఁడు) శ్రీకృష్ణునకు మిత్రుఁ డయ్యును, ఆగసా = అపరాధముచే, పారిజాతము నీయకుండుట యను తప్పుచే, అనవ = క్రొత్తది కాని = ప్రాచీనమైన, నాకే = (దుఃఖములేని) స్వర్గలోకము నందుఁ గూడ, అపారకమ్ = అపార మైన - స్వార్థమునందుఁ



'గ' ప్రత్యయము. అకమ్ = దుఃఖమును, 'అకం దుఃఖే చ పాపే చ ' - అని విశ్వము, హాతా = పొందినవాఁడై 'ఓ హాఙ్ - గతౌ' అను ధాతువునకు - 'తృన్' ప్రత్యయము చేరి 'హాతా' యని యగును. తృన్నంత మగుటచే, 'న లోకావ్యయనిష్ఠా ఖలర్థతృనామ్' (2-3-69) అను సూత్రముచే 'అక' శబ్దమునకు షష్ఠీ విభక్తి రాలేదు. సః = ఆ యింద్రుఁడు, రసాసు = భూముల యందు, అజరాకాలమ్ = ముసలితనము, చావు లేని వానిని, 'కాలోఽనేహా యమో మృత్యుః' - అని రత్నమాల.

భూమియం దవతరించినను శ్రీహరికి జరా - మరణాది వికారములు లేవని భావము. 'విజరో విమృత్యుః', ఆ భగవంతుఁడు జర, మృత్యువు లేని వాఁ డని శ్రుతి, 'అజోఽపి సన్నవ్యయాత్మా' (భ.గీ. 4-6), ఆ భగవంతుఁ డజుఁడు, అవ్యయాత్ముఁడు నని స్మృతి. ఆరామ = వనమును, అర్దనమ్ = భంజించిన వానిని, పారిజాత వృక్షమును బెకలించుటచే నందనవనము నాకులము చేసిన వాని నని భావము. తమ్ = ఆ శ్రీకృష్ణుని, ఆస = చేరెను.

ఇంతకు ముందు చెప్పినట్లే 'న-మా' యను నిషేధార్థకము లగు నవ్యయములు ప్రకృతార్థమునే బోధించుచున్నవి. అనాదిగా శ్రీకృష్ణునకు మిత్రుఁ డైనను పారిజాతము నొసఁ గని యపరాధముచే మహేంద్రుఁడు నిరవధిక మగు దుఃఖము నొంది పారిజాతోత్పాటనముచే నందనవనమును భంజించిన వాఁడు, జరామరణాది వికారదూరుఁడు నగు శ్రీకృష్ణు నడ్డగించుటకై యచ్చటకు వెళ్ళె నని భావము.

'నాకము' నం దుండి - 'అకమును' బొందిన వాఁ డనుచోట విరోధాభాసాలంకారము.

ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే' (చంద్రా - 71) అని చంద్రాలోకలక్షణము

**అవతారిక:-** ఇప్పు డనులోమశ్లోకముచే శూర్పణఖ యొక్క నాసికాచ్ఛేదము, ఆమె రామునితో వైరము పూనుట, విలోమ శ్లోకముచే నింద్ర కృష్ణుల సంభాషణారంభము చెప్పుచున్నాఁడు.

**అనులోమము - శూర్పణఖనాసికాచ్ఛేదము**

**శ్లో॥ తాం స గోరమదోశ్రీదో విగ్రా మసద రోతత।**

**వైర మాస పలాహారా వినాసా రవివంశకే॥ ౧౮॥ 35**

**పదవిభాగము:-** తామ్। సః। గోరమదోశ్రీదః। విగ్రామ్। అసదరః। అతత। వైరమ్। ఆస। పలాహారా। వినాసా। రవివంశకే।

గోరమ = భూరమణుఁ డగు రామచంద్రుని, 'అర్జునీ నేత్ర దిగ్బాణ భూవాగ్వారిషు గౌర్మతా' - అని విశ్వము, దోః = బాహువులకు, శ్రీదః = సంపద నిచ్చు వాఁడు - బాహుబలప్రదుఁడు - సహాయుఁడని ఫలితము, సః = లక్ష్మణుఁడు, అ - స - దరః = భయము లేని కాఁడై, సదరుఁడు = భయము గల వాఁడు. అసదరుఁడు = భయము లేని వాఁడు, 'దరోఽస్త్రియాం భయే' - అని యమరము, తామ్ = ఆ శూర్పణఖను, విగ్రామ్ = విగతనాసికను = ముక్కులేని దానిని, అతత = చేసెను.

వేర్గ్రోవక్తవ్యః - అను కాత్యాయనవార్తికముచే 'నాసికా' శబ్దమునకు - 'గ్రా' అదేశము. 'విగ్రో విగత నాసికః' - అని యమరకోశము. 'తను-విస్తారే' - అని ధాతువు. ఇక్కడ - 'తనోతి ధాతువు కరోత్యర్థకము. దాని లుఙ్రూపము - 'అతత'. పల + ఆహారా = పలాహారా = మాంసాహార యగు నారాక్షసి, రవివంశకే = సూర్యవంశము నందుఁ బుట్టిన రాము నందు, వైరమ్ = ద్వేషమును - శత్రుత్వమును, ఆస = పూనెను. 'అస - గతి దీప్త్యాదానేషు' అను ధాతువునకు లిట్టులో 'ఆస' యని రూపము.

సంభోగార్థిని యగు శూర్పణఖను శ్రీరామసహాయభూతుఁ డగు లక్ష్మణుఁడు నిర్భయుఁ డై విగతనాసికగాఁ జేసెను. ఆ ముక్కు లేని రాక్షసి కోపించినదై శ్రీరాముని యందు వైరము పూనెను.

## విలోమము - శక్ర - కేశవ సంభాషణము.

**శ్లో॥ కేశవం విరసానావి రాహాలాపసమారవైః।**

**తతరోదస మగ్రావిదోశ్రీదోమరగోసతామ్॥ 36**

**పదవిభాగము:-** కేశవమ్। విరసానావిః। ఆహ। ఆలాపసమారవైః। తతరోదసమ్। అగ్రావిదః। అశ్రీదః। అమరగః। అసతామ్।.

వి + రస + అన + అవిః = విరసానావిః, రస = ఆనందము, అన = ప్రాణనము = బలము, అవిః = కాంతి, వి = విగతః = లేనివాఁడు. 'అవిః... ప్రాకారే పవనే భాసి' - అని రత్నమాల. అసతామ్ = మంచి వారు కాని రాక్షసులకు, అశ్రీదః = అలక్ష్మీప్రదుఁడు - సంపదల నీయని వాఁడు, అమరగః = దేవతలతోఁ గూడిన వాఁడు, అగ్ర + అవి + దః = అగ్రావిదః, అగ్ర = అగ్రభూతము లగు = శ్రేష్ఠము లగు, అవి = పర్వతములను, దః = ఖండించువాఁడు, పర్వతముల ఱెక్కలను ఖండించిన వాఁడు నగు నింద్రుఁడు.

'అగ్రమ్ పురః శిఖామాన శ్రేష్ఠా దిక ఫలాదిషు', 'అవి ర్నా పర్వతే సూర్యే' - అని యుభయత్ర రత్నమాల.

ఇవి యన్నియు నింద్రునకు విశేషణములు. తత రోదసమ్ = చేయఁబడిన యాకాశము, భూమి గల వానిని, ద్యావాపృథి వ్యాది స్రష్ట నని భావము. ఇది శ్రీకృష్ణునకు విశేషణము. 'ద్యావాభూమీ చ రోదసీ - అని యమరము. 'యథాపూర్వ మకల్పయత్ దివం చ పృథివీం చాంతరిక్ష మథో సువః' - ఆ భగవంతుఁడే దివమును, పృథివిని, అంతరిక్షమును సువర్లోకమును యథాపూర్వముగా సృష్టించె నని శ్రుతి, కేశవమ్ = శ్రీకృష్ణుని, ఆలాప + సమ + ఆరవైః = ఆలాపసమారవైః = ఆలాపరూపము లగు సమీచీన శబ్దములచే - సాంత్వన వచనములచే. బతిమాలు మాటలతో నని భావము. ఆహ = పలికెను. అసురవిరోధి, దేవతా యుక్తుఁడు, పర్వత పక్షచ్ఛేది, పారిజాతాభిలాషి యగు నింద్రుఁడు ప్రబల కృష్ణ స్పర్ధచే నానంద - బల - దీప్తులు లేని వాఁడై సకలలోక స్రష్ట యగు శ్రీకృష్ణునితో సాంత్వన పూర్వకముగా నిట్లు పలికె





నని భావము. ౧౭

**అవతారిక:-** ఇప్పు డనులోమశ్లోకముచే శ్రీరామునకు ఖరాసురునితో యుద్ధప్రాప్తి, ఖరాసురుని వధించుటచే వచ్చిన శోభ, సకలలోకవ్యాప్తమగు కీర్తి గల్గుట, విలోమ శ్లోకముచే - "ఓ కృష్ణా! స్వర్గలోక స్థిత మగు పారిజాతమును భూలోకమునకుఁ గొంపోవుట యుచితము గాదని" యింద్రుఁడు పల్కుట యను విషయములను బ్రతిపాదించు శ్లోకమును రచించు చున్నాఁడు.

## అనులోమము - ఖరాసురవధ

**శ్లో॥ గోద్యుగోమ స్స్వమాయోభూ దశ్రీగఖరసేనయా।**

**సహ సాహవధారోవికలోరాజ దరాతిహా॥౧౮॥ 37**

**పదవిభాగము:-** గోద్యుగోమః। స్వమాయః। అభూత్। అశ్రీగఖరసేనయా। సహ। సాహవధారః। అవికలః। అరాజత్। అరాతిహా॥.

అశ్రీగ = అలక్ష్మిని బొందిన, ఖర = ఖరుఁ డను రాక్షసుని యొక్క, సేనయా సహ = సైన్యముతో సమముగా, స + ఆహవ + ధారః = యుద్ధ పరంపరతోఁ గూడిన వాఁడు. 'ధారా సైన్యాగ్రిమస్కంధ సంతత్యోః పత్తనాంతరే' - అని విశ్వము. అవికలః = వైకల్యము లేని వాఁడు. అవిచ్ఛిన్నముగా యుద్ధము చేయుచున్నను వికలత్వము నొందని వాఁడు. సు+అమాయః = సుష్ఠుగా దంభము లేని వాఁడు, 'మాయా దంభే క్రియాయాం చ' - అని రత్నమాల.

ఇవి శ్రీరామునకు విశేషములు. అట్టి శ్రీరాముఁడు, అరాతిహా = శత్రువులను జంపిన వాఁడై, అరాజత్ = ప్రకాశించెను. గో + ద్యు + గ + ఉమః = గోద్యుగోమః; గో = భూమి యందు, ద్యు = స్వర్గము నందు, గ = గమించిన, ఉమః = కీర్తి కల వాఁడు, అభూత్ = అయ్యెను.

'ద్యౌః స్వర్గే చాంతరిక్షే చ' - అని వైజయంతి

'ఉమా స్యా దతసీ గౌరీ హరిద్రా కీర్తి కాంతిషు' - అని రత్నమాల. ఖరాసురుని సేనతోఁ గూడ సంహరించి కూడఁ గొంచెము గూడ గాయము తగులని వాఁడై శ్రీరాముఁడు ప్రకాశించెను. పదు నాల్గు వేల మంది రాక్షసులతోఁ గూడిన సైన్యమును ఖరాసురునితోఁ గూడఁ జంపుటచే శ్రీరాముని కీర్తి భూమి యందేకాక స్వర్గము నందుఁ గూడ వ్యాపించె నని భావము.

## విలోమము - ఇంద్రుని సాంత్వన సంభాషణము

**శ్లో॥ హాతిరాదజరాలోక విరోధావహసాహస।**

**యానసేరఖగ శ్రీద భూయో మా స్వమగో ద్యుగః॥ 38**

**పదవిభాగము:-** హా। అతిరాదజరాలోక విరోధావహసాహస। యానసేరఖగ। శ్రీద భూయః మా। స్వమ్। అగః। ద్యుగః॥

అతిరాత్ + అజర + ఆలోక + విరోధ + ఆవహ + సాహస. అతిరాత్ = మిక్కిలిదాతలగు, అజర = దేవతల యొక్క ఆలోక = కాంతిని, విరోధావహ = విఘాతము కల్గc జేయు, సాహస = సాహసము గల వాcడా! శ్రీకృష్ణా! కర్మఫలముల నిచ్చు దేవతల తేజస్సును గూడ భంజింపcగల సాహసము గల వాcడు శ్రీకృష్ణుcడని భావము. యాన + స + ఇర + ఖగ = యానసేరఖగ. ఇర = వేదవాక్కుతో, స = కూడిన, ఖగ = పక్షి యగు గరుత్మంతునిపై నెక్కి, యాన = సంచరించువాcడా!, వేదమయుcడగు గరుడుcడే వాహనముగాc గల వాc డని భావము. శ్రీద = సంపదల నిచ్చువాcడా, ఈ మూcడును శ్రీకృష్ణునకు సంబుద్ధులు. ఓ కృష్ణా!, హా = అక్కటా, స్వమ్ = స్వవశ మైన, ద్యుగః = స్వర్గ లోకములో నున్న, అగః = పారిజాతవృక్షము, భూయః=భూలోకమునకు వెళ్ళునదిగా, మా = కావలదు. దేవతేజోభంగకారి పరాక్రమ! గరుడవాహన! సర్వసంపత్ప్రద! ఓ శ్రీకృష్ణా! నాకలోకస్థ మగు పారిజాతమును భూలోకమునకుc గొంపోవకు మని భావము.

దివ్య (దేవ సంబంధ) మైన వస్తువును భూలోకమునకుc దీసికొని వెళ్ళుట యనుచిత మను విషయమును 'హా' శబ్దము వెల్లడించుచున్నది. ౧౮

**అవతారిక:-** ఇప్పు డనులోమ శ్లోకముచే శ్రీరాముని జయింపc గల నని రావణుc డహంకారము పూనుట, విలోమశ్లోకముచే శోకార్ణవములో మునిcగిన యింద్రుcడు ధైర్యము తెచ్చుకొని శ్రీకృష్ణుని నిగ్రహింపుc డని జయంతాదులను బురికొల్పుట వర్ణించు చున్నాcడు

**అనులోమము - రావణుని శ్రీరామవిజిగీష**

**శ్లో॥ హతపాపచయే హేయో లంకేశోయ మసారధీః**
**రాజి రావిరతేరాపో హా హాహంగ్రహ మార ఘః॥ ౨౦॥ 39**

**పదవిభాగము:-** హతపాపచయే। హేయః। లంకేశః। అయమ్। అసారధీః। రాజి। రావిరతే రాపః। హాహా। అహంగ్రహమ్। ఆర। ఘః॥

ర + అవిరత + ఇరా + పః = రావిరతేరాపః. ర= తీక్ష్ణ మైన వారు, 'రః పావకే చ తీక్ష్ణేచ' - అని విశ్వము. అవిరత = ఎల్లప్పుడు, ఇరా = కల్లును, ప = పానముచేయువారు నగు రాక్షసులు కలవాcడు. ఘః = ఘోరమైనవాcడు. 'ఘోరే తు ఘ స్త్రిషు' - అని రత్నమాల. అసార + ధీః = సార మైన బుద్ధి లేని వాcడు. నిస్సారబుద్ధి యని యర్థము. హేయః = విడువ cదగిన వాcడు - కుత్సితుcడు. ఇవి రావణునకు విశేషణములు.

అట్టి, లంకేశః = లంకారాజ్యమున కధిపతి యైన రావణాసురుcడు; హతపాపచయే = వధింపcబడిన పాపు లగు రాక్షసుల సమూహము గల; రాజి = శ్రీరాముని యందు, 'రాజి' యనునది 'రాట్' శబ్దమునకు సప్తమ్యేకవచన రూపము. అహంగ్రహమ్ = అహంకారబుద్ధిని

43



- జయింపc గల నను నాగ్రహమును; ఆర = పొందెను. హాహా = కటకటా! కష్టము! కష్టము!

**విలోమము - ఇంద్రుని శోకము - యుద్ధప్రయత్నము.**

**శ్లో॥ ఘోర మాహ గ్రహం హాహా పోరాతే రవిరాజిరాః**
**ధీరసామయ శోకేలం యో హేయే చ పపాత హ॥ 40**

**పదవిభాగము:-** ఘోరమ్। ఆహ। గ్రహమ్। హాహాపః। అరాతేః। రవిరాజిరాః। ధీరసామయశోకే। అలమ్। యః। హేయే। చ। పపాత। హ॥

యః = ఎవ్వcడు; రవి = సూర్యుని వలె; రాజి = ప్రకాశించు; రాః = నగలరూపములో నున్న; బంగారము గల వాcడు. 'రాస్తు ద్వయో ర్ధనే స్వర్ణే' - అని రత్నమాల. సూర్యుని వలె ధగ ధగ మెఱయు మేలిమి బంగారు వస్తువులను ధరించిన వాc డని భావము. హాహాపః = 'హాహా' యను గంధర్వుని రక్షించు వాcడు నగు. ఇది యుపలక్షణము. 'హాహా -హూహూ' మొదలగు గంధర్వులను బాలించు వా cడని భావము.

'హాహా హూహూ శ్చైవ మాద్యా గంధర్వా స్త్రిదివౌకసామ్' - అని యమరము.

**'య త్తదో ర్నిత్యసంబంధః'** అను నియమముచే యచ్ఛబ్దముచే - తచ్ఛబ్దము నధ్యాహారము చేసి కొనవలెను. సః = ఆ యింద్రుcడు; హేయే = కుత్సిత మైన ; ధీరస = జ్ఞానానందము యొక్క; ఆమయ = రోగము నందు; శోకే = శోకము నందు; అలమ్ = ఎక్కువగా; పపాత = పడెను. శ్రీకృష్ణుcడు పారిజాతము నపహరించుటచే దుఃఖించె నని భావము. ఆ యింద్రుcడు - ఘోరమ్ = భయంకరుcడైన; అరాతేః = శత్రు వగు శ్రీకృష్ణుని ; గ్రహమ్ = పట్టుకొనుటకు; హ = ప్రసిద్ధముగా; ఆహ = పలికెను. జయంతాదుల నని శేషము. ఆ శ్రీకృష్ణుని నిగ్రహింపుcడు - పట్టుకొనుcడని జయంతాదుల కాదేశించె నని భావము. 'హ' యనునది చకారము వలెనే సముచ్చయార్థక మగు నవ్యయము.

హ స్యాత్ సంబోధనే పాదపూరణే చ వినిగ్రహే।
నియోగే చ క్షిపాయాం స్యాత్ కుత్సాయా మపి దృశ్యతే॥ అని **మేదినీకోశము**
'హ సంబుద్ధౌ ప్రసిద్ధౌ చ' - అని **రత్నమాల** ౨౦

**అవతారిక:-** ఇప్పుడనులోమశ్లోకముచే శ్రీరాముcడు మారీచుని వధించి ప్రకాశించుట; సీత లక్ష్మణసహాయము లేని స్థానములో నుండుట; విలోమశ్లోకముచే శ్రీకృష్ణుcడు పారిజాతము నపహరించి ప్రద్యుమ్నునితో స్వర్గమునకుc బ్రదక్షిణము చేయుట; ఇంద్రుcడు శ్రీకృష్ణునితో సంచరింప లేక పోవుట వర్ణించుచున్నాcడు -

**అనులోమము - మారీచవధ**

**శ్లో॥ తాటకేయలవా దేనోహారీ హారిగిరాస సః॥**
**హాసహాయజనా సీతానాప్తేనాదమనా భువి॥ ౨౧॥ 41**

**పదవిభాగము:** – తాటకేయలవాత్। ఏనోహారీ। హారిగిరా। ఆస। సః। హా। అసహాయజనా। సీతా। అనాప్తేనా। అదమనాః। భువి॥

హారి = మనోహరమైన; గిరా = వాక్కుచే; ధ్వని కనురూప మైన వచనముచే నని భావము. ఏనః + హారీ = ఏనోహారీ = పాపముల నపహరించు వాఁడు. రామా! రామా! యని యుచ్చరించినంత మాత్రమున రాముఁడు భక్తుల పాపములను హరించు నని భావము. సః = ప్రసిద్ధుఁ డగు రాముఁడు; తాటకేయ = తాటక కుమారుఁడైన మారీచుని; లవాత్ = ఛేదించుటవలన; ఆస = ప్రకాశించెను. 'లవో రామసుతే లేశే విశాలే ఛేదనే చ నా' – అని **రత్నమాల.** తాటకాశబ్దమున కపత్యార్థములో **'స్త్రీభ్యో ఢక్'** (4-1-120) అను సూత్రముచే 'ఢక్' ప్రత్యయము;

**ఆయనే యీ నీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్'** (7-1-2) అను సూత్రముచే – ఏయాదేశము వచ్చి 'తాటకేయుఁ' డని యేర్పడును. ఇది – ఆంజనేయ – గాంగేయాదిశబ్దముల వంటిది. తరువాత; భువి = తన నివాసస్థానము నందు; అనాప్తేనా = అనాప్త + ఇనా = భర్త లేనిదై; ఇది సీతకు విశేషణము. తన నివాస స్థానములో శ్రీరాముని సన్నిధానము లేని దని యర్థము. అద = క్షాంతి లేని; మనాః = మనస్సు గలది.

శ్రీరాముఁడు లేఁడి రూపములో నున్న మారీచుని వధింపఁగా మరణ సమయములో మారీచుఁడు 'హా సీతా! హా లక్ష్మణా!' యని పలికె ననియు నది విని శ్రీరామకంఠధ్వని భ్రమచే సీత వ్యాకుల మనస్సుతో సహింప లేక పోయిన దని భావము.

'దా స్త్రియాం క్షాంతి దానయోః' – **రత్నమాల.** అట్టి సీత; అసహాయజనా = సహాయజనము లేనిది; లక్ష్మణ సాహాయ్యము లేని దయ్యెను. హా = అయ్యో! ఇక్కడ 'హా' శబ్దము జనము లేని వనములో నేకాకినియై సీత యుండుట యుక్తము కాదను విషయమును ద్యోతకము చేయుచున్నది.

**విలోమము – ఇంద్ర పరాభవము:**

**శ్లో॥ విభునా మదనాప్తేనాతాసీనాజయహాసహా।**
**స సరా గిరిహారీహానో దేవాలయకేటతా॥** **42**

**పదవిభాగము:–** విభునా। మదనాప్తేన। ఆత। ఆసీనాజయహాసహా। సః। సరాః। గిరిహారీ। హా। నో। దేవాలయకే। అటతా॥

ఆసీన = తనవాహనముపైఁ గూర్చున్న; అజయ = జయంతునివిరోధి యగు ప్రద్యుమ్నుని యొక్క; హాస = యుద్ధాట్టహాసమును; హా = వధించినవాఁడు. 'జయో జయంతే విజయే జయా దుర్గాగ్ని మంథయోః' – అని విశ్వము. వాహనముపై నాసీనుఁడై జయంతునకుఁ బ్రతిస్పర్ధియై రణాట్టహాసము గావించు ప్రద్యుమ్నుని శరవర్షముతో నిరాకరించిన వాఁడని భావము.



సరాః = సంపద గల వాఁడు; గిరిహారీ = పర్వతములను బ్రహరించిన వాఁడు నగు; సః = ఆ యింద్రుఁడు; దేవాలయే = దేవతలకు నిలయ మైన స్వర్గమునందు; అటతా = పరిభ్రమించుచున్న; మదన + ఆప్తేన = ప్రద్యుమ్నాశ్రితుఁ డైన 'మదనో మన్మథో మారః ప్రద్యుమ్నో మీనకేతనః' అని **యమరము.** విభునా = శ్రీకృష్ణునితో; నో – ఆత = తిరుగలేకపోయెను. హా = అయ్యో! **'అత – సాతత్యగమనే'** – అను ధాతువునకు లిట్టులో 'ఆత' యని రూపము. గిరిపక్షచ్ఛేదకుఁ డయ్యును; జయంతుని జయించిన ప్రద్యుమ్నుని యట్టహాసమును బాణపరంపరచే నిరోధించిన వాఁ డయ్యును – ఇంద్రుఁడు స్వర్గము చుట్టు ప్రద్యుమ్నునితోఁ దిరుగుచున్న శ్రీకృష్ణు ననుసరింపలేకపోయెనని భావము. ఇంద్రుని కొడుకు జయంతుఁడు. శ్రీకృష్ణుని కుమారుఁడు ప్రద్యుమ్నుఁడు. ౨౧

**అవతారిక:–** ఇప్పు డనులోమశ్లోకముచే సీతను రావణుఁ డపహరించుట; విలోమశ్లోకముచేఁ దన మిత్రుఁ డగు ప్రవరుఁడను బ్రాహ్మణుని తేజస్సుచే నింద్రుఁడు ప్రద్యుమ్నుని తేజోభంగము చేయుట వర్ణించుచున్నాఁడు–

**అనులోమము – సీతాపహరణము:**

**శ్లో॥ భారమా కుదశాకేనా శరాధీకుహకేన హా।**
**చారుధీవనపాలోక్యా వైదేహీ మహితా హృతా॥ ౨౨॥** **43**

**పదవిభాగము:–** భారమా। కుదశాకేన। ఆశరాధీకుహకేన। హా। చారుధీవనపాలోక్యా। వైదేహీ। మహితా। హృతా॥

భారమా, భా = కాంతిచే; రమా = లక్ష్మి యగు; శ్రీమహాలక్ష్మికి సీతకు భేదము లేక పోయినను మానుషావతారత్వము ననుసరించి యిట్లు చెప్పినాఁడు. ఇట్లే **వాల్మీకి మహర్షి** కూడ శ్రీమహావిష్ణువునకు, రామునకు భేదము లేక పోయినను 'విష్ణునా సదృశో వీర్యే' యని భేదవ్యపదేశముతో వర్ణించినాఁడు. చారు = శుద్ధ మైన, ధీ = బుద్ధి గల; వనపా = వనదేవతలచే మాత్రమే; ఆలోక్యా = చూడ యోగ్యయైనది. సీత సన్నిధానములో వనదేవతలు తప్ప మఱెవ్వరును లేరు. సీత కేవలము వనదేవతా మాత్రసాక్షిక యైన దని భావము. మహితా = పూజ్యురాలైన; వైదేహీ = విదేహరాజకుమారి యైన జానకి; కు + దశా + అకేన = కుదశా కేన = కుత్సితదశను బొందిన;

**'అక – అగ – కుటిలాయాం గతౌ'** అని ధాతువు. లేక – కు + దశాకేన = కుత్సిత దశ గల వానిచే నని కూడఁ జెప్ప వచ్చును. సీతాపహరణోద్యోగములో నున్న రావణుని కాయుః క్షయ దుర్దశ ప్రాప్తించిన దని భావము. ఆశర = రాక్షసరూపుఁడు; అధీ = బుద్ధి లేని వాఁడు; కుహకేన = వంచకుఁడు నగు రావణునిచే, 'క్రవ్యాదోఽ స్రప ఆశరః' – అని **యమరము.** మోసగించుటకై సన్యాసి రూపమును ధరించిన రావణునిచే నని భావము. హృతా = అపహరింపఁబడినది.

హా = అయ్యో! కష్టము.

### విలోమము - ప్రద్యుమ్నతేజోభంగము:

**శ్లో॥ తా హృతా హి మహీదేవైక్యాలోపానవధీరుచా।**

**హానకేహకుధీరాశనాకేశాదకుమారభాః ॥ 44**

**పదవిభాగము:–** తాః। హృతాః । హి। మహీదేవైక్యాలోపానవధీరుచా। హానకేహకుధీరాశనాకేశా। అదకుమారభాః॥

మహీదేవ + ఐక్య + అలోప + అనవ + ధీ + రుచా. మహీదేవ = మిత్రుఁ డగు ప్రవరుఁ డను బ్రాహ్మణునియొక్క; ఐక్య = ఏకత్వముచే ; అలోప = నాశరహిత మైన; అనవ = క్రొత్తది కాని, చిరంతన మైన: ధీ = బుద్ధి ; రుచా = కాంతి గల యింద్రునిచేత;

హానక + ఈహా + కుధీర + ఆశా + నాకేశా. హానమే హానకము. స్వార్థము నందు – 'క' ప్రత్యయము. హానక = యుద్ధమును విడిచి పెట్టుటయందు; ఈహా = కోరికగల; కుధీర = కుత్సితధైర్యము గల దేవతలను; ఆశా = రక్షించుటయం దాశ (ఇచ్ఛ) గల; నాకేశా = నాక + ఈశా = స్వర్గాధిపతి యగు నింద్రునిచే; ఈట్ శబ్దమునకుఁ దృతీయావిభక్త్యేక వచనములో – 'ఈశా' యని రూపము.

శ్రీకృష్ణ బాణ ఘాత భీతిచే యుద్ధమును విడిచి పెట్టి పలాయనము చిత్తగించిన కుధీరు లగు దేవతలను రక్షించుట యం దిచ్ఛ గల యింద్రునిచేత నని భావము. తాః = ఆ; అద = క్షాంతి లేని; కుమార = శ్రీకృష్ణుని కుమారుఁడగు ప్రద్యుమ్నునియొక్క; భాః = కాంతులు; 'తాః' అను దానికి 'భాః' అను దానితో నన్వయము. ఈ భా శబ్ద మాకారాంతము. 'త్విడ్భా భాశ్చ విద్యుతి దీప్తయః' – అని **యమరము.**

హృతాః = అపహరింపఁబడినవి కదా! ఇంద్రునిచేఁ బ్రద్యుమ్నుని కాంతులు పరిభవింపఁ బడిన వని భావము.

**శ్లో॥ తతస్తు ప్రవరో నామ దేవదూతో మహాబలః।**
**పారిజాతం పునర్హర్తు మియేష కురునందన॥**
**సఖా స దేవరాజస్య మహాస్త్రవి దరిందమః।**
**అవధ్యో వరదానేన బ్రహ్మణః కురునందన॥**
**బ్రాహ్మణ స్తపసా సిద్ధో జంబుద్వీపా ద్దివంగతః।**
**స్వశక్త్యా నృప! సంయాతః సఖిత్వం బలఘాతినా॥....**

(హరి – విష్ణు – 7 అధ్యా – 30శ్లో.....)

ఇంద్రుని మిత్రుఁ డగు ప్రవరుఁ డను నొకానొక బ్రాహ్మణుఁడు రణరంగమునకు వచ్చి శ్రీకృష్ణశర ఘాతములచే విషాదము నొందిన యింద్రునకుఁ తేజస్సు పోకుండ యుద్ధములో సాహాయ్యము చేసె నను **హరివంశకథ** యిక్కడ నను సంధేయము. ౨౨





**అవతారిక:–** ఇప్పు డనులోమశ్లోకముచే శ్రీరాముని సీతావియోగము; హనుమత్సమాగమము, రాజ్యభ్రష్టుఁడగు సుగ్రీవునకుఁ బరాక్రమప్రాప్తి; విలోమశ్లోకముచే నింద్రునిచేఁ దేజోభంగము నొందిన ప్రద్యుమ్నునకు మఱలఁ దేజోలాభము, శత్రువిజయము, శీతల మారుతాగమము నను విషయములను వర్ణించుచున్నాఁడు–

### అనులోమము – శ్రీరాముని సీతావియోగము, హనుమత్సమాగమము, సుగ్రీవశరణాగతి

**శ్లో॥ హారితోయదభో రామావియోగే నఘవాయుజః।**

**తం రుమామహితోపేతామోదోసారజురామ యః॥ ౨౩॥ 45**

**పదవిభాగము:–** హారితోయదభః। రామా వియోగే। అనఘవాయుజః। తమ్। రుమామహితః। అపేతామోదః। అసారజుః। ఆమ। యః॥

యః = ఎవఁడు, హారి = మనోహరమైన, తోయద = మేఘముయొక్క, భః = కాంతి వంటి నల్లని కాంతి కల వాఁడో, సః = అట్టి రాముఁడు. ('యః' అను దానిచే 'సః' అనునది యధ్యాహారము) రామావియోగే = సీతావియోగము గల వాఁడు కాఁగా, అనఘ = పాపరహితుఁ డగు, వాయుజః = వాయుదేవుని కుమారుఁ డగు హనుమంతుఁడు కల వాఁ డయ్యెను. ఆంజనేయునితోఁ గలిసె నని భావము. తమ్ = ఆ రాముని; అసారజుః = బలము, కీర్తి కోల్పోయిన వాఁడు; 'జుః కీర్త్యాం సంగరే' – అని **రత్నమాల.** దుర్బలుఁ డగుటచే వాలిచేఁ బరాజయము నొంది సుగ్రీవుఁడు బలము, కీర్తి లేని వా ఁ డయ్యె నని భావము. అపేత = వీడిన; ఆమోదః = సంతోషము గల వాఁడు. సంతోషము లేని వాఁడని భావము. రుమామహితః = రుమాదేవిచేఁ బూజింపఁ బడిన వాఁడు. సుగ్రీవుని భార్య పేరు రుమ.

'రుమా సుగ్రీవ భార్యాయామ్' – అని **రత్నమాల.** రుమాభర్త యగు సుగ్రీవుఁడు. ఆమ = పొందెను. 'అమ – గతౌ' – అను ధాతువునకు లిట్ ప్రథమైకవచనము. సుగ్రీవుఁడు శ్రీరాముని శరణు చొచ్చెను.

### విలోమము – ప్రద్యుమ్నునకుఁ బునస్తేజఃప్రాప్తి:

**శ్లో॥ యోమరాజు రసాదోమోతాపేతో హిమమారుతమ్।**

**జో యువా ఘనగేయో విమారాభోదయతోరిహా॥ 46**

**పదవిభాగము:–** యః। అమరాజుః। అసాదోమః। అతాపేతః। హిమమారుతమ్। జః। యువా। ఘనగేయః।విమ్। ఆర। అభోదయతః। అరిహా॥

యః = ఎవఁడు; యువా = పడుచు వాఁడో – ఆ ప్రద్యుమ్నుఁడు; అమర = దేవతలతో; అజుః = యుద్ధము లేని వాఁడయ్యెను. ఇక్కడ 'జు' శబ్దము సంగరవాచకము. 'జుః కీర్త్యాం సంగరే' – అని **రత్నమాల.** హిమమారుతమ్ = చల్లనిగాలి గల; తమ్ = ఆ; విమ్ = ఆకాశమును; ఆర = పొందెను. 'విశ్చక్షుషి వ్యోమ్ని వాతే పరమాత్మని పక్షిణి' – అని **రత్నమాల**

తరువాత; అతాప + ఇతః = అతాపేతః = అతాపమును బొందిన వాఁడై – తాపములేని వాఁడై ; ఆభా + ఉదయతః = ఆభోదయతః; ఆభా + తేజస్సుయొక్క; ఉదయతః = ప్రాదుర్భావముచే; మఱలఁ దన తేజస్సు తనకుఁ గల్గుటచే; అరిహా = శత్రువులను జంపిన వాఁడు; జః = జయించినవాఁడు; 'జో జపే విజయే మేరౌ శబ్దే జేతరి మత్సరే' – అని **రత్నమాల.** అసాదోమః. అసాద = పొంద లేని; ఉమః = కీర్తి గల వాఁడు. మిక్కిలి కీర్తి గల వాఁ డని భావము. 'ఉమా స్యా దతసీ గౌరీ హరిద్రా కీర్తి కాంతిషు' – అని **రత్నమాల.** ఘనగేయః = గొప్పవారిచే గానము చేయఁబడిన వాఁడు – స్తుతింపఁ దగిన వాఁ డయ్యెను. ప్రద్యుమ్నుఁడు మొట్టమొదట నింద్ర బాణముల దెబ్బలచే మూర్ఛిల్లి యొక్క క్షణము దేవతలతో యుద్ధము చేయని వాఁడై మఱలఁ జల్లని గాలులు గల యాకాశము నాశ్రయించుట వలనఁ దాపము లేని వాఁడై, మఱలఁ దన తేజస్సు తన కుదయించుటవలన శత్రువులను జయించి, నాశనము లేని కీర్తి కలవాఁడై ప్రౌఢజనులచే స్తుతింపఁబడినవాఁ డయ్యెనని తాత్పర్యము.౨౩

**అవతారిక :–** ఇప్పు డనులోమశ్లోకముచే శ్రీరాముఁడు వాలిని వధించుట: విలోమశ్లోకముచే శ్రీకృష్ణుఁ డింద్రబాణములచే నొచ్చిన వైనతేయుని సంరక్షించుట వర్ణించుచున్నాఁడు –

**అనులోమము – వాలి వధ:**

**శ్లో॥ భాను భానుతభా వామా సదామోదపరో హతం (మ్)।**
**తం హ తామరసాభాక్షోతిరాతాకృత వాసవిం (మ్)॥ ౨౪॥ 47**

**పదవిభాగము:–** భాను భానుతభాః। వామాసదామోదపరః। హతమ్। తమ్। హ। తామరసాభాక్షః। అతిరాతా। అకృత। వాసవిమ్॥

భానుభా = సూర్యతేజస్సుచే; నుత = స్తుతింపఁబడిన; భాః = కాంతికల వాఁడు; సూర్యతేజస్సును మించిన తేజస్సు కల వాఁడని భావము. వామా = సీతచే; సదా = ఎల్లప్పుడు; ఆమోద = ఆనందము నొందుటలో, పరః = తత్పరుఁడు. 'వామా రామా వామనేత్రా పురంధ్రీ' – అని **హలాయుధుని యభిధాన రత్నమాల.** అతి = మిక్కిలి; రాతా = వరముల నొసఁగు వాఁడు. 'రా – దానే' – అను ధాతువునకు – 'తృచ్' ప్రత్యయము చేరఁగా 'రాతా' యని యగును. తామరస = పద్మములయొక్క; ఆభా = కాంతి వంటి కాంతి గల; అక్షః= కన్నులు గల వాఁడు లేక పద్మముల వంటి కన్నులు గలవాఁడు. 'ఆభా ప్రఖ్యోపమాభిఖ్యా ప్రకారః సన్నిభం నిభమ్' – అని **వైజయంతి.** 'రామో రాజీవలోచనః' అను పదబంధము **వాల్మీకి** కెక్కువ యిష్టమైనది.

అట్టి శ్రీరాముఁడు, వాసవిమ్ = ఇంద్రుని కుమారుఁ డగు వాలిని; వాసవస్యాపత్యమ్' పుమాన్ వాసవిః – వాసవుని కుమారుఁడు వాసవి. **'అత ఇఞ్'** (4–1–95) అను సూత్రముచే నపత్యార్థములో వాసవ శబ్దముపై 'ఇఞ్' ప్రత్యయము చేరి 'వాసవి' యని యగును. హతమ్ చచ్చిన వానిగా, అకృత = చేసెను. చంపెనని యర్థము. 'హ' యనునది పాదపూరణము. 'హః స్యాత్ సంబోధనే పాదపూరణే' – అని **విశ్వము.**





**విలోమము – గరుడ సంరక్షణము:**

**శ్లో॥ విం స వాత కృతారాతిక్షోభాసారమతాహతం (మ్)।**
**తం హరోపదమో దాస మావాభాతనుభానుభాః॥ 48**

**పదవిభాగము:–** విమ్। సః। వాతకృతారాతిక్షోభాసారమతాహతమ్। తమ్। హరోపదమః। దాసమ్। ఆవ। ఆభాతనుభానుభాః।

ఆభా = కాంతిచే; తను = లఘువుగా – తక్కువగా నున్న; భానుభాః = సూర్యకాంతి గలవాఁడు. స్వీయతేజస్సుచే లఘూకృత మైన సూర్యదీప్తి గలవాఁడు. 'న తత్ర సూర్యో భాతి' ఆ భగవంతుని దగ్గఱ సూర్యుఁడు ప్రకాశించుట లే దని **శ్రుతి.** హర + ఉపదమః = హరోపదమః, హర = శివుని; ఉపదమః = నిగ్రహించిన వాఁడు. బాణాసురయుద్ధములో శివుని గూడ గెలిచిన వాఁడని భావము. సః = ఆ శ్రీకృష్ణుఁడు. వాత = ఱెక్కల గాలిచే; కృత = చేయఁబడిన; అరాతి = శత్రువులయొక్క; క్షోభ = సంచలనము; అసార = బలహీనత్వము; మత = అభిమత మగు; ఆహతమ్ = హాని గల వానిని; 'ఆహత' శబ్దము భావ క్తాంతము. పక్షముల నుండి పుట్టిన మారుతముచే శత్రువులకు క్షోభము, దౌర్బల్యము, అభిమతార్థహాని కలుగఁ జేసిన వాఁడు గరుత్మంతుఁ డని భావము. తమ్ = ఆ ప్రసిద్ధుఁ డగు; దాసమ్ = దాసుని; విమ్ = పక్షి యగు గరుడుని; ఆవ = రక్షించెను.

'నగౌకో – వాజి – వికిర – వి – విష్కర – పతత్రయః– అని **యమరము.**

'అవ – రక్షణే' – అను ధాతువునకు లిట్ ప్రథమైకవచనములో 'ఆవ' యని రూపము. 'దాసః సఖా వాహన మాసనం ధ్వజః'(ఆల. స్తో – 44శ్లో) గరుత్మంతుఁడు శ్రీమహావిష్ణువునకు దాసుఁడు, మిత్రుఁడు, వాహనము, ఆసనము, ధ్వజము (జెండా) కూడ నయ్యె నని యభియుక్తోక్తి **(శ్రీమద్యామునాచార్యుల యాలవందార స్తోత్రము.)** ౨౪

**అవతారిక :–** ఇప్పు డనులోమశ్లోకముచే వాలి వధానంతరము శ్రీరామునకు రావణవధోదర్క జయలక్ష్మీప్రాప్తి, సుగ్రీవసైన్యలాభప్రయుక్తతేజోఽ తిశయసిద్ధి; విలోమశ్లోకముచేఁబక్షిరాజును సంరక్షించిన శ్రీకృష్ణునకు శత్రుపరాభవోపయుక్త జయలక్ష్మీసిద్ధి వర్ణించుచున్నాఁడు–

**అనులోమము – రావణవధకై జయలక్ష్మీప్రాప్తి; సుగ్రీవునకు సైన్యలాభప్రాప్తి:**

**శ్లో॥ హంసజారుద్ధబలజా పరోదారసు భాజని।**
**రాజి రావణరక్షోరవిఘాతాయ రమారయం (మ్)॥ ౨౫॥ 49**

**పదవిభాగము:–** హంసజారుద్ధబలజా। పరోదారసుభా। అజని। రాజి। రావణరక్షోరవిఘాతాయ। రమా। ఆర। యమ్॥

యమ్ = ఏ రాముని; రావణ = రావణాసురునియొక్క; ర = శిరస్సును; 'రం క్లీబం రుధిరే మూర్ధ్ని' – అని **రత్నమాల.**

విఘాతాయ = ఛేదించుటకు; రమా = జయలక్ష్మి; ఆర = పొందెనో; రాజి = ఆ రామునియందు; ఇది రాట్ శబ్దమునకు సప్తమ్యేకవచనము. హంసజ = సూర్యుని కుమారుఁడైన సుగ్రీవునియొక్క; 'భానుర్హంసః సహస్రాంశుః' – అని **యమరము.** అరుద్ధబలజా = అడ్డు లేని సైన్యము వలనఁ బుట్టిన; పర = పరమ మైన (మిక్కిలి) ; ఉదార = ఉత్కృష్ట మైన; సుభా = శోభన మైన దీప్తి; అజని = పుట్టినది. వాలి వధచే రావణ శిరశ్ఛేదసూచకజయలక్ష్మిని బొందిన రాఘవునకు సుగ్రీవసైన్యలాభమువలనఁ గల్గిన పరభీకర మగు పరమోత్కృష్ట తేజస్సు కూడఁ గల్గిన దని భావము.

**విలోమము – శ్రీకృష్ణునకు జయలక్ష్మీసిద్ధి:**

**శ్లో॥ యం రమార యతాఘా విరక్షోరణవరాజిరా।**

**నిజభా సురదా రోప జాలబద్ధరుజాసహం (మ్)॥ 50**

**పదవిభాగము :–** యమ్। రమా। ఆర। యతాఘా। విరక్షోరణవరాజిరా। నిజభా। సురదా। రోపజాలబద్ధరుజాసహమ్॥

రోపజాల = బాణసమూహములచే; 'పత్రీ రోప ఇషు ర్ద్వయోః' – అని **యమరకోశము** బద్ధ = కలిగిన; రుజా = వేదనను; సహమ్ = సహించిన; యమ్ = ఏ శ్రీకృష్ణుని; శత్రువులచేఁ బ్రయోగింపఁబడిన శరనికరముచేఁ గలిగిన దుఖమును సహింపఁ గలిగిన శ్రీకృష్ణుని, యతాఘా = యత + అఘా = వ్యపగతదోష = దోషములు లేనిది; విరక్షః = విగతరాక్షస మైన, రణవర + అజిరా = రణవరాజిరా = యుద్ధశ్రేష్ఠప్రాంగణము గలది; 'అంగణం చత్వ రాజిరే' – అని **యమరము.** నిజభా = నాశనము లేని కాంతి కలది. 'నిజౌ స్వీయావినాశినౌ' – అని **రత్నమాల.** సురదా = దేవతలను ఖండించునది యగు. 'దో – అవఖండనే' – అని ధాతువు. రమా = జయలక్ష్మి; ఆర = ప్రాప్తించెను. చేరెను. సః = అట్టి కృష్ణుఁడు గరుత్మంతుని రక్షించె నని పూర్వశ్లోకముతో నన్వయము. శత్రుక్షిప్త శరసందోహప్రయుక్త దుఃఖ సహిష్ణుఁ డగు శ్రీకృష్ణుని నిర్దోష, విగతరాక్షస, యుద్ధవరప్రాంగణ, దేవతాఖండన యగు జయలక్ష్మి చేరిన దని భావము.
౨౫

**అవతారిక :–** ఇప్పు డనులోమ శ్లోకముచే సముద్రమును దాఁటి, సీతను జూచి మఱలి వచ్చిన హనుమంతుని జేరి శ్రీరాముఁడు సహ్యమలయాదిపర్వతములను, సముద్రవేలను బొంది ప్రకాశించుట; విలోమశ్లోకముచేఁ బ్రద్యుమ్నుని దాడించిన యింద్రుని జూచి శ్రీకృష్ణుఁడు మిక్కిలి కోపించి యుద్ధములో విజయమును బొంది పారిజాతమును గ్రహించుట వర్ణించుచున్నాఁడు.





**అనులోమము – సీతను జూచి వచ్చిన హనుమంతునితో రాముని కలయిక; సముద్రతీరము చేరుట.**

**శ్లో॥ సాగరాతిగ మాభాతి నాకేశోసురమాసహః।**

**తం స మారుతజం గోప్తా భాదాసాద్య గతోగజం (మ్) ౨౬॥ 51**

**పదవిభాగము :–** సాగరాతిగమ్। ఆభాతినాకేశః। అసురమాసహః। తమ్। సః। మారుతజమ్। గోప్తా। అభాత్। ఆసాద్య। గతః। అగజమ్॥

ఆభా + అతి + నాక + ఈశః = ఆభాతినాకేశః, ఆభా = కాంతిచే; అతి = అతిక్రమించిన; నాకేశః = ఇంద్రుఁడుగల వాఁడు. ఇంద్రుని కంటె నధికతేజస్కుఁడు. అసుర + మా + అసహః = అసురమాసహః, అసుర = రాక్షసులయొక్క; మా = లక్ష్మిని; అసహః = సహింపని వాఁడు. సురరిపు సంప దసహిష్ణుఁడు. గోప్తా = సర్వరక్షకుఁడు నగు; సః = ఆ రఘువీరుఁడు. సాగర + అతి + గమ్ = సాగరాతిగమ్. సాగర = సముద్రమును; అతిగమ్ = మిక్కిలి గమించిన – దాఁటిన; తమ్ = ఆ ప్రసిద్ధుఁడగు; మారుతజమ్ = వాయుకుమారుఁడగు హనుమంతుని; ఆసాద్య = పొంది – చేరి; అగ + జమ్; అగ = సహ్యము, మలయము మొదలగు పర్వతములను; జమ్ = సముద్రపుటొడ్డును; 'జో – నిశాకర – వేలయోః' – అని **రత్నమాల**. గతః = చేరిన వాఁడై; అభాత్ = ప్రకాశించెను.

**విలోమము – పారిజాతగ్రహణము.**

**శ్లో॥ జం గతో గ దృసాదాభాప్తా గోజం తరు మాస తం (మ్)**

**హ స్సమారసుశోకే నాతిభామాగతి రాగసా॥ 52**

**పదవిభాగము :–** జమ్। గతః। గదీ। అసాదాభాప్తా। గోజమ్। తరుమ్। ఆస। తమ్। హః। సమారసుశోకేన। అతిభామాగతిః। ఆగసా॥

స + మార + సు + శోకేన. మార = ప్రద్యుమ్నుని; మన్మథుఁడే రుక్మిణీ శ్రీకృష్ణులకుఁ బ్రద్యుమ్నుఁడుగాఁ బుట్టెను. 'మదనో మన్మథో మారః ప్రద్యుమ్నో మీనకేతనః' – అని **యమరము.** సుశోకేన = మిక్కిలి దుఃఖముచే; స + ఆగసా = సాగసా. స = కూడిన; ఆగసా = అపరాధముచే; బాణములచే నొప్పించి ప్రద్యుమ్నున కత్యంత ఖేదమును గల్గించిన యింద్రుని యపరాధముచే. అతి + భామ + ఆగతిః = అతిభామాగతిః, అతి = మిక్కిలి; భామ = కోపముయొక్క; ఆగతిః = ఆగమనము గలవాఁడు; మిక్కిలి కోపించిన వాఁడు; గదీ = కౌమోదకి యను గద యాయుధముగాఁ గలవాఁడు; జమ్ = విజయమును; గతః = పొందినవాఁడు. 'జో జపే విజయే' – అని **రత్నమాల.** అసాద = విషాదములేని; ఆభా = కాంతిని; ఆప్తా పొందినవాఁడు – ఇది 'తృన్' ప్రత్యయాంతము. హః = శ్రీకృష్ణుఁడు. 'హః శంకరే హరౌ' – అని **రత్నమాల.** గోజమ్ = స్వర్గమునందుఁ బుట్టిన. 'స్వర్గేషు పశు వా

గ్వ్రజ ది క్ప్నేత్ర ఘృణి భూతలే లక్ష్యదృష్ట్యా స్త్రియామ్ పుంసి గౌః' - **యమరము.** తమ్ = ఆ ప్రసిద్ధ మైన; తరుమ్ = పారిజాతవృక్షమును; ఆస = గ్రహించెను. ౫౨

**అవతారిక :-** ఇప్పు డనులోమ శ్లోకముచే సేతువుపై సముద్రమును దాఁటు వానరసేనను రక్షించుచు శ్రీరాముఁడు ప్రకాశించుట; ప్రతిలోమశ్లోకముచేఁ బారిజాతమును గ్రహించిన శ్రీకృష్ణుఁడు సేవకులకు జయము, శత్రువులకు భయము గల్గించుట వర్ణించుచున్నాఁడు-

**అనులోమము - శ్రీరాముని సేతుగామివానరసేనారక్షణము**

**శ్లో॥ వీరవానరసేనస్య త్రా తాభా దవతా హి సః**

**తోయధా వరిగోయాద స్యయతో నవసేతునా॥౫౩॥ 53**

**పదవిభాగము:-** వీరవానరసేనస్య। త్రాతా। అభాత్। అవతా। హి। సః। తోయధౌ। అరిగోయాదసి। అయతః। నవసేతునా॥

సః = ఆ రాముఁడు; అరి = అక్షయ మగు; 'రిశబ్దస్తు స్రవే క్షయే' - అని **రత్నమాల.** గో = నీళ్ళు; యాదసి = జలజంతువులుగల, 'గౌః క్రతౌ వృషభే చంద్రే వా గ్భూ ది గ్దేనుషు స్త్రియామ్।, ద్వయో స్తు రశ్మి దృ గ్బాణ స్వర్గ వ జ్రాంబు లోమసు॥' అని **రత్నమాల.** 'యాదాంసి జలజంతవః' - అని **యమరము.** తోయధౌ = సముద్రము నందు; అవతా = రక్షించునది యగు. సముద్రములోఁ బడకుండ రక్షించున దని భావము. నవసేతునా = క్రొత్తగాఁ గట్టిన వారధిపై; అయతః = వెళ్ళుచున్న; వీరవానరసేనస్య = వీరు లగు వానరుల సైన్యమునకు; **విభాషా సేనా సురా చ్ఛాయా శాలా నిశానామ్** (2-4-25) అను సూత్రముచే సేనా శబ్దమునకు నపుంసకత్వము.

త్రాతా = రక్షకుఁడై; అభాత్ హి = ప్రకాశించెను గదా! అయతః **'అయ - గతౌ'** - అను ధాతువుపై 'లటః శతృ శానచా వప్రథమా సమానాధికరణే' (3-1-124) అను సూత్రముచే 'శతృ' ప్రత్యయము చేరి 'అయత్' అని యగును. దీనికి షష్ఠీవిభ క్త్యేకవచనములో 'అయతః' అని రూపము.

ఇక్కడ నొక్క శంక- 'అయ' ధాతు వాత్మనేపది యగుటచే 'శానచ్' ప్రత్యయము ముమాగమము వచ్చి 'అయమాన' యని యగుట శాస్త్రసమ్మతము. అయ ధాతువుపై 'శతృ' ప్రత్యయము చేరుట శాస్త్రవిరుద్ధము. కాని - 'అనుదాత్తేత్వలక్షణ మగు నాత్మనేపద మనిత్య' మను పరిభాషచే 'అయత్' - అను పరస్మైపదప్రయోగము కూడ సాధువే. లేదా - 'ఇట - కిట - కటీ - గతౌ' - అనుచోటఁ బ్రశ్లిష్టమైన 'ఈ' ధాతువు పై శతృ ప్రత్యయము చేరి 'అయత్' అని యగునని గ్రహింపవలెను. 'ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జౌ' (శిశు - 4-20) అని **మాఘమహాకవి ప్రయోగము.** ఇక్కడ - 'అత్ర ఇట కిట కటీ గతౌ ఇతి ఉదయతీతి రూపమ్. కేచిత్ 'అయగతౌ' వితి పఠంతి' - అని **వల్లభదేవుని సందేహవిషౌషధి.**

"ఉదయతి - ఉదయమానే। 'అయ - గతౌ' ఇతి స్వరితేతంకేచి దిచ్ఛంతి। తతః శతరి





సప్తమీ" - అని మల్లినాథ మహోపాధ్యాయుని సర్వంకష. "అథ కథమ్ - 'ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జౌ' - ఇతి మాఘః? ఇటకిటకటీ - ఇత్యత్ర ప్రశ్లిష్టస్య భవిష్యతి। యద్వా 'అనుదాత్తేత్వలక్షణ మాత్మనేపద మనిత్యమ్' (పరి -97). చక్షిఙో జిత్కరణా జ్ఞాపకాత్" - అని **సిద్ధాంతకౌముది.** ఉదయతి కలమంద్రైః కంఠతాలై రలీనామ్ (అనర్ఘ - 7 - 71) అని **మురారి.** ఉదయన్మణినూపురప్రభా (కరుణా - 49) అని **జగన్నాథ పండితరాయలు.**

**విలోమము - కృష్ణభక్తులకు జయముః తద్విముఖులకు భయము:**

**శ్లో॥ నా తు సేవనతో యస్య దయాగోరివధాయతః**

**స హి తావ దభాతా త్రాస్యనసే రనవారవీ॥ 54**

**పదవిభాగము :-** నా। తు। సేవనతః। యస్య। దయాగః। అరివధాయతః। సః। హి। తావత్। అభాతా। త్రాసీ। అనసేః। అనవారవీ॥

నా తు = మనుష్యుఁ డయినచో; యస్య = ఏ శ్రీకృష్ణుని యొక్క; సేవనతః = భజనము వలన; దయాగః = కృపను బొందినవాఁడై; అరివధ = శత్రుహననముచే; ఆయతః = విస్తీర్ణుఁడు - అభివృద్ధిపొందిన వాఁ డగునో; (తస్య = ఆ శ్రీకృష్ణుని యొక్క; 'యః' అను దానిచే - 'తస్య అనునది యధ్యాహారము)

అనవారవీ; నవ + ఆరవీ = స్తవరూపశబ్దము గల వాఁడు. 'నవం నవ్యే పుమాన్ స్తుతే' అని మేదిని అది లేని వాఁడు - అనవారవీ. శ్రీకృష్ణ విషయకస్తోత్రశబ్దరహితుఁడు. అనసేః = న + అసేః = కత్తిలేనివానికిః గూడ; త్రాసీ = భయపడు వాఁడు. ఆయుధరహితునకే భయపడుచున్నచో నాయుధసహితునకు భయపడు నని వేఱే చెప్ప నేల? అభాతా హి = నిశ్చయముగాఁ బ్రకాశహీనుఁ డగును గదా!

**'భా - దీప్తౌ'-** అను ధాతువునకుఁ 'దృచ్' ప్రత్యయము చేరి 'అభాతా' యని యగును. 'తావత్' శబ్ద మలంకారార్థము. ఎవని సేవకుఁడు శత్రువధచే వర్ధిల్లునో; యెవని సేవింపని వాఁడు నిరాయుధునకుఁ గూడ భయపడి ప్రకాశింపఁడో యట్టి శ్రీకృష్ణుఁడు పారిజాతవృక్షమును గ్రహించె నని పూర్వశ్లోకముతో నన్వయము. ౫౪

**అవతారిక :-** ఇప్పు డవరోహణ శ్లోకముచే నుదగ్రవిక్రమశాలి యగు రావణుని ప్రాణములు హరించి సీతను బొంది త న్నాశ్రయించిన విభీషణుని ఖేదము వాపి శ్రీరాముఁడు సర్వదేవతలచేఁ బూజింపఁబడుట; ఆరోహణశ్లోకముచే శ్రీకృష్ణుఁడు శత్రువులను భంజించి జయశీలుఁడై సకలజనులచే స్తూయమానుఁడై మఱల భూలోకమునకు వచ్చుట వర్ణించుచున్నాఁడు -

**అనులోమము - శ్రీరాముని శత్రు విజయము:**

**శ్లో॥ హారిసాహసలంకేనాసుభేదీ మహితో హి సః**

**చారుభూతనుజో రామోర మారాధయ దార్తిహా॥ ౫౫॥ 55**

**పదవిభాగము:–** హారిసాహసలంకేనాసుభేదీ। మహితః। హి। సః। చారుభూతనుజః। రామః। అరమ్। ఆరాధయదార్తిహా॥

హారి = మనోహరమైన; సాహస = విక్రమము గల; లంకా + ఇన = లంకేన = లంకారాజ్యప్రభువైన రావణునియొక్క; అసు = ప్రాణములను; భేదీ = ఛేదించినవాఁడై; చారు = అందమైన; భూతనుజః = సీత గల వాఁడై, అరమ్ = వేగముగా. ఆరాధయత్ = ఆరాధించుచున్న విభీషణుని; ఆర్తి = దుఃఖమును; హా = హరించినవాఁడై, సః = ఆ రాముఁడు; మహితః = సర్వదేవతలచేఁ బూజింపఁబడిన వాఁడు; హి = నిశ్చయముగా నయ్యెను గదా!

### విలోమము – శ్రీకృష్ణుని భూలోకాగమనము:

**శ్లో॥ హార్తిదాయ ధరామార మోరా జో నుతభూ రుచా।**

**స హితో హి మదీభే సునాకేలం సహ సారిహా॥ 56**

**పదవిభాగము :–** హా। ఆర్తిదాయ। ధరామ్। ఆర। మోరాః। జః। నుతభూః। రుచా। సః। హితః। హి। మదీభే। సునాకే। అలమ్। సహసా। అరిహా॥

ఆర్తిదాయ = దుఃఖమును ఖండించు ప్రద్యుమ్నునకు లేక సాత్యకికి; హితః = ఇష్టుఁడు. ఆర్తిం ద్యతి ఖండయతీతి – ఆర్తిదః। **'హితయోగే** చ' – అను **వార్తికము**చేఁ జతుర్థీవిభక్తి. మది + ఇభే = మదించిన యైరావత మను నేనుఁగు గల; సు + నాకే = శోభన మైన స్వర్గలోకమునందు; అలమ్ = మిక్కిలి; సహసా = వేగముతో; అరిహా = శత్రువులను ఖండించినవాఁడు; జః = జయమును బొందిన వాఁడు; నుతభూః = స్తోత్రములకు స్థానమైనవాఁడు; సర్వస్తోత్రపాత్రభూతుఁడు; నుతియే నుతము. భావము నందు 'క్త' ప్రత్యయము. రుచా = కాంతిచే; మా + ఉరాః = లక్ష్మీదేవి వక్షఃస్థలము నందుఁ గల వాఁడు నగు; సః = ఆ శ్రీకృష్ణుఁడు; ధరామ్ = భూలోకమును; ఆర హి = పొందినవాఁ డయ్యెను గదా!, హా = ఆశ్చర్యము!, స్వర్గమున కేఁగిన వాఁడు సశరీరముగా భూలోకమునకు వచ్చుట యాశ్చర్యము. ౨౮

**అవతారిక :–** ఇప్పుడు పురోగమన శ్లోకముచే శ్రీరాముని యయోధ్యాప్రాప్తి; తిరోగమన శ్లోకముచే శ్రీకృష్ణుని ద్వారకాప్రవేశము వర్ణించుచున్నాఁడు –

### అనులోమము – శ్రీరాముని యయోధ్యాప్రాప్తి :

**శ్లో॥ నాళికేరసుభాకారాగారాసౌ సురసాపికా।**

**రావణారిక్షమేరా పూ రాభేజే హి ననామునా॥ ౨౯॥ 57**

**పదవిభాగము :–** నాళికేరసుభాకారాగారా। అసౌ। సురసాపికా। రావణారిక్షమేరా। పూః। ఆభేజే। హి। న। న। అమునా॥



నాళికేర = కొబ్బరి చెట్లచే; సుభాకార = శోభనాకృతి గల; లేక; సు = మంచి; భా = కాంతితోఁ గూడిన; ఆకార = ఆకృతి గల; అగారా = గృహములు గలది; సురస = శోభనరాగమునకు – మంచి యనురక్తికి; ఆపికా = ప్రాపిక = ప్రాపైనది; కోరఁ దగినది యని యర్థము. రావణారి = రావణునకు శత్రు వైన శ్రీరామునకు ; క్షమ = ఉచితమైన; ఇరా = భూమిగలది; లేక – రావణారి = శ్రీరాముని; క్షమా = సమర్థమైన యోర్పునకు; ఇరా = స్థానమైనది యగు; అసౌ పూః = ఆ యయోధ్యాపురి; అమునా = శ్రీరామచంద్రునిచే; ఆభేజే హి = సేవింపఁబడినది గదా! ఇక్కడ 'న – న' యను రెండు నకారములు ప్రకృతార్థమునే సూచించును. ఎట్లనఁగా – న + ఆభేజే = సేవింపఁబడనిది. నహి = లేదు గదా। సేవింపఁ బడినదే కదా! యని యర్థము. **భజ – సేవాయామ్.** ఆఙ్ పూర్వక మగు 'భజ' యను ధాతువునకుఁ గర్మణి ప్రయోగములో లిట్టు నందు రూపము.

### విలోమము – శ్రీకృష్ణుఁడు పారిజాతముతో ద్వారకలోఁ బ్రవేశించుట:

**శ్లో॥ నాముని నహి జేభేరా పూ రామేక్షరిణా వరా।**

**కాపి సార సుసౌరాగా రాకాభాసురకేళినా॥ 58**

**పదవిభాగము :–** న। అమునా। న। హి। జేభేరా। పూః। ఆమే। అక్షరిణా। వరా। కా। అపి। సారసుసౌరాగా। రాకాభాసురకేళినా॥

జ + ఇభ + ఇరా = జేభేరా. జ = జయశీలము గల; ఇభ = ఏనుఁగులకు; ఇరా = స్థాన మైనది; వరా = శ్రేష్ఠ మైనది; కా + అపి = ఒకానొక యనిర్వచనీయ మైన; పూః = పురి; ద్వారకాపట్టణ మని యర్థము. అక్షరిణా = ధర్మము గల వాఁడు – ఓంకార స్వరూపుఁడు. 'అక్షరమ్ ప్రణవే ధర్మే' – అని **రత్నమాల.** రాకా = క్రొత్తగా సమర్తాడిన గోపికలతో; ప్రథమరజస్వల లగు గొల్ల కన్నె పిల్లలతో నని భావము. భాసుర = ప్రకాశించు; కేళినా = క్రీడలు గల వాఁడు నగు; 'రాకా నవరజో నార్యామ్' – అని **రత్నమాల.** అమునా = శ్రీకృష్ణునిచే; సార = శ్రేష్ఠమైన; సు = శోభన మైన; సౌర = సుర (దేవతా) సంబంధమైన; అగ = చెట్టు – పారిజాతవృక్షము గలదై; ఆమే హి = గమింపఁబడినది – పొందఁబడినది కదా! **'అమ – గత్యాదిషు'** – అను ధాతువునకు లిట్టు నందుఁ గర్మణి ప్రయోగము.

శ్రీకృష్ణుఁడు ద్వారకాపురిని పారిజాతవృక్షముతోఁ గూడినదిగాఁ జేసి ప్రవేశించె నని భావము. ఇక్కడఁ గూడ రెండు నకారములు ప్రకృతార్థమునే సూచించును. ఆమే = గమింపఁ బడినది. న + ఆమే = గమింపఁబడనిది. న – ఆమే – న = గమింపఁబడనిదికాదు. గమింపఁబడినదే యని యర్థము. ౨౯

**అవతారిక :–** ఇప్పుడు గతశ్లోకముచే నయోధ్యాపురికి మహాలక్ష్మీప్రాప్తి, శ్రీరామచంద్రునకు రాజ్యశ్రీసిద్ధి; ప్రత్యాగత శ్లోకముచే సత్యభామాగృహాంగణములోఁ బారిజాతవృక్షస్థాపనము, పారిజాతకుసుమ ధారణముచే సత్యభామ కత్యద్భుతకాంతిసంపత్తి, శ్రీకృష్ణరుక్మిణీ విషయక

రోషనివృత్తి, సమీచీన జ్ఞానాదిసిద్ధిని వర్ణించి గ్రంథమును ముగించుచున్నాఁడు –

**అనులోమము – శ్రీరాముని రాజ్యప్రాప్తి :**

**శ్లో॥ సాఽగ్ర్యతామరసాగారా మక్షామా ఘనభార గౌః।**

**నిజదే పరజి త్యాసశ్రీ రామే సుగరాజభా॥** ౩౦॥ **59**

**పదవిభాగము :–** సా। అగ్ర్యతామరసాగారామ్। అక్షామా। ఘనభా। ఆర। గౌః। నిజదే। పరజితి। ఆస। శ్రీః। రామే। సుగరాజభా॥

శ్రీరాముఁడు ప్రవేశించిన పిమ్మట – సా గౌః = ఆ యయోధ్యాభూమి. 'గౌ ర్నాకే వృషభే చంద్రే వా గ్భూ ది గ్ధేనుషు స్త్రియామ్' – అని **రత్నమాల.** అక్షామా = కృశింపనిది; ఘనభా = అధికదీప్తి గలది యై; అగ్ర్య = ఉత్తమ మైన; తామరస + అగారామ్ = పద్మములాలయముగాఁ గల లక్ష్మిని; 'లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీ ర్హరిప్రియా' – అని **యమరము.** ఆర = పొందెను. నిజదే = తనను గూడ నిచ్చు. ఆ భగవంతుఁడు ప్రసన్నుఁ డైనచోఁ దననుగూడ భక్తులకు నిచ్చువాఁ డని భావము. ఇది శ్రీరామునకు విశేషణము.

'య ఆత్మదా బలదా' – అని **శ్రుతి.** పరజితి = రావణాదిశత్రువులను జయించిన; రామే = శ్రీరామునియందు; సుగ = మంచి వారిని బొందు; రాజభా = రాజదీప్తి గల; శ్రీః = రాజ్యరూపలక్ష్మి; ఆస = ఉండెను. రాజ్యము వల్లనే రాజతేజస్సు సుగమ మగు నని యర్థము. శ్రీరాముని రాజ్యలక్ష్మి వరించె నని భావము.

**విలోమము – సత్యభామకుఁ బారిజాతప్రాప్తి**

**శ్లో॥ భాజరాగసుమేరా శ్రీసత్యాజిరపదేజని।**

**గౌరభానఘమా క్షామరాగా సా రమతాగ్ర్యసా॥** **60**

**పదవిభాగము:–** భా। అజరాగసుమేరా। శ్రీసత్యాజిరపదే। అజని। గౌరభా। అనఘమా। క్షామరాగా। సా। అరమత। అగ్ర్యసా॥ అజర + అగ + సుమ + ఇరా = అజరాగసుమేరా.

అజర = దేవతలయొక్క; అగ = వృక్ష మగు పారిజాతముయొక్క; సుమ = పువ్వులు; ఇరా = స్థానముగాఁ గల; భా = కాంతి; పారిజాతపుష్పములం దున్న దీప్తి; శ్రీసత్యా = శ్రీమతి యగు సత్యభామయొక్క; అజిరపదే = ప్రాంగణస్థానమునందు; ముంగిట; అజని = పుట్టెను. సత్యభామ గృహాంగణము పారిజాతకుసుమ కాంతులకు నిలయ మయ్యె నని భావము. అత్యద్భుత మగు పారిజాతపుష్పదీప్తి సత్యభామ ప్రాంగణమందుఁ బ్రసరించిన దని చెప్పుటచే శ్రీకృష్ణునిచేఁ బారిజాతవృక్షము సత్యభామాంగణ మందు స్థాపింపఁ బడిన దని ధ్వనించుచున్నది.

ఆ సత్యభామ – గౌరభా = ఇంతకు ముందుకంటెను మిక్కిలి కాంతి గలది ; అనఘమా = నిర్దోష మైన సంపద గలది; క్షామ = క్షీణించిన; రాగా = మాత్సర్యము గలది యయ్యెను. శ్రీకృష్ణుఁడు పారిజాతవృక్షమును దెచ్చి తన పెరటి చెట్టుగా నాటుటచే నారదదత్త



పారిజాతకుసుమమును రుక్మిణి కిచ్చిన శ్రీకృష్ణుని యందు cబారిజాతకుసుమమును గ్రహించిన రుక్మిణి యందుఁ గలిగిన మాత్సర్యమును విడిచి పెట్టిన దని భావము

'రాగోఽ నురాగే మాత్సర్యే' – అని **రత్నమాల.** అగ్ర్యసా = శ్రేష్ఠ మైన జ్ఞానము గలిగిన; 'సమ్' అనఁగా జ్ఞానము. 'సం క్లీబం స్యందనపథే జ్ఞానే ధ్యానే నివారణే' – అని **రత్నమాల.** సా = వివేకవతి యగు నా సత్యభామ. అరమత = శ్రీకృష్ణునితోఁ గ్రీడించుచుండెను. శ్రీకృష్ణుఁడు పారిజాతవృక్షమును సత్యభామ యింటిలో నాటెను. సత్యభామ గృహాంగణ మందుఁ బారిజాతకుసుమకాంతులు విరఁజిమ్మెను. సత్యభామ శ్రీరుక్మిణీ శ్రీకృష్ణులయందున్న మాత్సర్యమును విడిచిపెట్టెను. వివేకవతియై ద్వారకయందే శ్రీకృష్ణునితోఁ గ్రీడించుచుండెను.

**అవతారిక :–** ఇప్పుడు **శ్రీవేంకటాధ్వరిమహాకవి** శ్రీవేంకటేశ్వరస్వామి తనచే నీ దుష్కర ప్రబంధమును నిర్మింపఁ జేసినాఁ డనియు నీ పవిత్రకథాగ్రంథమును సజ్జను లాదరింప వలె ననియుఁ జెప్పుచున్నాఁడు –

**శ్లో॥ శ్రీమద్రాఘవయాదవాకృతిధరః శేషాచలోత్తంసకః**

**శ్రేయోహేతు మచీకరత్ కృతి మిమాం శ్రీశో మయా దుష్కరామ్।**

**తస్మా దత్రపవిత్రమాధవకథాస్వాదోన్మిషత్కౌతుకాః**

**సంతః సాధు విచిన్వతాం గుణవిదః శ్లాఘా మమోఘాదరాః॥** **61**

శ్రీమంతు లగు శ్రీరామునియొక్క శ్రీకృష్ణునియొక్క యాకారములను ధరించిన వాఁడు, శేషాచలమునకు శిరోభూషణ మైన వాఁడు నగు శ్రీశ్రీనివాసుఁడు నాచే (శ్రీవేంకటాధ్వరిచే) శ్రేయోహేతు వగు నీ దుష్కరకృతిని జేయించినాఁడు (రచింపఁజేసినాఁడు.) కావున నిక్కడఁ బవిత్రము లైన శ్రీరామ – శ్రీకృష్ణ కథల నాస్వాదించుటలో వికసించిన కుతూహలము గల వారు, గుణవేత్తలు నగు సత్పురుషు లమోఘ మైన యాదరము గల వారై దీనిని బాగుగా శ్లాఘింతురు గాక!

శార్దూలవిక్రీడితము వృత్తము. 'సూర్యాశ్వై ర్మసజస్తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్' అని కేదారభట్టు **వృత్తరత్నాకర** లక్షణము. శార్దూలములోఁ బ్రతిపాదము నందు – 'మ – స – జ – స – త – త – గ' యను గణము లుండును.

**అవతారిక**:– ఇప్పుడు కవి కావ్యవర్ణితాఖ్యానపూర్వకముగా గ్రంథసమాప్తిని జెప్పుచున్నాఁడు

## – గ్రంథాంతగద్యమ్–

ఇతి శ్రీమత్కాంచీనగరనాయకతాతాచార్య భాగినేయ వాజపేయ సర్వ పృష్ఠాప్తోర్యామాదియాజి శ్రీశ్రీనివాసార్య తనూభవస్య శ్లేషయమకచక్రవర్తినో రఘునాథార్య యజ్వన స్తనయేన శ్రీశ్రీనివాసకృపాతిశయసువిదితనయేన సీతాంబాగర్భసంభవేన

శ్రీమదాత్రేయవేంకటార్యయజ్వనా విరచితం స్వకృతవ్యాఖ్యానసహితం రాఘవయాదవీయాఖ్య మనులోమవిలోమకావ్యం సంపూర్ణమ్.

ఇతి శబ్దము సమాప్తిని సూచించును.

'ఇతి హేతు ప్రకరణ ప్రకాశాది సమాప్తిషు' – అని **యమరము.**

శ్రీమత్ = శ్రీమంత మగు; కాంచీనగర = కంచిపట్టణమునకు; నాయక = నాయకుఁ డగు; తాతాచార్య = తాతాచార్యుల; భాగినేయ = మేనల్లుఁ డైన; వాజపేయ సర్వపృష్ఠ ఆప్తోర్యామాది = ఈ నామములు యజ్ఞవిశేషములు. మొదలుగాఁ గల వానిని; యాజి = యజనము చేసిన వాఁడు; శ్రీశ్రీనివాసార్య = శ్రీశ్రీనివాసార్యునకు ; తనూభవస్య = కొడుకైన వాఁడు నగు; శ్లేషయమకచక్రవర్తినః = ఈ బిరుదు గల ; కవులు తమకుఁ గల బిరుదులను దండ్రులకు విశేషణములుగా వాడుట యొక సంప్రదాయము. రఘునాథార్యయజ్వనః = రఘునాథయాజియొక్క; తనయేన = కుమారుఁడు; శ్రీశ్రీనివాస = శ్రీవేంకటేశ్వరస్వామియొక్క; కృపాతిశయ = దయావిశేషముచే; సువిదిత = బాగుగాఁ దెలిసికొనఁబడిన; నయేన = శాస్త్రనీతి గల వాఁడు; సీతాంబాగర్భసంభవేన = సీతమ్మ కడుపుపంట యైన వాఁడు ; శ్రీమదాత్రేయ = మంగళయుక్త మైన యాత్రేయ గోత్రమునందుఁ బుట్టిన వాఁడు నగు; వేంకటార్య యజ్వనా = వేంకటాధ్వరిచే; విరచితమ్ = విరచింపఁబడినది ; స్వకృతవ్యాఖ్యానసహితమ్ = ఆ కవిచేతనే చేయఁబడిన వ్యాఖ్యానముతోఁ గూడినది; రాఘవయాదవీయాఖ్యమ్ = రాఘవయాదవీయ మను పేరు గల; అనులోమ విలోమ కావ్యమ్. అనులోమ = అవరోహణ పాఠముచే శ్రీరాముని కథ; విలోమ = ఆరోహణపాఠముచే శ్రీకృష్ణుని కథ ప్రతిపాదించు కావ్యము; సంపూర్ణమ్ = పూర్తి యైనది.

రాఘవుని యాదవుని నధికరించి చేసిన గ్రంథము రాఘవయాదవీయము.

**'శిశుక్రందయమసభద్వంద్వేంద్రజననాదిభ్యశ్ఛః'** (4–3–88) అను సూత్రముచే 'రాఘవశ్చ యాదవశ్చ' రాఘవయాదవౌ యను ద్వంద్వసమాసముపై ఛప్రత్యయము.

**'ఆయనేయీనీయియః ఫఢఖఛఘామ్** ప్రత్యయాదీనామ్' (7–1–2) అను సూత్రముచే 'ఈయా' దేశము.

**కిరాతార్జునీయము, రాఘవపాండవీయము, రాఘవనైషధీయము** వలె సమాసము.

ఈ గ్రంథమును రచించిన కవి వేంకటాధ్వరి. తల్లి సీతాంబ. తండ్రి రఘునాథుఁడు. తాత శ్రీనివాసార్యుఁడు. ఇతఁడు కాంచీనగరనాయకుఁ డగు తాతాచార్యునకు మేనల్లుఁడు. ఇట్టి యాత్రేయగోత్రసంభవుఁ డగు వేంకటాధ్వరి రచించినది, స్వవ్యాఖ్యాసహిత మైనది రాఘవయాదవీయ మని సర్వము మంగళము.

**తే॥గీ॥** **పుష్పగిరి శంకరాచార్య పూజ్యపాద**
**దత్త విద్యావిభూషణోద్దండ బిరుద**



**ధారి గరిమెళ్ళ శర్మ యాంధ్రమునఁ జేసె**
**వ్యాఖ్య రాఘవయాదవీయాఖ్యకృతికి.**

గద్యము – ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ కవితావిచిత్ర పరాశర గోత్ర శ్రీగరిమెళ్ళ కృష్ణావధాని పౌత్ర సూర్యనారాయణ సూర్యాంబికాపుత్ర సకలసుకవి బుధజన విధేయ 'సహజపాండిత్య' అచ్యుత సత్యశేషగిరి సోమయాజి శర్మ నామధేయ ప్రణీతం బైన హరిప్రియాఖ్య రాఘవయాదవీయ వ్యాఖ్యానము సర్వంబును సంపూర్ణము.

శ్రీ మ త్ప ర మే శ్వ రా ర్ప ణ మ స్తు.

స్వస్తిశ్రీ ఖరనామసంవత్సర జ్యేష్ఠశుక్ల త్రయోదశీ

సోమవారము. 13 – 6–2011.

మంగళమ్ మహత్

శ్రీః శ్రీః శ్రీః

ఓమ్

శ్రీరామచన్ద్రాయ నమః

**హరిప్రియావ్యాఖ్య**

**ఉదాహృతగ్రంథములు - గ్రంథకర్తలు**